# దేవి కథాసుధ

(దేవి భాగవతం ఆధారంగా దేవీ మహాత్మ్యమును వివరించే కథలు)




"శ్రీవిద్యారత్నాకర", శ్రీవిద్యావిశారద" **క్రోవి పార్థసారథి**

# దేవీ కథాసుధ

(దేవీ భాగవతం ఆధారంగా దేవీ మహాత్మ్యమును వివరించే కథలు)



"శ్రీవిద్యారత్నాకర", శ్రీవిద్యావిశారద"

క్రోవి పార్థసారథి



ఓం నమో వేంకటేశాయ

This Book

## "DEVI KHADHA SUDHA"

Is published with the financial assistance of
Tirumala Tirupathi Devasthanams
under their schemes aid to publish religious books

ప్రథమ ముద్రణము : డిసెంబర్ - 1998

ప్రతులు : 1,000



మూల్యము : రూ. 60/-

ప్రతులకు :

**శివ కామేశ్వరీ గ్రంథమాల**

41-22/4-36, భ్రమరాంబపురం,

విజయవాడ - 520 013.

ఫోన్ : 522824

Phone : 2707 (Tenkasi)



HIS HOLINESS JAGADGURU
**SRI SIVA CHIDANANDA BHARATHI SWAMI**
Sri Siddheswari Peetadhipati
Courtaliam - 627 801.
(Via) Tenkasi - Tirunelveli Dist. --- South India
With Narayanasmritis

5-5-1997

# అభినందన

దేవీ పూజలో కౌళ, సమయ మతములు, శ్రీ చక్రాంతర్గత రహస్యములు.
భిన్న సంప్రదాయములలో పంచదశీ మహామంత్రము, షట్చక్రభేదనదేవి
సాక్షాత్కారము, మొదలైన విషయములు పామరులకు కూడా
అర్థమయ్యే రీతిలో శ్రీ క్రోవి పార్థ సారధిగారు వ్రాసిన

## "శ్రీ విద్యాదర్శనము"

గ్రంథా విష్కరణ సమయమున వారిని అభినందిస్తూ
కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠ మహా సంస్థానామోదమున గ్రంథకర్తను

## శ్రీ విద్యారత్నాకర

అను బిరుద రాజముతో సన్మానించడమయినది.

ఇతి నారాయణస్మృతిః

# ముందుమాట

పరమాత్మ నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు. ప్రకృతిలోని అన్ని రూపాలలోనూ తానే నిండి ఉన్నాడు. చరా చం ౹జగత్తులోని అష్టదిక్కులు, అడవులు, కొండలు, ఎడారులు, లోయలు, పర్వతాలు, నదులు, సముద్రాలు, మానవులు, పశువులు, పక్షులు, చెట్లు, చేమలు అన్నీ పరబ్రహ్మ స్వరూపమే. అతడే ఈశ్వరుడు. తాను బింబము. ప్రతిబింబము శక్తి. అందుకనే శివశక్తులకు భేదం లేదని చెప్పబడుతోంది.

భక్తుల యొక్క కోర్కెలు తీర్చటానికి ఆ పరంధాముడు ఒక ఆకారం దాల్చాడు. అదే పరమేశ్వరీ స్వరూపము. అజ్ఞానులైన భక్తులను ఉద్ధరించటానికి, వారికి జ్ఞానమార్గం చూపటానికే నిరాకారుడైన పరమేశ్వరుడు సాకారుడైనాడు. అదే పరమేశ్వరి.

ఆజగన్మాత తన భక్తులను ఏరకంగా రక్షించిందీ వివరించే కథల సంపుటే దేవీకథాసుధ. దేవీ భాగవతాన్ని ఆదారంగా చేసుకుని వ్రాసిన ఈగ్రంథంలో మొత్తం 68 కథలున్నాయి.

పరమేశ్వరుని ప్రతిరూపమే పరమేశ్వరి. సృష్టిస్థితిలయకారిణి, త్రిగుణాత్మిక. ఆమె సృష్టి స్థితి లయాల కోసం త్రిమూర్తులను సృష్టించింది. వారికి సహాయంగా ఉండటానికి తన అంశలైన సరస్వతి, లక్ష్మి, పార్వతులను వారికిచ్చింది. దేవతలను సృష్టించి ఈజగత్తును జాగ్రత్తగా పాలించమన్నది. ఘోరమైన తపస్సు చేసిన భక్తుల కోరికలు తీర్చింది. వారిలో జీవాత్మను పరమాత్మతో లయం చేసిన యోగిపుంగవులు కొందరైతే, తామసప్రవృత్తితో అర్థం లేని కోరికలు కోరి ఆ వరప్రభావంతో లోకాలను బాధించిన వారు కొందరు. వారే రాక్షసులు. దేవతలూ, రాక్షసులూ ఒక తండ్రి బిడ్డలే. వారిగురువులైన బృహస్పతి, శుక్రాచార్యుడు ఒక గురువువద్దనే విద్యాభ్యాసం చేశారు. దేవదానవులిద్దరూ పరమేశ్వరిని ఆరాధించారు. దేవతలు లోక కళ్యాణం కోసం పాటుపడితే రాక్షసులు లోక వినాశనానికి కారకులయ్యారు.అందుకని రాక్షస సంహారం చెయ్యటానికి కొన్ని సార్లు ఆపరమేశ్వరియే భూలోకంలో అవతరించవలసివచ్చింది. మహిషాసురుడు, భండాసురుడు, శుంభ నిశుంభులు మొదలైన వారందరూ దేవి చేతిలో మరణించిన వారే.

పరమేశ్వరి రాక్షస సంహారము ఏవిధంగా చేసింది? తన భక్తులైన ప్రియవ్రతుడు, సుదర్శనుడు మొదలైన వారిని ఏరకంగా రక్షించింది అనే విషయాలను తెలియ చేసేదే ఈగ్రంథం.

భగవంతుడు ఉన్నాడని, అతణ్ణి నమ్మినవారికి కష్టాలు తీరుతాయని చెబుతూ దేవీభాగవతం ఆధారంగా వ్రాసిన గ్రంథమే దేవీకథాసుధ.

దేవి భక్తులంతా చదివి తీరవలసిన ఉత్తమ గ్రథం.

1.8.98న శ్రీవిద్యారహస్యం అనే గ్రంథాన్ని ఆవిష్కరించినపుడు స్వామీ వాసుదేవానందగిరి వారు మాట్లాడుతూ 1999 జనవరి నెలలో లలితా సహస్ర కుండయాగం చేస్తాము. అందులో పదిరోజులూ మీరే ఉపన్యసించాలి అన్నారు. ఆ పదిరోజుల్లోనూ భక్తుల కోసమని దేవీ భాగవతం నుంచి కొన్ని కథలు వ్రాసుకున్నాను. తరువాత అలా అలా కథలు వ్రాస్తూ చివరకు దేవీకథాసుధ పేరుతో ఒక గ్రంథమే వచ్చింది. ఈగ్రంధాన్ని పూర్తి ప్రేరణ స్వామీ వాసుదేవానందగిరి వారిది. అదీ గాక ఈగ్రంథం ప్రత్యేకించి 23.12.98 నుంచి 1.1.99 వరకు విజయవాడలో జరిగే లలితా సహస్రకుండయాగం కోసమని వ్రాయబడింది.

ఈగ్రంథ రచనలో ఒకరోజు దేవీ విరాట్స్వరూపం గురించి వ్రాస్తున్నాను. రాత్రి 12-30 గం॥అయింది. అందరూ నిద్రలో ఉన్నారు. నేను తలవంచుకుని పరమేశ్వరిని గురించి వ్రాస్తున్నాను. నాప్రక్కనే ఉన్న చిన్న స్టూలు మీద, ఎర్రని చీర కట్టుకని, కూర్చుని చూస్తోంది ఒకావిడ. నేను తలెత్తి చూశాను. ఆస్టూలు మీద దేవీ భాగవతం పుస్తకాలు తప్ప మరేమీ లేవు. ఈరకంగా అపరమేశ్వరి తనను గురించి వ్రాసే గ్రంథం ఎలా ఉన్నదో అని ప్రత్యక్షంగా చూసుకుంది. గ్రంథం వ్రాయటం పూర్తయింది ఒకరోజున. రాత్రి ఒంటిగంట పోయిపడుకున్నాను. నిద్రపట్టటంలేదు. ఒకటే ఆవేదన. ఈపుస్తకం బయటకి ఎలావస్తుంది? సరిగ్గా రాగలుగుతుందా? ఇవే ప్రశ్నలు. కళ్ళుమూసుకునే ఉన్నాను. నిద్ర మాత్రం రావటంలేదు. అంతలోనే రెండు సింహాసనంలాంటి కుర్చీలు. వెనకాల ఎరుపురంగులో ఉన్నాయి. వాటిలో స్త్రీ పురుషులు ఇద్దరు. పార్వతీ పరమేశ్వరులు. ఆమె ఎర్రటి చీర, సకలాభరణాలు ధరించి ఉన్నది. నెత్తిన కిరీటం కూడా ఉన్నది. ధగద్ధగాయమానంగా మెరిసిపోతోంది. ఏరూపాన్నైతే చూడాలని సిద్ధులూ, యోగులూ, ఋషులూ తపస్సు చేస్తుంటారో, ఏరూపాన్ని దర్శించాలని మహానుభావులు తపించి పోతుంటారో, ఎవరిని తెలుసుకోవటం కోసం త్రిమూర్తులు కూడా పరితపిస్తూ ఉంటారో, అరూపం. సృష్టిస్థితి లయకారిణి పరమేశ్వరి. ఆజగన్మాత. సభర్తృకయై ఉన్నది. నాదగ్గరగా ఉన్నారిద్దరూ. వెంటనే వంగి ఆదేవి పాదాలమీద తలవాల్చి నమస్కారం చేశాను. అప్పుడు చూశాను ఆపాదాలు. అవి మామూలు పాదాలు కావు. బంగారపు పాదాలు. ఎంత చక్కగా ఉన్నాయో. ఎంతబాగా మెరుస్తున్నాయో. పాదాల మీద నాశిరస్సు ఉంచి నమస్కరించాను. ప్రక్కనే పరమేశ్వరుడు. తెల్లటి పట్టుపంచె ఆభరణాలు ధరించి ఉన్నాడు. చిత్రం ఏమంటే ఆయన పాదాలు వెండి పాదాలు. తళతళా మెరుస్తున్నాయి. ఆపాదాల మీద కూడా శిరస్సు ఉంచి నమస్కరించాను. అంతే మరుక్షణంలో వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు. నేను కళ్ళు తెరిచి చూశాను. గది అంతా చీకటి. వెంటనే కళ్ళు మూసుకున్నాను మళ్ళీ కనిపిస్తారేమోనని. కాని కనిపించలేదు. ఇది కలకాదు. నేను నిద్రపోవటం లేదు. గ్రంథం పూర్తి అయిన

తరువాత ఈరకంగా పరమేశ్వరి దర్శనమిచ్చింది. ఈవిధంగా ఈగ్రంథం అంతా ఆదేవి పర్యవేక్షణలోనే వ్రాయబడింది.

ఈగ్రంథరచనలో నాకు అన్ని విధాల సహకారం అందించిన శాతవాహన కళాశాల తెలుగు లెక్చరరు శ్రీపింగళి వేంకట కృష్ణారావు గారికి నాకృతజ్ఞతలు. నాభార్య శ్రీమతి రమాదేవికి అభినందనలు.

ఈ గ్రంథం ముద్రణకు ఇతోధికంగా ద్రవ్య సహాయం చేసిన లోకపాలకుడు తిరుమలగిరి వాసి, అనాథరక్షకుడు, ధర్మ సంస్థాపనాధికారి, శాశ్వతముక్తి ప్రదాత అయిన శ్రీశ్రీశ్రీ వేంకటేశ్వర స్వామి వారి పాదార విందములకు నానమస్సుమాంజలులు. వారి సిబ్బందికి నాకృతజ్ఞతలు.

దేవీ భాగవతాన్ని అత్యంత సులభశైలిలో, కథలరూపంలో మీముందుకు తేవటానికి చేసిన నా ఈచిన్ని ప్రయత్నాన్ని పరమేశ్వరి భక్తులు ఆదరిస్తారని భావిస్తూ

24-12-1998.

విజయవాడ.

బుధజన విధేయుడు

క్రోవి పార్థసారథి.

జ్యోతిష విజ్ఞానపీఠం, విజయవాడ.

'శ్రీవిద్యా రహస్యం' గ్రంథావిష్కరణ



గ్రంథకర్త శ్రీ [illegible] సువర్ణ హస్త [illegible] కరిస్తున్న స్వామి 'వాసుదేవానందగిరి'



'శ్రీ విద్యాదర్పణము' గ్రంథావిష్కరణ చేస్తున్న దత్త పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామి

# విషయసూచిక

# 1. హయగ్రీవుడు

ఒకప్పుడు విష్ణుమూర్తి రాక్షసులతో ఘోరంగా కొన్నివేల సంవత్సరాలు పోరాడి అలసిపోయి ఏకాంత ప్రదేశానికి వెళ్ళి ఎక్కుపెట్టిఉన్న వింటికొనదగ్గర తలపెట్టి గాఢంగా నిద్రపోతున్నాడు. అప్పుడు దేవతలు ఒక యజ్ఞం చెయ్యాలని సంకల్పించి దానికి విష్ణువును ఆహ్వానించటానికి వైకుంఠం వెళ్ళారు. విష్ణువు అక్కడలేడు. దాంతో యోగశక్తి తో విష్ణువు ఎక్కడ ఉన్నదీ కనిపెట్టి అక్కడికి చేరారు. అయితే విష్ణువు గాఢనిద్రలో ఉన్నాడు. మరి లేపటం ఎలా? ఏంచెయ్యాలి అని ఆలోచిస్తుండగా శివుడు బ్రహ్మను చూసి " సృష్టికర్తా! ఒక చిన్న పురుగును సృష్టించివదులు. అది వెళ్ళి వింటిని కొరుకుతుంది. దానివల్ల కొనతెగిపోతుంది. విష్ణువు లేస్తాడు. మనపని పూర్తవుతుంది. అన్నాడు. ఆమాటకు సరేనని బ్రహ్మ ఒక పురుగును సృష్టించి వదిలాడు. అది బ్రహ్మను చూసి "స్వామి! తల్లీ పిల్లలని విడదీయటం, భార్యాభర్తలకు ఎడబాటుకలిగించటం, నిద్రపోయే వాళ్లని లేపటం మహాపాపం కదా! మరినన్ను ఆ పాపపు పని ఎలా చెయ్యమంటావు? అంది. దానికి బ్రహ్మ నీకు పాపం రాకుండా వరమిస్తున్నాను. ఇది లోకల్యాణంకోసం చేసేకార్యం అందుచేత నీ ఉపకారానికి ప్రతిఫలంగా యజ్ఞాలలో అగ్నికి ఆహుతి కాని పదార్థం నువు తీసుకునేందుకు అనుమతిస్తున్నాను. అన్నాడు. అప్పుడు ఆ పురుగు సంతోషంతో వెళ్ళి వింటికొనను కొరికి వేసింది. ఎంటినారి ఎప్పుడైతే తెగిందో అప్పుడు భీకరమైన శబ్దంపుట్టింది. ధనుస్సు బద్ద తగిలి విష్ణువు తల ఎగిరి అవతలపడింది. దేవతలు అనుకున్నది ఒకటి,జరిగింది ఒకటి అయింది. సంతోషానికి బదులు దేవతలకు భరించలేని బాధ ఎదురయింది. "దేవతలకు ఏకష్టం వచ్చినా ఇంతవరకు రక్షిస్తున్నవాడు విష్ణుమూర్తి. అలాటివాడికి ఇవాళ ఇంతటికష్టం వచ్చింది. ఇదంతా మాయా ప్రభావం ఇప్పుడు ఏదిదిక్కు? అని విచారించసాగారు. అప్పుడు దేవరాజైన ఇంద్రుడు మొదలైనవారు దేవగురువైన బృహస్పతి సలహాపై పరమేశ్వరిని ప్రార్థించగా ఆ దేవి ప్రత్యక్షమై

సురలారా! మీభక్తి ప్రపత్తులకు సంతోషించాను, విష్ణువుతల ఈరకంగా తెగిపడటం లక్ష్మీదేవి శాపఫలం. పూర్వం ఒకనాడు విష్ణువు లక్ష్మీదేవితో విహరిస్తూ ఆమె ముఖంచూసి నవ్వాడు. భర్త తన ముఖంచూసి ఎందుకు నవ్వాడో తెలియలేదు లక్ష్మీ దేవికి. ఆయన తనను హేళన చేస్తున్నాడా? లేక ఎవరైనా సవతిని తెస్తున్నాడా? అని అనుమానం వచ్చింది.

అంతే! వెంటనే విష్ణువు తలతెగి సముద్రంలో పడుగాక! అని శపించింది. ఆ శాపంవల్ల ఇప్పుడు ఇతని తల తెగిపోయింది. అదీగాక

ఒకప్పుడు హయగ్రీవుడనే రాక్షసుడు నన్ను గూర్చి సరస్వతీ నదీతీరాన వేయి సంవత్సరాలు ఘోరతపస్సు చేశాడు. వాడి తపస్సుకు మెచ్చి నేను ఏదయినా వరంకోరుకోమన్నాను. ఎవరి వల్లా చావులేకుండా వరం కావాలన్నాడు రాక్షసుడు. పుట్టిన ప్రతిప్రాణీ మరణించక తప్పదు. అలాగే మరణించిన ప్రతి ప్రాణీ తిరిగి పుట్టకా తప్పదు. అందుచేత ఇంకేదయినా వరం కోరుకోమ్మన్నాను. అప్పుడు వాడు హయగ్రీవుడితో తప్ప ఇంకెవరివల్లా చావులేకుండా వరంకావాలన్నాడు. ఆ వరగర్వంచేత ఇప్పుడు వాడు లోకాలన్నింటినీ బాధిస్తున్నాడు. వాడిచావుకోసం మీరు విష్ణుమూర్తికి గుర్రపుతల తెచ్చి అతికించండి. ఇతడు హయగ్రీవుడై జీవిస్తాడు. రాక్షస సంహారమూ చేస్తాడు. లోకాలకు పట్టిన పీడవదుల్తుంది" అని చెప్పి అదృశ్యురాలయింది.

తరువాత దేవతలు ఒక హయము యొక్క గ్రీవము తెచ్చి విష్ణువుకు అతికించారు. అప్పుడు ఈ హయగ్రీవుడు ఆ రాక్షసుణ్ణి సంహరించి లోక పాలన చేశాడు.

ఈరకంగా లక్ష్మీదేవి శాపం వల్ల తలతెగిపోయిన విష్ణువు ఆ పరమేశ్వరి దయవల్ల హయగ్రీవుడై లోకాలను రక్షించాడు.



# 2 మధుకైటభులు

క్షీరసాగరంలో శ్రీమహావిష్ణువు శేషశాయియై నిద్రిస్తున్నాడు. అప్పుడు ఆయన చెవిలో నుంచి వచ్చిన గుబిలి నుంచి ఇద్దరు రాక్షసులు పుట్టారు. ఒకడి పేరు మధువు. రెండవవాడు కైటభుడు. వాళ్ళిద్దరూ నీళ్ళతో ఆడుతూ, ఆమహాసముద్రాన్ని చూసి ఇంతనీరు ఇక్కడ ఎలానిలిచింది? దీనికి ఆధారం ఏమిటి? అలాగే మనపుట్టుకకు ఆధారం ఏమిటి? అని విచారిస్తుండగా వారికి వాగ్బీజం వినిపించింది. దాన్నే మంత్రంగా తీసుకుని నిరాహారులై వేయిసంవత్సరాలు వారు తపస్సు చేశారు. వారి దీక్షకు మెచ్చి ఆజగన్మాత ప్రత్యక్షమై ఏదైనా వరం కోరుకోండి అంది, వెంటనే వారు మాకు స్వచ్ఛంద మరణం కావాలన్నారు. 'తథాస్తు' అన్నది పరమేశ్వరి.

వారు ఆ జలాలలో తిరుగుతూకొంత కాలానికి పద్మాసనుడైన బ్రహ్మను చూసి మాతో యుద్ధానికి రా! అన్నారు. బ్రహ్మ సమాధానం చెప్పలేదు. దానికి అసురులు కినిసి మాతో యుద్ధం చేస్తావా? లేక మాచేతిలో చస్తావా? ఏదో ఒకటి త్వరగా తేల్చుకో అన్నారు. భయంతో బ్రహ్మ పద్మాసనం వదిలి పెట్టి, దాని కాడగుండా క్రిందికి దిగాడు. అక్కడ విష్ణుమూర్తి యోగ నిద్రలో ఉన్నాడు. తనను రక్షించవలసిందిగా తండ్రి దగ్గర మొరపెట్టుకున్నాడు. విష్ణువు ఉలకలేదు. పలకలేదు. బ్రహ్మరోదన అంతా అరణ్యరోదన అయింది. విష్ణుమూర్తి గనక నిద్రలేస్తేఆ రాక్షసులను తప్పకుండా సంహరిస్తాడు. అది మామూలు నిద్రకాదు యోగనిద్ర. మాయచే ఆవరించబడి ఉన్నాడు. ఆయన నిద్ర లేవాలంటే ఆ మాయ కరుణించి ఆయన్ను వదలాలి. ఆపరాశక్తి స్వరూపమే మాయ. అందుకని బ్రహ్మ ఆపరాశక్తిని ప్రార్థించటంమొదలు పెట్టాడు.

త్వం స్వాహా త్వం స్వధా త్వం హి వషట్కారః స్వరాత్మికా।
సుధా త్వమక్షరే నిత్యే త్రిధామాత్రాత్మికా స్థితా ॥

అర్ధమాత్రా స్థితా నిత్యా యానుచ్చార్యా విశేషతః ।
త్వమేవ సా త్వం సావిత్రీ త్వం దేవజననీ పరా ॥

త్వయైతద్ధార్యతే విశ్వం త్వయైతత్ సృజ్యతే జగత్ ।
త్వయైతత్ పాల్యతేదేవి త్వమత్స్యన్తే చ సర్వదా ॥

విసృష్టౌ సృష్టిరూపా త్వం స్థితి రూపా చ పాలనే ।
తథా సంహృతి రూపాన్తే జగతోస్య జగన్మయే॥

మహావిద్యా మహామాయా మహామేధా మహాస్మృతిః ।
మహామోహా చ భవతీ మహాదేవీ మహాసురీ ॥
ప్రకృతి స్త్వం చ సర్వస్య గుణత్రయవిభావినీ ।
కాళరాత్రిర్మహారాత్రిర్మోహరాత్రిశ్చ దారుణా ॥

త్వం శ్రీ స్త్వమీశ్వరీ త్వం హ్రీం స్త్వం బుద్ధిర్బోధలక్షణా ।
లజ్జా పుష్టిస్తథా తుష్టిస్త్వం శాన్తిః క్షాన్తిరేవ చ ॥

ఖడ్గినీ శూలినీ ఘోరా గదినీ చక్రిణీ తథా ।
శఙ్ఖినీ చాపినీ బాణ భుశుణ్డీ పరిఘాయుధా ॥

సౌమ్యా సౌమ్యతరా శేషసౌమ్యేభ్యస్త్వతి సున్దరీ ।
పరాపరాణాం పరమా త్వమేవ పరమేశ్వరీ ॥

యచ్చ కిఞ్చిత్క్వచిద్వస్తు సదసద్వాఖిలాత్మికే ।
తస్య సర్వస్య యాశక్తిః సా త్వం కిం స్తూయసే మయా ॥

యయా త్వయా జగత్ స్రష్టా జగత్పాతాత్తి యో జగత్ ।
సో పి నిద్రావశం నీతః కస్త్వాం స్తోతుమహేశ్వరః ॥

విష్ణుఃశరీరగ్రహణమహమీశాన ఏవచ ।
కారితా స్తే యతో తస్త్వాం స్తోతుం శక్తి మాన్భవేత్ ॥

సాత్వమిత్థం ప్రభావైః స్వై రుదారైర్దేవి సంస్తుతా ।
మోహయైతౌ దురాధర్షా వసురౌ మధుకైటభౌ ॥

ప్రబోధం చ జగత్స్వామీ నియతా మచ్యుతో లఘు ।
బోధశ్చ క్రియతా మస్య హన్తుమేతౌ మహాసురౌ ॥

తల్లీ దేవతలకు హోమములో ఆహుతులర్పించేటప్పుడు చెప్పే స్వాహ మంత్రమునీవే. పితృదేవతలకు తర్పణలిచ్చేటప్పుడు చెప్పే స్వధామంత్రమూ నీవే. యజ్ఞము నీవే. యజ్ఞము వలన సాధించబడే స్వర్గమూ నీవే. యజ్ఞములందు చెప్పే వషట్కారము నీవే. నీవు అమృతవు. నాశనములేనిదానివి. శాశ్వతమైన దానివి. త్రిమాత్రలతో కైడిన (అఉమ్) ఓంకారమునీవే. ప్రణవము చివరనుండు నాదమూ నీవే. దేవమాత సావిత్రివినీవే.

నీచేతనే ఈవిశ్వము సృష్టింపబడుచున్నది. నీచేతనే పాలింపబడుచున్నది. నీచేత నేలయముకావింపబడుచున్నది. సృష్టికాలములో సృజన శక్తిని. స్థితి కాలమున పాలనాశక్తివి. లయకాలమున సంహారశక్తివి. అజ్ఞానమయివి నీవే. మహాజ్ఞాన మయివినీవే. బుద్ధి, స్మరణశక్తి, భ్రాంతానీవే. మహాఅసురివి నీవే. మహాదేవివినీవే. అన్నింటికీ మూలమైన ప్రకృతివి నీవే త్రిగుణాత్మకవు నీవే. కల్పాంతాన వాళరాత్రివి. ప్రళయకాలంలో మహారాత్రివి, భయంకరమైన మోహరాత్రివి నీవే. నీవు లక్ష్మివి, ఈశ్వరివి. బుద్ధి, లజ్జ,పుష్టి,తుష్టి,శాంతి,ఓరిమి అన్నీనీవే. ఖడ్గము,శూలము,గద,చక్రము,ధనుస్సు,బాణములు,భుశండి, పరిఘ (ఇనపకట్లగద) ధరించిన భయంకర స్వరూపిణివినీవే. శాంతమూర్తివి, శుభంకరివినీవే. సత్తు,అసత్తునీవె. వస్తువులకు గల గుణము నీవె.

తల్లీ సృష్టి స్థితి లయాలు చెయ్యమని మమ్మల్ని నియమించావు. స్థితికారకుడైన శ్రీమహావిష్ణువు నీమాయతో యోగ నిద్రలో ఉన్నాడు. ఈరాక్షసులు నన్ను చంపటానికి వస్తున్నారు. కాబట్టి ఓతల్లీ! నువు ఆవిష్ణువును వదలినట్లైతే అతడు లేచి రాక్షస సంహారం చేస్తాడు. దయచేసి నన్ను రక్షించవలసింది.

బ్రహ్మదేవుని ప్రార్థన ఆలకించిన పరమేశ్వరి స్వరూపమైనమాయ విష్ణువును వదిలింది. అప్పుడు విష్ణు మేల్కొని బ్రహ్మను చూసి ' కుమారా: తపస్సువిడిచి ఎందుకిలావచ్చావు. నీదిగులుకూ, భయానికీ కారణం ఏమిటి? అన్నాడు. పద్మాసనుడు జరిగిన వృత్తాంతమంతా వివరించి ఆరాక్షసులబారినుండి తనను కాపాడమని వేడుకున్నాడు.

ఇంతలో మధుకైటభులు బ్రహ్మను వెతుక్కుంటూవచ్చి "మమ్మల్ని తప్పించుకుని పారిపోదామనుకుంటున్నావా? ఎక్కడదాక్కున్నా వచ్చి నీపని పడతాం. చచ్చేవాడివి నువు ఒక్కడివీ చావకుండా ఈపెద్దమనిషిని కూడా నీతో తీసుకుపోదామనుకుంటున్నావా?భలేవాడివి. ఒక్కమాటవిను. చేస్తావా మాతో యుద్ధం చెయ్యి. లేదా ఓడిపోయాను మీ సేవకుడను అని ఒక్కమాట అను అన్నారు.

అప్పుడు విష్ణువు తనకుమారుణ్ణి తనవెనుకదాచి నేనుండగా మీరు అతడి జోలికి వెళ్ళలేరు జాగ్రత్త అని బెదిరించాడు. అదే అదనుగాతీసుకుని ఆరాక్షసులు విష్ణుమూర్తితో తలపడ్డారు. వాళ్ళలో మొదటి వాడైన మధువు ముందుగా విష్ణువుతోయుద్ధానికి దిగాడు. రెండవ వాడు విచిత్రం చూస్తున్నాడు. మధుసూదనుల మధ్యఘోరమైన పోరుజరుగుతోంది. ఆపోరుకు సముద్రం అతలాకుతలమవుతోంది. కొంత కాలానికి మధువు అలసిపోయాడు. అదిచూసి కైటభుడు మాధవునితో తలపడ్డాడు. మధువు విశ్రాంతి తీసుకుంటూ వినోదం చూస్తున్నాడు. ఈ రకంగా మధుకైటభులు ఒకరి తరువాత ఒకరుగా విష్ణువుతో యుద్ధంచేస్తున్నారు. ఈరకంగా ఐదు వేలసంవత్సరాలు గడిచింది. విష్ణువుచాలా అలసిపోయి వీరిని జయించటం ఎలాగా? అని ఆలోచిస్తున్నాడు. అది కనిపెట్టి రాక్షసులు భయపడకు.

మమ్మల్ని జయించేశక్తిలేకపోతే మీదాసుణ్ణి అని ఒక మాటఅను. బ్రతికి పోతావు. లేదా ముందు నిన్ను, ఆతరువాత పద్మాసనుణ్ణీ చంపేస్తాం అన్నారు.

అలసిఉన్న వాడితోను, భయంతో క్రిందపడిపోయిన వాడితోను, పారిపోతున్న వాడితోను యుద్ధంచెయ్యకూడదు. అదీ గాక మీరిద్దరు నేను ఒకణ్ణి. మీరు ఒకరి తరువాత ఒకరు విశ్రాంతి తీసుకుంటున్నారు. నాకు విశ్రాంతిలేదు. కాబట్టి నాకు కొంతసేపు విశ్రాంతి ఇవ్వండి. తరువాత మీతో యుద్ధంచేస్తాను అన్నాడు విష్ణుమూర్తి.

ఆరాక్షసులిద్దరూ కొంతసేపు ఆలోచించి సరే అలాగే కానీ, మేము కూడా కొంతసేపు విశ్రమిస్తాము అన్నారు. విశ్రాంతితీసుకుంటున్నవిష్ణువు, ఈరాక్షసులు ఆపరమేశ్వరివల్ల వరంపొందిఉన్నారు. వీళ్ళనిచంపటంసాధ్యంకాదు. అది ఆదేవివల్లనే జరగాలి. అని ఆమెనుప్రార్థించాడు. జగన్మాత ప్రత్యక్షమై 'మాధవా'వాళ్ళమీద నామాయ ప్రయోగిస్తాను. నువు వాళ్ళను హతమార్చు అంది. విష్ణువు ఈసారి వాళ్ళతో యుద్ధానికి దిగుతూనే ఒక్కదెబ్బతో వారిని కింద పడేశాడు. ఆదెబ్బకు నివ్వెరపోయిన రాక్షసులతో 'ఏమిటి? ఒక్కదెబ్బకే అలా పడిపోయారు. గతంలోనేను చాలా మంది రాక్షసులతో యుద్ధంచేశాను. కాని ఇంతకాలంనన్నుఎదిరించి నాతోయుద్ధం చేసిన వాళ్ళులేరు. మీశక్తిని మెచ్చుకుంటున్నాను. ఏవరం కావాలో కోరుకోండి ఇస్తాను అన్నాడు. ఆమాటకు మధుకైటభులుఒక్కసారిగా ఉలిక్కిపడి నువు వరం ఇవ్వటమూ, మేం పుచ్చుకోవటమూనా? మాఖర్మ ఏంకాలిపోయింది? నీకేంకావాలో కోరుకో. మేమే ఇస్తాము అన్నారు.

అవకాశాన్ని చేజార్చుకోలేదు విష్ణువు. వెంటనే నాతో యుద్ధం చేసి నాచేతిలో మీరు చావాలి. ఇదే నాకోరిక అన్నాడు. దానికి ఆరాక్షసులు అలాగే నీకోరికతీరుస్తాం. కానీ నీరు లేనిచోట మాతో యుద్ధంచెయ్యి. అన్నారు. అప్పుడు విష్ణుమూర్తితన తొడలను విశాలంగా పెంచాడు. రాక్షసులు తమశరీరాలను పెంచారు. విష్ణువు వారిశరీరాలకన్న తనఊరువులను బాగా కొన్ని రెట్లుపెద్దవిగా పెంచేశాడు. రాక్షసులశరీరాలు విష్ణువుయొక్కఊరువులక్రింద పడిఅణిగి పోసాగాయి. అప్పుడు విష్ణుమూర్తి సుదర్శన చక్రాన్ని ప్రయోగించి మధుకైటభుల తలలు తెగనరికాడు. ఆదెబ్బకి రాక్షసులమెదడు సముద్రంలో పడి ఆప్రదేశమంతా పెద్ద దిబ్బగా అయిపోంది.అప్పటినించీ భూమికి మేదిని అనిపేరు వచ్చింది.

ఈవిధంగా దేవి అనుగ్రహంవల్ల వరాలు పొంది అహంకరించిన రాక్షసులను లోక కల్యాణం కోసం ఆదేవి దయచేతనే సంహరించటంజరిగింది.

# 3. శుకమహర్షి

బ్రహ్మమానసపుత్రుడు వసిష్ఠుడు. ఆయన కుమారుడు శక్తి. అతని కుమారుడు పరాశరుడు. పరాశరుడికి మత్స్యగంధి వలన కలిగిన కుమారుడు కృష్ణద్వైపాయనుడు. ఇతడే వేదాలను విభజించిన వేదవ్యాసుడు.

పున్నామ నరకం నుంచి తప్పించేవాడు పుత్రుడు. అందుచేత పుత్రుడు కావాలనే కోరికతో వ్యాసుడు హిమాలయాలకు వెళ్ళి పరాశక్తిని గురించి తపస్సు చెయ్యటం ప్రారంభించాడు. అతని తపోదీక్షకుమెచ్చిపరమశివుడు ప్రత్యక్షమై వరమిచ్చాడు. వ్యాసుడు ఆశ్రమానికి వచ్చి అగ్నికార్యం చెయ్యటం కోసం అరణి మథించాడు. తేజోవంతమైన అగ్ని పుట్టింది. ఆ అగ్నిని చూసి ఈరకంగా అగ్ని తేజస్సు కలకుమారుడు పుడితే బాగుంటుంది. కాని అరణివంటి స్త్రీ ఉండాలికదా! అనుకుంటూ తలపైకి ఎత్తాడు. ఘృతాచి అనే దేవకాంత కనిపించింది. వ్యాసుడి మనసు దాని మీదకి పోయింది. ఆవిషయం తెలుసుకున్న ఘృతాచి వ్యాసుడికి భయపడి చిలకరూపం దాల్చి ఎగిరిపోయింది.

వ్యాసుడి మనస్సు కుదుటపడలేదు. ఘృతాచిని గురించే ఆలోచిస్తున్నాడు. అరణి మథిస్తున్నాడు. ఘృతాచి వ్యామోహంలో ఉన్న వ్యాసుడికి రేః పతనమైంది. వెంటనే అరణిలోనుంచి తేజస్సుతో మగశిశువు జన్మించాడు. పరమేశ్వర వరప్రసాదంగా భావించి ఆపిల్లవాడికి జాతక కర్మచేసి శుకుడు అని నామకరణం చేశాడు.

తండ్రికి లాగానే కొడుక్కి గూడా పుట్టుకతోనే వేదాలు, శాస్త్రాలూ పట్టు బడ్డాయి. బృహస్పతి దగ్గర విద్యనభ్యసించాడు. ఒకనాడు ఆకాశంనుంచి శుకుడికోసం కృష్ణాజినం, దండ కమండలాలు క్రిందపడ్డాయి.

శుకుని విద్యాభ్యాసం పూర్తి అయింది. కుమారుడికి వివాహం చెయ్యాలని నిశ్చయించాడు వ్యాసుడు. కులవతి గుణవతి అయిన పిల్లను చూసి శుకుణ్ణి వివాహం చేసుకోమన్నాడు. తండ్రి మాటవినలేదు శుకుడు. బ్రహ్మచారిగానే జీవితం గడుపుతానన్నాడు. ఇద్దరికీ వాదోపవాదనలు జరిగాయి. చివరకు వ్యాసుడు శుకుడితో జనక మహారాజును కలిసి ఆయన ఏది చెబితే అదిచెయ్యి"అన్నాడు. జనకుడి దగ్గరకు వెళ్ళటం ఇష్టంలేదు శుకుడికి. అయినాతండ్రిమాట కాదనలేక వెళ్ళాడు.

జనకుడు శుకుడికి స్వాగతసత్కారాలందించి కుశల ప్రశ్నలు వేశాడు. అప్పుడు తన తండ్రికీ తనకీ జరిగిన సంభాషణ అంతా వివరించి తనకు వివాహం చేసుకోవటం ఇష్టంలేదు. కావలసింది మోక్షం. దాన్ని సాధించటం ఎలాగో చెప్పవలసింది అన్నాడు శుకుడు. దానికి జనక మహారాజు ఈవిధంగా చెప్పాడు.

విద్యాభ్యాసం పూర్తి అయిన తరువాత తగిన పిల్లను చూసి వివాహం చేసుకుని ధర్మమార్గాన సంసారం చేసి, కొడుకులను, మనమలను చూసి ఆతరువాత వానప్రస్థం

స్వీకరించి అరిషడ్వర్గాలను జయించి చివరకు సన్యాసం స్వీకరించాలి. అంతే కాని వివాహం చేసుకోకుండా ఉండటమనేది ఆచారవిరుద్ధం. సంసారజీవితం అనుభవిస్తేనే కాని వైరాగ్యం రాదు. జీవితం మీద విరక్తి కలగకుండా సన్యాసం తీసుకుంటే అది అదఃపతనానికి దారి తీస్తుంది.

అన్నీ తెలిసిన పండితులను కూడా ఇంద్రియాలు క్రిందికి పడదోస్తాయి. కోరికలను ఎవరూ జయించలేరు. భోజనము, నిద్ర, భోగము, సంతానసుఖము కావాలంటే సన్యాసికి రావు. అప్పుడు గనక కాలు జారితే సన్యాసి అదఃపతనమౌతాడు. ఈసుఖాలు అన్నీ అనుభవించాక సన్యసిస్తే ఈచిక్కులు రావు. చీమ మెల్ల మెల్లగా చెట్టు ఎక్కినట్టుగా క్రమంగా సన్యసించాలి. లేకపోతే జర్రున కాలు జారవలసివస్తుంది. అలాటివాడి బతుకు రెంటికీ చెడ్డరేవడు అవుతుంది.

మనసు ఒకంతట లొంగదు. క్రమంగా దాన్ని లొంగదియ్యాలి. ఈలోపల అనుభవాలన్నీ అయిపోతాయి. అప్పుడు ప్రమాదం ఉండదు. గృహస్థుగా ఉండి సత్కర్మలు చేస్తూ దొరికిన దానితో తృప్తిపొందుతూ, అరిషడ్వర్గాలను జయించిన వాడు మోక్షం పొందగలుగుతాడు.

విద్య అంటే ఏమిటో తెలుసుకోవాలంటే ఆవిద్యకు సంబంధించిన పనులు చెయ్యాలి. ఎండవేడి పడని వాడికి నీడలో ఉండే సుఖం తెలియదు.

యజ్ఞయాగాలు ఫలాపేక్షతో చెయ్యరాదు. ఫలాపేక్షతో చేసే హింసవల్ల పాపం వస్తుంది. ఫలపేక్షలేకపోతే పాపం రాదు. కోరికలు లేకుండా చేసే కర్మవల్ల పుణ్యమే వస్తుంది. మోక్షం కోసం చేసే కర్మ హింస దానివల్ల పాపం రాదు.

కాబట్టి మునికుమారా! వివాహం చేసుకుని గృహస్థువై కర్మలనాచరించి మోక్షం సాధించు"

శుకుడు ఇంటికి తిరిగి వెళ్ళి తండ్రి తెచ్చిన పిల్లను వివాహమాడి సుఖంగా కాపురం చేశాడు. అతడికి

1. గౌరప్రభుడు 3. కృష్ణుడు
2. దేవశ్రుతుడు 4. భూరి

అని నలుగురు కొడుకులు కీర్తి అనే కూతురు పుట్టారు.

కొంతకాలం తరువాత శుకుడు తండ్రిని విడిచి కైలాసగిరికి పోయి తపస్సు చేసి సిద్ధి పొంది పరమాత్మలో లీనమైపోయాడు.

# 4. బుధుడు

బ్రహ్మమానస పుత్రుడు అంగిరసుడు. ఇతని భార్య శ్రద్ధ. వీరి కుమారుడు బృహస్పతి దేవతల గురువు. బృహస్పతి భార్య తార చాలా అందగత్తె.

అత్రిమహర్షి కుమారుడు చంద్రుడు. చాలా అందగాడు. బృహస్పతి దగ్గర విద్య నేర్చుకునేందుకు వెళ్ళాడు. మన్మధుడివలె ఉన్న చంద్రుణ్ణిచూసి మోహించింది తార. ఒకనాడు బృహస్పతి ఇంట లేడు. తార ఒంటరిగా ఉన్నది. తారకు మంచి అవకాశం వచ్చింది. దాన్నివదలు కోలేదు. చంద్రుణ్ణి చేరింది. గురుపత్ని అనే భావం చంద్రుడికీ రాలేదు. ఆ తరువాత చంద్రుడితో వెళ్ళిపోయింది తార.

ఇల్లు చేరిన బృహస్పతికి తార కనిపించలేదు. జరిగింది తెలుసుకున్నాడు. తారను తిరిగి తనదగ్గరకు రమ్మని కబురుచేశాడు. తార రానన్నది. బృహస్పతే చంద్రుడి ఇంటికి వెళ్ళి తారను పంపమని చంద్రుణ్ణి అడిగాడు. దానికి చంద్రుడు ఆమెవస్తే తీసుకు వెళ్ళు అన్నాడు. తారరానని ఖరాఖండిగా చెప్పేసింది. చేసేది లేక బృహస్పతి వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు. జరిగిన అవమానానికి చాలా దుఃఖించాడు. వెళ్ళి దేవరాజుకు ఫిర్యాదుచేశాడు.

దేవతలు రెండు పక్షాలయ్యారు. రాక్షససేనను వెంటపెట్టుకుని శుక్రుడు చంద్రుని పక్షాన చేరాడు. ఆస్థితిలో బ్రహ్మకల్పించుకుని తారను బృహస్పతి దగ్గరకు పంపేశాడు. అప్పటికే తార గర్భవతి. కొంతకాలానికి తార ఒకపిల్లవాణ్ణి ప్రసవించింది. ఆ పిల్లవాడికి తండ్రి నేనంటే నేనని బృహస్పతీ, చంద్రుడూ తగాదామొదలు పెట్టారు. చివరకి బృహస్పతి తారనే అడిగాడు పుట్టిన పిల్లవాడికి తండ్రి ఎవరు అని చంద్రుడే బాలుడితండ్రి అని చెప్పింది తార. దాంతో చంద్రుడు ఆ బాలుణ్ణి తీసుకెళ్ళి బుధుడని నామకరణంచేసి తనే విద్యాబుద్ధులు నేర్పించాడు. విద్యాభ్యాసంపూర్తయింతరువాత బుధుడు తపస్సు చేసి జ్యోతిషచక్రంలో మిధున, కన్యారాసులకు ఆధిపత్యం సంపాదించాడు.

వైవస్వతుని కుమారుడు సుద్యుమ్నుడు చాలా అందగాడు. గుణవంతుడు. ఒకసారి మంత్రిసేనా సమేతుడై వేట కని అరణ్యానికి వెళ్ళాడు. అక్కడ తిరిగితిరిగి ఒకతోటకు చేరాడు. అంతే ఆతోటలో కాలు పెట్టగానే అందరికీ స్త్రీరూపం వచ్చేసింది. ఆ తోటపేరు కుమారవనం.

ఒకసారి సనకసనందనాది మహర్షులు శివదర్శనం కోసం కుమారవనానికి వెళ్ళారు. ఆ సమయంలో అక్కడ పార్వతీ పరమేశ్వరులు శృంగారకేళిలో ఉన్నారు.

దేవదూత వచ్చి మునికుమారా! శాశ్వతం కాని సుఖం కోసం పరితపిస్తున్నావు. అయినా ప్రమద్వర బ్రతకాలంటే నీ ఆయువులో సగం ఆమెకు ధారపొయ్యి అన్నాడు. వెంటనే రురుడు తన ఆయువులో సగం ఆమెకు ధారపోశాడు. ప్రమద్వర లేచి కూచుంది. రురుడి ఆనందానికి అవధుల్లేవు. ఒక శుభముహూర్తాన స్థూలకేతు ప్రమద్వరను రురుని కిచ్చి వివాహం జరిపించాడు. పరమేశ్వరి దయవల్ల వారు సుఖంగా జీవించారు.

ప్రమద్వరను పాము కరిచిందనే కోపంతోనే రురుడు జనమేజయుణ్ణి సర్పయాగం చెయ్యమని ప్రోత్సహించాడు.



# 6. సుదర్శనుడు

సరయూనదీ తీరాన ఉన్న అయోధ్యా నగరాన్ని రాజధానిగా చేసుకుని సూర్యవంశపు రాజైన ధ్రువసంధి పాలిస్తున్నాడు. అతనికి ఇద్దరు భార్యలు మనోరమ, లీలావతి. కొంతకాలానికి ధ్రువసంధికి పెద్దభార్య మనోరమ యందు సుదర్శనుడు, చిన్న భార్య లీలావతి యందు శత్రుజిత్తు అని ఇద్దరు కుమారులు కలిగారు. సుదర్శనుడు మంచి అందగాడు. కాని శత్రుజిత్తు అందంతో పాటు శౌర్యము, ధైర్యము మాటకారితనము కూడా కల బుద్ధిమంతుడు. అందుచేత రాజుతో బాటు మిగిలిన వారుకూడా శత్రుజిత్తును ప్రత్యేకమైన అభిమానంతో చూసేవారు.

ఒకనాడు ధ్రువసంధి వేటకు వెళ్ళి దూరంగా ఒకగుహలో నిద్రపోతున్న సింహాన్ని కొట్టాడు. ఆదెబ్బకు సింహం చావకపోగా రాజుమీదకు దూకింది. రాజు చేత కత్తిపట్టి సింహాన్ని ఎదిరించాడు. కాని చివరకు సింహంపంజాదెబ్బకు రాజు, రాజుకత్తి దెబ్బకు సింహము ఇద్దరూ మరణించారు. భటుల ద్వారా సమాచారం తెలుసుకున్న మంత్రులు చేసేదిలేక, రాజగురువైన వసిష్ఠునితో ఆలోచించి పెద్దవాడైన సుదర్శనుడికి పట్టాభిషేకం చెయ్యటానికి నిశ్చయించుకున్నారు.

ఉజ్జయినీ నగరాన్ని పరిపాలిస్తున్న మహారాజు యుధాజిత్తుడు. అతని కుమార్తె లీలావతి ధ్రువసంధి రెండవభార్య. కళింగపురాధీశ్వరుడైన వీరసేనుడి కుమార్తె మనోరమ ధ్రువసంధి పెద్ద భార్య. ధ్రువసంధి మరణవార్త వినగానే యుధాజిత్తు, వీరసేనుడు కూడా అయోధ్యకు వచ్చారు. వారిద్దరూ తమతమ మనవలను రాజుగా చెయ్యటానికి పథకాలు ప్రారంభించారు.

సుదర్శుడు పెద్ద భార్యకుమారుడు, జ్యేష్ఠుడు. కాబట్టి వాడిదే అధికారం అని వీరసేనుడూ, శత్రుజిత్తు గుణగణాలలోను, శౌర్యపరాక్రమాలలోను మిన్న కాబట్టి వాడే రాజుకావాలని యుధాజిత్తు వాదనలు మొదలు పెట్టారు. చిలికి చిలికి గాలివాన అయినట్లుగా వారి వాదనలు ముదిరి ఇరుపక్షాల మధ్యా యుద్ధం ఆరంభమైంది. పోరుఘోరంగా సాగింది. ఇరు పక్షాలకు నష్టమూ భారీగానే జరిగింది. చివరకు యుధాజిత్తు ఒక్క కత్తివేటుతో వీరసేనుడి తల తెగనరికాడు. దాంతో అతని సైన్యం చెల్లాచెదరైపోయింది. విజయోత్సాహంతో యుధాజిత్తు లీలావతి కుమారుడైన శత్రుజిత్తుని రాజుగా అభిషేకించాడు.

యుద్ధంలో తండ్రి దారుణంగా చనిపోయాడు. భర్తధ్రువసంధి సింహం వాతపడ్డాడు. రాజ్యానికి సవతికొడుకైన శత్రుజిత్తు రాజైనాడు. కాబట్టి తనకు, తన పిల్లవాడైన సుదర్శనుడికీ ఈరాజ్యంలో రక్షణ ఉండదు అనే నిర్ణయానికి వచ్చిన ధ్రువసంధి పెద్ద భార్య మనోరమ మంత్రి విదల్లుడిని, కుమారుణ్ణి, వెంటతీసుకుని కాశీ పట్టణానికి బయలుదేరి మార్గమధ్యంలో దొంగలు కొల్లగొట్టగా కట్టుబట్టలతో గంగానదీ తీరాన ఉన్న భరద్వాజుని ఆశ్రమం చేరింది.

అకస్మికంగా వచ్చిన వీరిని చూసి ' అయ్యా కాలినడకన ఆశ్రమానికి

వచ్చారు. చూడటానికి రాణి వాసపు వారిలా ఉన్నారు. తమరెవరు?' అని భరద్వాజుడు అడగగా మనోరమ జరిగిన విషయం సమస్తం వివరించి రాజ్యంలో తనకు, తన పిల్లవాడైన సుదర్శనుడికీ రక్షణ లేనందున అంతఃపురాన్ని వదలి అడవులపాలైనామని చెప్పింది.

అమ్మా విచారించకు, అమాయకులను, సాధువులను దైవం మొదట ఉపేక్ష చేసినా సమయానికి ఆదుకుంటుంది. నీకుమారుడే రాజవుతాడు. అంతవరకూ మీరు నాఆశ్రమంలోనే ఉండండి అని చెప్పి ఒకపర్ణశాల వీరి నివాసంగా ఏర్పాటు చేశాడు. కుమారుడితో బాటుగా మనోరమ ఆపర్ణశాలలో జీవనం సాగిస్తోంది.

శత్రుజిత్తుకు పట్టాభిషేకంచేసి ఉజ్జయినీ నగరానికి ప్రయాణమైన యుధాజిత్తుకు మనోరమ సుదర్శనులు గంగానదీ తీరంలో భరద్వాజుని ఆశ్రమంలో క్షేమంగా ఉన్నారనే వార్తతెలిసి, శత్రుజిత్తుకు ఎప్పటికైనా వారివల్ల అపాయం సంభవించవచ్చుననే భయంతో, ఏదోవిధంగా ఆతల్లీ కుమారులను సంహరించాలని యోచించి భరద్వాజుని ఆశ్రమానికి వెళ్ళాడు. యుధాజిత్తు వస్తున్నాడన్న వార్త విన్న మనోరమ మహర్షి దగ్గరకు వెళ్ళి యుధాజిత్తు తనను, తనకుమారుణ్ణి సంహరించటానికే వస్తున్నాడు. కాబట్టి అతడినుంచి రక్షణ కల్పించమని వేడుకుంది. భరద్వాజుడు మనోరమకు అభయమిచ్చి, ఆశ్రమానికి వచ్చి యుధాజిత్తును సమీపించి విషయమేమిటి అని అడిగాడు. దానికి రాజు నిర్భయంగా మనోరమను, ఆమె కుమారుడైన సుదర్శనుణ్ణి తీసుకుపోవటానికి వచ్చాను అని సమాధానం చెప్పాడు.

అనలే తండ్రి, భర్తపోయి పుట్టెడు దుఃఖంలో ఉన్న అడది. శరణు కోరి నా ఆశ్రమానికి వచ్చింది. నీతోరాదు. అని ఖచ్చితంగా చెప్పేశాడు మహర్షి. దాంతో కోపోద్రిక్తుడై 'మహర్షీ! ధర్మపన్నాలు చెప్పకు. వారిని మంచిగా పంపావాసరే! లేదా బలాత్కారంగానైనా తీసుకుపోవలసి వస్తుంది. జాగ్రత్త!' అని హెచ్చరిక చేశాడు రాజు.

రాజు చేసిన హెచ్చరికకు కోపగించిన భరద్వాజుడు 'రాజా మర్యాద తప్పి మాట్టాడుతున్నావు. మునులంటే అంతచులకనగా ఉన్నదా? పూర్వకాలంలో నందిని (ఆవు)కోసం వసిష్ఠునితో పోరాడిన విశ్వామిత్రుడు గుర్తులేదా? చేతనైతే బలాత్కారంగా వారిని ఈఆశ్రమంనుంచి తీసుకుని వెళ్ళు' అన్నాడు.

భరద్వాజుని మాటలకు వెనక్కు తగ్గిన రాజు మంత్రి సలహా మీద మారుమాటాడకుండా అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

మనోరమ ఋషి ఆశ్రమంలో సుఖంగా ఉంది. సుదర్శనుడు కాలక్రమేణా పెరుగుతూ ఋషి కుమారులతో ఆడుకుంటూ ఉండగా ఒకనాడు ఋషికుమారుడు ఒకడు మంత్రి విదల్లుణ్ణి 'క్లీబా' అని పిలిచాడు. క్లీబా అనే మాటకు ప్రత్యేకమైన అర్థం ఏమీలేదు. ఏదో ఎగతాళిగా అన్న మాట. కాని ఆమాటలోని మొదటి అక్షరాన్ని పట్టుకుని, దానికి బిందువును చేర్చి నిత్యం జపం చేస్తున్నట్టుగా మనసులోనే మననం చెయ్యటం మొదటు పెట్టాడు సుదర్శనుడు. ఆ అక్షరమే ఒక మంత్రమైపోయిందివాడికి. అది కామరాజ బీజం. ఆవిధంగా నిత్యం కామరాజబీజాన్నే జపిస్తున్నాడు సుదర్శనుడు. అలా కొన్నేళ్ళుగడిచాయి. మహర్షి రాకుమారుడికి ఉపనయనం చేసి వేదాభ్యాసం చేయించాడు.

వేదాలు, శాస్త్రాలు, విలు విద్య మొదలైనవన్నీ చెప్పగానే వచ్చేసినాయి బాలుడికి. పరమేశ్వరి అనుగ్రహం ఉన్నవారికి ఇలా జరగటం వింతకాదు కదా!

ఒకరోజు ఆపరమేశ్వరి ధనుర్బాణములు, పాశాంకుశములు ధరించి సురర్శనుడికి దర్శనమిచ్చింది. అప్పుడు సుదర్శనుడు దేవిని అనేక విధాలుగా స్తుతిచేసి సాష్టాంగ ప్రణామం చేశాడు. అపుడాదేవి విల్లు, రెండు అమ్ములపొదులు, అక్షయతూణీరాలు, దివ్యకవచం ఇచ్చి విజయోస్తు అని ఆశీర్వదించింది.

కాశీ రాజు సుబాహుడి కుమార్తె శశికళ. పేరుకు తగ్గట్టే రూపవతి కూడా. గుణవంతురాలు. పరమేశ్వరి భక్తురాలు. ఒకనాటి తెల్లవారుజామున పరమేశ్వరి ఆ బాలిక కలలో కనిపించి అందగాడు, శౌర్యపరాక్రమవంతుడు అయిన సుదర్శనుడు నీకు భర్తగా లభిస్తాడు. అని చెప్పి అదృశ్యురాలైంది. అప్పటినుండీ సుదర్శనుణ్ణే తలచుకుంటూ కాలం గడుపుతోంది శశికళ. ఒకరోజు శశికళ ఉద్యానవనంలో విహరిస్తుండగా అనుకోకుండా ఒక విప్రుడు దర్శనమిచ్చాడు. ఆబ్రాహ్మణోత్తముణ్ణి సాదరంగా సన్మానించింది రాకుమారి. ఆమె ఆదరానికి ముగ్ధుడై ఆమె పుట్టు పూర్వోత్రాలు తెలుసుకుని, కుమారీ! మా ఆశ్రమంలో ధ్రువసంధి కుమారుడు పసుదర్శనుడనే బుద్ధిమంతుడు, విద్యావంతుడు, పరాక్రమశాలి, రూపసి అయిన వాడున్నాడు. ఆపరమేశ్వరి మీఇద్దరికీ వివాహం చేయిస్తుంది అని చెప్పి వెళ్ళిపోయాడు.

సుదర్శనుడు ఆ పరమేశ్వరినే ఆరాధిస్తూ, వివిధావస్థలలో ఆమెనే దర్శిస్తూ కాలం గడుపుతున్నాడు. ఇలా ఉండగా ఒకనాడు శృంగభేరీ పురాధిపతి అయిన నిషాదరాజు నాలుగు మేలు జాతి గుర్రాలు పూన్చిన అందమైన రథాన్ని తోలుకు వచ్చి సుదర్శనుడికి కానుకగా ఇచ్చాడు. ఆరథం ఎక్కిన సుదర్శనుడు ఈ భూమండలానికే చక్రవర్తి అన్నట్టుగా ప్రకాశిస్తున్నాడు. ఆశ్రమంలోని మునులందరూ అతణ్ని ఆశీర్వదించారు.

కాశీరాజైన సుబాహుడు శశికళకు స్వయంవరం ప్రకటించాడు. స్వయంవరం మూడు రకాలుగా ఉంటుంది. అవి

1. పణస్వయంవరంః పెట్టిన పరీక్షనెగ్గిన వాడిని కన్య వివాహమాడుతుంది. శివధనుర్భంగు, మశ్చయంత్రము మొదలైనవి ఈకోవకు చెందినవి.
2. ఇచ్ఛాస్వయంవరంః కన్యతనకిష్టమైన వాడిమెడలో వరమాల వేస్తుంది.
3 శుల్కా స్వయంవరంః ఎవరు ఎక్కువ ధనమిస్తే వారిని కన్య భర్తగాస్వీకరిస్తుంది.

ఇక్కడ సుబాహుడు ప్రకటించింది. ఇఛ్చాస్వయంవరం. రాకుమారి తనకిష్టమైన వాణ్ని భర్తగా ఎన్నుకుంటుంది, ఆమాట విని దేశ దేశాల రాజులు స్వయం వరానికి విచ్చేశారు. కాని శశికళ మాత్రం సుదర్శనుణ్ణే తలచుకుంటూ, అతణ్ణి తప్ప ఇంకొకరిని వివాహమాడనని తల్లికి చెప్పేసింది. ఆమాట విన్న తండ్రి కోపగించాడు. సుదర్శనుడు కడుదరిద్రుడు, అతడి తండ్రి సింహం వాతపడి చచ్చాడు. యుధజిత్త ఇతడి తాతైన వీరసేనుణ్ణి చంపి శత్రు జిత్తును రాజుగా చేశాడు. అదృష్టవశాన బ్రతికి తల్లితో కలిసి బరధ్వాజుని ఆశ్రమంలో తలదాచుకుంటూ, కందమూలాలు తిని కాలం వెళ్ళబుచ్చుతున్న నిరుపేదవాడినా వరించేది,. స్వయంవరానికి అనేక మంది రాజులు వస్తున్నారు. వారిలో ఎవరినైనా వరించి జీవితాంతం సుఖంగా ఉండమని సలహా ఇచ్చాడు.

నేను కోరుకున్న ది సుదర్శనుణ్ని. అతన్ని పతిగా పొందుతానని పరమేశ్వరి వరమిచ్చింది. ఆ వరం ఫలించి తీరుతుంది. కాబట్టినేను సుదర్శనుణ్ణి చేపడతాను. నాతలవ్రాత ఎలా ఉంటే అలాగే జరుగుతుంది. దానినెవరూ మార్చలేరు కదా! అని భీష్మించింది శశికళ. అంతే కాకుంగా ఇంకొక అడుగు ముందుకువేసి ఒక బ్రాహ్మణుణ్ణి రప్పించి సుదర్శనుడికి ఈవిధంగా కబురు పంపింది.

'రాకుమారా! జగన్మాత నాకలలో కనిపించి నీవే నాపతి వని వరమిచ్చింది. అప్పటి నుండి నామనసు నీకే అంకితమైంది. స్వయంవరం సమీపించింది. నీజాడ ఇంతవరకూ తెలియలేదు. నిన్ను తప్ప ఇంద్రుడైనా సరే, చంద్రుడైనా సరే పరుని కన్నెత్తి చూడను. ఒకవేళ నేనంటే ఇష్టపడవా నేను బ్రతికి ఉండేది లేదు. విషం త్రాగి గాని, నిప్పులో దూకిగాని, నదిలోపడి గాని మరణిస్తాను. ఆపరమేశ్వరి దయవల్ల మనకు మేలే జరుగుతుంది. దేవి మాట అబద్ధం కాదు. వెంటనే వచ్చి నన్ను చేపట్టవలసినది'.

ఆ మాటవినగానే సుదర్శనుడు రథమెక్కి ప్రయాణమయ్యాడు. తల్లి మనోరమ తనయుణ్ణి వారించింది. యుధాజిత్తు సామాన్యుడు కాదు. ససైన్యంగా వస్తాడు.నిన్ను దారికాచి దెబ్బతీస్తాడు. వెళ్ళద్దని బ్రతిమాలింది. కాని సుదర్శనుడు 'అమ్మా క్షత్రియులకు పిరికితనం శోభించదు. నిజంగా మృత్యువు రాసిపెట్టి ఉంటే సప్తసముద్రాలలో దాక్కున్నా దాన్నుంచి తప్పించుకోలేము. ఏమైతే అదౌతుంది. ఆపరదేవత కరుణా కటాక్షవీక్షణాలే నాకు రక్షాకవచము. నన్ను దీవించి పంపు అన్నాడు. చేసేది లేక ఆతల్లి కుమారుణ్ణి దీవించింది.

కుమారా! పరదేవత నీముందుండి నిన్ను రక్షించుగాక. వెనుకనుండి పార్వతి కాపాడుగాక. విషమమార్గమునవారాహి, దుర్గములందు దుర్గ, యుద్ధమున భద్రకాళి, స్వయంవరమున మాతంగి, రాజులనడుమ భవాని, చత్వరములయందు చాముండ, వివాదములందు వైష్ణవి, అడవులందు కామేశ్వరి, శత్రువుల మధ్యన భైరవి. అంతటా లోకమాత అయిన భువనేశ్వరి నిన్ను కాపాడుగాక.తల్లికి నమస్కరించి కాశీనగరానికి బయల్దేరాడు సుదర్శనుడు.

స్వయంవరానికి విచ్చేసిన సుదర్శనుణ్ణి సాదరంగా ఆహ్వానించాడు సుబాహుడు. సుదర్శనుణ్ణి చూసిన యుధాజిత్తు అతన్ని అంతం చెయ్యాటానికి సన్నాహాలు ప్రారంభించాడు. మిగిలిన రాజులు మాత్రం అందగాడు, వీరుడు అయిన అతన్నే రాకుమారి వరించవచ్చు ఏం చెప్పగలం? అనుకున్నారు.

వరించటం కూడా నలుగురూ హర్షించేటట్టుండాలి. ఇంతమంది అందగాళ్ళు, యువకులు, మహారాజులు, ఉండగా వారిలో ఏ ఒకరినైనా వరించాలి గానీ, పేరూ ఊరు లేక ముక్కు మూసుకుని మునిపల్లెలో ఉండే వాడిని వరించటమా? బలంకలవాడిదే ఈపెండ్లికూతురు. అని వాదనలేవదీశాడు యుధాజిత్తు. తగవుముదిరింది. పెద్దలంతా కలసి ఆలోచించారు. కాశీ రాజుకు కబురంపి 'రాజా! స్వయంవరం యుద్ధానికి దారి తీసేట్టుంది. నువ్వే ఏదయినా ఆలోచించి కత్తులకు పని కల్పించని ఆలోచన ఏదయినా చెయ్యి' అన్నారు. దానికి సుబాహుడు ఎంతచెప్పినా నాకుమార్తె సుదర్శనుణ్ణి తప్ప

ఇంకెవరినీ వివాహమాడనంటోంది. ఇప్పుడా సుదర్శనుడు కూడా వచ్చాడు. జరిగేది ఇచ్ఛాస్వయంవరం. దైవనిర్ణయం ఏరకంగా ఉందో!' అన్నాడు సుబాహుడు.

రాజులందరూ సుదర్శనుడికి కబురంపి 'రాకుమారా! స్వయంవరానికి వచ్చిన రాజులందరూ ససైన్యంగా ఉన్నారు. నువు ఒంటరివాడివి. నీతమ్ముడు శత్రుజిత్తు, అతని తాతయూధాజిత్తునిన్ను చంపటానికి ప్రయత్నిస్తున్నారు. ఆలోచించు' అన్నారు.

వాళ్ళమాటలు విన్న సుదర్శనుడు ' మీదయకు నాఅభివాదాలు. ఇప్పుడు భయపడి ఉపయోగం ఏమిటి? జగన్మాత కృప ఎలా ఉంటే అలా జరుగుతుంది. ఆయువు, యశస్సు, బలము, ధనము, ధాన్యము, విద్య ఇత్యాదులు ఇచ్చేది ఆ పరమేశ్వరి. అలాగే పేదరికము, పిరికితనము, దరిద్రము కలిగించేది కూడా ఆమెయే. ఆమే నాకుబలం గెలుపైనా ఓటమైనా నాది కాదు ఆమెది, కీర్తి అపకీర్తి కూడా ఆమెదే. నాకేమవుంతుందో అని విచారించకండి. మీస్నేహభావానికి నా కృతజ్ఞతలు"అన్నాడు.

శుభాశుభాలు పూర్వజన్మలో చేసిన కర్మననుసరించి వస్తాయి. కర్మననుసరించి వచ్చే కష్టానికి వివేకవంతుడు విచారించడు. ఎదుటివారివల్ల తనకు కష్టాలు కలాగాయని ఆలోచించేవాడు మూర్ఖుడు. నేను దైవాన్ని నమ్మివచ్చాను. ఆదైవమేనాకు సేన. సుఖమైనా కష్టమైనా ఆదైవమే ప్రసాదిస్తుంది.యూధాజిత్తు నాకు పగవాడు కాదు. అతడు నన్ను చెడ్డగా భావిస్తే అది నాతప్పుకాదు." అన్నాడు. ఆమాటకు రాజులందరూ ఆనందించారు.

యూధాజిత్తు మాత్రం యుద్ధానికి సన్నద్ధమౌతున్నాడు. ఆమాటవిని భయంతో వణికి పోయాడు సుబాహుడు. కూతురుకు నచ్చచెప్పాలని ప్రయత్నించాడు. ఆమె శశేమిరాఅంది. చేసేది లేక రాత్రికి రాత్రే గుట్టు చప్పుడు కాకుండా శశికళా, సుదర్శనుల వివాహం జరిపించి కూతుర్నీ, అల్లుణ్ణీ సాగనంపాడు. విషయం తెలుసుకున్న యూధాజిత్తు తోటిరాజులసాయంతో దారికాచాడు. సుదర్శనుడు మాత్రం ఆజగన్మాతమీద భారం వేసి ప్రయాణమయ్యాడు.

శశికళా సుదర్శనులెక్కిన రథం సాగుతోంది. కాపుకాచిన రాజులు అడ్డువచ్చారు. సుదర్శనుడు తన ఉపాసనా మంత్రమైన కామారాజ బీజాన్ని జపించటం మెదలు పెట్టాడు. అప్పుడు ఆపరదేవత సింహాసనారూఢమై ప్రత్యమైంది. సుదర్శనుడు ఆమెకు నమస్కరించాడు. దేవి వాహనమైన సింహం భీషణ గర్జన చేసింది. ఆగర్జనకు శత్రురాజుల ఏనుగులు వారిసైన్యాన్నితొక్కుకుంటూ పారిపోసాగాయి. ఆపరమేశ్వరి అనేక రూపాలలో రాజులందరితోనూ యుద్ధం చెయ్యటం మొదలు పెట్టింది. ఆయుద్ధంలో యూధాజిత్తు, అతని మనుమడు శత్రుజిత్తు మరణించారు. వారి సేనలు పలాయన మంత్రం పఠించాయి. సుబాహుడు పరమానందంతో దేవిని ప్రార్థించాడు.

ఆవిధంగా ప్రార్థించిన సుబాహుడిని ఆపరమేశ్వరి ఏదైనా వరం కోరుకోమంది. దానికి సుబాహుడు ఆదేవిని కాశీపట్టణంలో నివాసముండవలసినదిగా ప్రార్థించాడు. ఆతరువాత సుదర్శనుడు అయోధ్యా నగరానికి రాజయి ప్రజలను కన్న బిడ్డలుగా పాలించాడు.

# 7. నవరాత్రి పూజామహిమ

పూర్వకాలంలో కోసలదేశంలో సుశీలుడు అనే వైశ్యుడు ఉండేవాడు. అతడు కడు పేదవాడు. గంపెడు సంసారం. పిల్లలకు కడుపునిండా ఇంత తిండికూడా పెట్టలేని స్థితిలో ఉండేవాడు. ఒకనాడు సుశీలుడు ఒక బ్రాహ్మణోత్తముడికి నమస్కరించి 'మహానుభావా! బండెడు సంసారంగల దరిద్రుడను పిల్లలకు అన్నంకూడా పెట్టలేక, వాళ్ళ ఏడుపువినలేక బాధపడుతున్నాను. నాపెద్ద పిల్లకి పది సంవత్సరాలు. వయసు దాటకముందే దానికి పెళ్ళి చెయ్యాలి. ఈ కష్టాలనుంచి గట్టెక్కే ఉపాయం ఏదైనా చెప్పండిని అడిగాడు.

ఆ బ్రాహ్మణుడు కొంతసేపు ఆలోచించి ఆశ్వీయుజమాసంలో శుక్ల పక్షపాడ్యమి మొదలు తొమ్మిది రోజులు దేవీ పూజ జరిపావంటే నీ బాధలు తీరతాయి. ఇంత కన్న వేరే మార్గంలేదు. అని చెప్పగావిని వైశ్యుడు మహాత్మా! శరత్కాలమునందు పరమేశ్వరిని అర్చించే పద్ధతిని వివరించవలసినది గాకోరగా ఆపండితుడు దేవీ నవరాత్రిపూజ గురించి ఈ విధంగా వివరించసాగాడు.

వసంత ఋతువులోని చైత్రమాసంలోను, శరదృతువులోని ఆశ్వీయుజమాసంలోను ఆ పరమేశ్వరిని శుక్లపక్షపాడ్యమి మొదలు తొమ్మిది రోజులు ఆరాధించాలి ఈపూజ చేసే వ్యక్తి ఆ ముందు రోజైన అమావాస్యనాడే కావలసిన వస్తువులన్నింటినీ సమకూర్చుకొని ఆనాడు ఏక భుక్తం చెయ్యాలి. హెచ్చుతగ్గులు లేకుండా నేలనుచదును చేసి పదహారు మూరల పరిమాణముతో ఒక మంటపం నిర్మించాలి. దానిని అరటిస్తంభాలతోను, రంగురంగుల జండాలతోను అలంకరించాలి. ఆవుపేడ, బంకమన్ను కలిపి ఆమందిర ప్రాంతం అంతా అలికి ముగ్గులు పెట్టి, దాని నడుమ నాలుగు మూరల వైశాల్యం, మూరెత్తు ఉండేటట్టుగా ఒక వేదిక ఏర్పాటు చెయ్యాలి. దానిపైన చాందినీ, తోరణాలు కట్టి అలంకరించాలి. ఆ రాత్రి వేదవిదులు, మంత్ర, తంత్ర వేత్తలు అయిన బ్రాహ్మణులను ఇంటికి ఆహ్వానించాలి.

మర్నాడు ఉదయాన స్నానము, సంధ్యపూర్తి చేసుకుని, క్రితం రోజుపిలిచిన బ్రాహ్మణులను పూజించి నూతన వస్త్రాలు సమర్పించాలి.

దేవీ మంత్ర జపానికి యోగ్యులయిన విప్రులు తొమ్మిది మందిగాని, ఐదుగురుగాని, ముగ్గురు కాని చివరకు ఒక్కడైనా సరే ఉండాలి. అలాగే పారాయణకు శాంతమూర్తి, నిష్కల్మష చరిత్రుడు అయిన వాడు ఒకడుండాలి. ఇప్పుడు స్వస్తి వాచముతో పూజ ఆరంభించాలి.

తయారు చేసిన వేదిక మీద పట్టుబట్ట పరచి దానిమీద సింహాసనం ఏర్పాటు చేసి దాని మీద నాలుగు భుజములయందు ఆయుధములు ధరించి ఉన్న దేవీ

విగ్రహాన్ని చక్కగా అలంకరించి శాస్త్రోక్తంగా స్థాపించాలి.

ఒకవేళ విగ్రహం గనక లభించనట్లైతే నవాక్షర సహితమైన యంత్రాన్ని స్థాపించి, దాని పక్కన మేడి, మఱ్ఱి, రావి, జువ్వి మామిడి చిగుళ్ళతో, పుణ్య జలముతో నిండిన కలశమును ఉంచాలి.

ఈ పూజను హస్తా నక్షముతో కూడిన పాడ్యమి నాడు మొదలు పెట్టటం శ్రేయస్కరము. దేవీ పూజకు ఆహారనియమాలు రెండు విధాలుగా ఉంటాయి.

1. పగలంతా ఉపవాసము ఉండి, రాత్రి పూజపూర్తయిన తరువాత భోజనం చెయ్యటం.
2. పూర్తిగా తొమ్మిది రోజులు ఉపవాసము ఉండటము.

ఈ రెండు పద్ధతులలోనూ ఏది అనుసరిస్తున్నామో ముందుగానే నిర్ణయించుకోవాలి.

మల్లె, మాలతి, సంపెంగ, మందార పూలతోను, మంచిగంధము, అగరు, కర్పూరము మొదలైన సుగంధ ద్రవ్యాలతోను, కొబ్బరి, అరటి, నారింజ, దానిమ్మ, పనస, మొదలైన పండ్లతోను, పంచభక్ష్య పానీయములతోను షోడశోపచార విధిని ఆదేవిని పూజించిన వారికి జీవితము సుఖ సంతోషాలతో గడిచి పోతుంది. యధావిధిగా పూజ పూర్తయిన తరువాత శ్రద్ధాభక్తులతో అన్నదానం చెయ్యాలి. అన్నదానం చెయ్యని పూజకు ఫలితం లేదు.

మాంసాహారులు దేవీ పూజలో పశుబలి చెయ్యవచ్చు. మేక, పంది. దున్నపోతులు బలికి ప్రశస్తములని తంత్రాలలో చెప్పబడింది. దేవి ముందుచంపిన జంతువులకు స్వర్గం ప్రాప్తిస్తుంది. ప్రతిరోజు హోమము చెయ్యాలి. హోమకుండాన్ని త్రికోణాకారంలో నిర్మించాలి. ప్రతినిత్యము త్రిసంధ్యలయందు నృత్య, గీత, వాద్యములతో దేవీపూజ జరగాలి. పూజచేసే వ్యక్తి దీక్షవహించి నేలమీదనే పడుకోవాలి. ప్రతి రోజూ క్రొత్త బట్టలు, నగలు ఇచ్చి కుమారీ పూజ చెయ్యాలి.

ఏకవర్షా నకర్తవ్యా కన్యా పూజావిధౌ నృపా।
పరమ జ్ఞాతు భోగానాం గంధాదీనాంత బాలికా॥

కుమారికా తుసా ప్రోక్తా ద్వివర్షా యా భవేదిహా।
త్రిమూర్తిశ్చ త్రివర్షాచ కల్యాణీ చతురబ్దికా॥

రోహిణీ పంచవర్షాచ షడ్వర్షా కాలికా స్మృతా।
చండికా సప్తవర్షాస్యా దష్టవర్షా చ శాంభవీ।

**నవవర్షా భవేద్దుర్గా సుభద్రా దశవార్షికీ।**
**అత ఊర్ధ్వం నకర్తవ్యా సర్వకార్య విగర్హితా॥**

| | | |
|---|---|---|
| రెండు సంవత్సరాల వయసు కలది | - | కుమారి |
| మూడు సంవత్సరాల వయసు కలది | - | త్రిమూర్తి |
| నాలుగు సంవత్సరాల వయసు కలది | - | కళ్యాణి |
| ఐదు సంవత్సరాల వయసు కలది | - | రోహిణి |
| ఆరు సంవత్సరాల వయసుకలది | - | కాళి |
| ఏడు సంవత్సరాల వయసుకలది | - | చండిక |
| ఎనిమిది సంవత్సరాల వయసుకలది | - | శాంభవి |
| తొమ్మిది సంవత్సరాల వయసుకలది | - | దుర్గ |
| పది సంవత్సరాల వయసుకలది | - | సుభద్ర |

అంతకన్నా ఎక్కువ వయసున్న వారు కుమారీ పూజకు పనికిరారు. కుమారీ పూజా ఫలితం ఈ విధంగా ఉంటుంది.

| | | |
|---|---|---|
| కుమారీ పూజ | - | దారిద్ర్య, దుఃఖ నాశనము |
| త్రిమూర్తి పూజ | - | దీర్ఘాయువు, ధర్మార్థకామాలు |
| కల్యాణీ పూజ | - | విద్య, రాజభోగము, |
| రోహిణి పూజ | - | రోగనాశనము |
| కాళీ పూజ | - | శతృనాశనము |
| చండిక పూజ | - | సంపత్కరము, |
| శాంభవి పూజ | - | రాజ్యపూజ్యమైన ధీశక్తి |
| దుర్గా పూజ | - | కష్టమైన కార్యముల సాధన |
| సుభద్రా పూజ | - | అభీష్ట ఫలదాయిని |

కుమారీ పూజను శ్రీరస్తు అని ప్రారంభించాలి. లేదా శ్రీపదముతో ఉన్న మంత్రంతోగాని, శ్రీబీజముతో గాని ప్రారంభించాలి.

బ్రహ్మాది దేవతలను రూపొందించే కుమారికి నమస్కారము గణత్రయముతో త్రిమూర్తుల సృష్టిచే త్రిమూర్తికి నమస్కారము సకలాభీష్ట ప్రదాయిని కల్యాణికి నమస్కారము. ప్రారబ్దమును పోగొట్టి సుఖములనిచ్చే రోహిణికి నమస్కారము. చండముండాదులను చంపిన చండికకు నమస్కారము. ఆత్మశక్తిని ప్రసాదించే శాంభవికి నమస్కారము శతృనాశనకారి కాళికి నమస్కారము కార్యములను సాధింపచేసే దుర్గకు నమస్కారము సర్వభీష్టఫలప్రదాయిని సుభద్రకు నమస్కారము.

ఈఅర్థాలు గల మంత్రాలతో యధాశక్తిగా కుమారీ పూజ చేసి వస్త్రాలు

సమర్పించాలి. అంగవైకల్యము కలది, రోగిష్టిది, చర్మరోగాలు కలది,నీచకుల సంజాత, పుట్టుగుడ్డి, ఒంటికంటిది, కురూపి, కృశాంగి, వంటినిండా రోమాలు కలది, రజోలక్షణాలు కలది, ఏడాదిలోపు వయసుకలది, కుమారీ పూజకు పనికి రాదు. ఏరోగము లేనిది, రూపసి, జన్మదోషము లేని కన్యమాత్రమే పూజకు తగినది.

| | | |
|---|---|---|
| బ్రాహ్మణులకు, క్షత్రియులకు | - | బ్రాహ్మణ కన్య |
| వైశ్యులకు | - | బ్రహ్మ, క్షత్రియ, వైశ్యకన్యలు |
| శూద్రులకు | - | పైనాలుగు వర్ణముల కన్యలు పూజార్హులు. |

ఈపద్ధతి ప్రకారము శ్రద్ధాభక్తులతో నవరాత్రి పూజ చెయ్యాలి. శక్తి లేకపోతే అష్టమినాడైనా దేవీ పూజ చెయ్యాలి. దక్షయజ్ఞ వినాశనానికి భద్రకాళి అష్టమినాడు అవతరించింది కాబట్టి ఆమె సంతోషం కోసం అష్టమీ పూజ తప్పక చెయ్యాలి. తొమ్మిది రోజులూ ఉపవాసం ఉండలేకపోతే సప్తమి, అష్టమి, నవమి ఈమూడు రోజులు ఉపవాసం ఉంటే చాలునని ఆగమాలలో చెప్పబడింది.

ఈమూడు దినాలూ హోమాలతో నవరాత్రి పూజ చక్కగా చేసినవారికి పరదేవత దీర్ఘాయువును, విద్య, కీర్తి, వైభవాలను సర్వశుభాలను కలిగిస్తుంది. రాజ్యంపోయిన వారికి రాజ్యం వస్తుంది. విద్యార్థులకు సకల విద్యలు వస్తాయి. మంచిగంధము, మారేడు దళాలు కలిపి దేవిని పూజించిన వాడు రాజవుతాడు.

మునుపు శ్రీరాముడు కూడా ఈవ్రతం చేసే రావణుణ్ణి సంహరించగలిగాడు. అని బ్రాహ్మణోత్తముడు వైశ్యునికి దేవీ మంత్రాన్ని ఉపదేశించాడు. తరువాత వైశ్యుడు యధాశక్తిగా పరమేశ్వరిని నవరాత్రులందు అర్చించి సర్వసుఖాలు అనుభవించాడు.

సంవత్సరములోపు బాలికకు గంధాది భోగములు తెలియవు కాబట్టి పూజకు పనికిరాదు. రెండునుంచి పది సంవత్సరాలు కలబాలికలు మాత్రమే పూజార్హులు.



# 8. మరుత్తులు

బ్రహ్మమానస పుత్రుడు మరీచి. ఇతని భార్య కర్దముని కుమార్తె అయిన కళ. వీరి కుమారుడే కశ్యపుడు. కశ్యపుడికి దక్షుని కుమార్తెలు పన్నెండు మందిని ఇచ్చి వివాహం చేశారు.

కశ్యపుడు యజ్ఞంచెయ్యటానికి మంచి ఆవులు కావాలని తిరిగి తిరిగి చివరకు వరుణ దేవుని ఆవులను ఎత్తుకు పోయాడు. దానికి వరుణుడు కోపించి ఇక్కడ ఆవుదూడలు తమ తల్లులు దగ్గరలేక ఎలా బాధపడుతున్నాయో అలాగే కశ్యపుని భార్యలు పుత్రశోకం పొందుతారు అనీ, అదితి కొడుకులు చచ్చి చెరలో ఉంటూ ఏడుస్తుందని శాపం పెట్టాడు. ఒకసారి దితి,అదితిలమధ్య తగాదా వచ్చింది.అప్పుడు దితి నీకు ఏడుగురు కొడుకులు పుట్టగానే వారు చంపబడతారు. అని శపించింది. మురుజన్మలో కశ్యపుడే వసుదేవుడు,అదితి దేవకి.

ఒకనాడు దితి ఇంద్ర సమానుడైన కుమారుడు కావాలి అని భర్తనడిగింది. సరే అన్నాడు భర్త. దితి గర్భవతి అయింది. ఇంద్ర సమానుడు పుడతాడేమో అని అదితి ఇంద్రుణ్ణి పిలిచి అదితి గర్భస్త శిశువును చంపి వేయమన్నది.

ఒకరోజు దితి పగటి పూట మంచం మీద కాళ్ళ వైపు తల పెట్టుకుని పడుకుని నిద్రపోతోంది.ఇంద్రుడు వచ్చి పిన తల్లికి సేవలు చెయ్యటం మొదలు పెట్టాడు. దితి నిద్రపోయింది. సమయం చూసి ఇంద్రుడు ఆమె గర్భంలోకి దూరి వజ్రాయుధంతో ఆశిశువును ఏడు ముక్కలుగా నరికాడు. అప్పుడా ముక్కలు ఏడవటం మొదలు పెట్టాయి. అప్పుడు ఇంద్రుడు 'మారుద' 'మారుద' అంటే ఏడవకు అని అర్థం.ఒక్కొక్క ఖండాన్నీ మళ్ళీ ఏడు ముక్కలుగా విభజించాడు. ఈరకంగా పిండం మొత్తం మీద నలభై తొమ్మిది ముక్కలై బయటకు వచ్చేసింది. వీరే మరుత్మలు. మహాబల సంపన్నులు.

దితికి నిద్రాభంగమయింది. ఇంద్రుడు ఎదురుగా నుంచుని వీళ్ళునాకు శత్రువులు కాబట్టి చంపేశాను అన్నాడు. వాళ్ళు శత్రువులు కాదు నీకు మిత్రులే అన్నది దితి. ముక్కలుగా నరికినా చావలేదు కాబట్టి వాళ్ళుకూడా దేవతలే. ఇంద్రుడు వారికి మరుద్గణాలు అని పేరు పెట్టాడు. రాక్షస సంహారంలో మరుద్గణాలు ఇంద్రుడికి సాయంగా నిలుస్తాయి.

# 9. భృగుశాపం

బ్రహ్మమానసపుత్రుడు భృగువు. ఇతని భార్యా 'ఉశన' వీరి కుమారుడు శుక్రుడు. అంగిరసుని కుమారుడు బృహస్పతి. వీరిద్దరూ అంగిరసుని దగ్గరవిద్య నేర్చుకున్నారు. బృహస్పతి దేవగురువుకాగా శుక్రుడు రాక్షసగురువైనాడు.

ఒకసారి దేవదానవులకు ఘోరమైన యుద్ధంజరిగింది. అందులో దేవతల ధాటికి తాళలేక రాక్షసులు తమ గురువైన శుక్రాచార్యుడి దగ్గరకు వెళ్ళి "గురుదేవా! మాబాధలు చూడండి. దేవతలు మమ్మల్ని చావకొట్టారు. మహా మంత్రవేత్తవు. దివ్యమహిమోపేతుడవు. మాఇలవేల్పు నీవే. నువ్వు మాట్లాడకుండా ఉంటే మేం బ్రతకలేము. మమ్మల్ని రక్షించే భారం నీదే." అన్నారు.

శిష్యుల గోడు విన్నాడు శుక్రుడు. క్షణకాలం ఆలోచించి "శిష్యులారా! విష్ణువు సామాన్యుడు కాదు. మాయలు బాగా తెలిసినవాడు. అతని సహాయం వల్లనే దేవతలు జయించారు. అతనికి ప్రతిగా నిలవాలంటేశివుడి అనుగ్రహం సంపాదించాలి. ఆవేశపడకండి నేను వెళ్ళి శివుని అనుగ్రహం సంపాదిస్తాను. అంతవరకు మీరు దేవతలతో యుద్ధానికి పోకుండా, శాంతంగా ఉండండి. ఓర్పుతో నేర్పుగా మెలగండి.' ' అని శివుని గురించి తపస్సు చెయ్యటానికి వెళ్ళాడు.

రాక్షసులు ఆలోచించి తాము పాతవగలు మరచిపోయామని, శాంతస్వభావంతో జీవిస్తున్నామని, తమ మీదకి దండయాత్ర చెయ్యవద్దని ప్రహ్లాదుడితో దేవతలకు కబురు పెట్టారు. వచ్చినవాడు ప్రహ్లాదుడు కాబట్టి దేవతలు నమ్మారు. రాక్షసులు కూడా ముని వేషాలతో కశ్యపుని ఆశ్రమంలో కాలక్షేపం చేస్తున్నారు.

శుక్రుడు రాక్షసుల క్షేమం కోసం శివుని గురించి తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై ఏవరం కావాలో కోరుకో అన్నాడు. దానికి శుక్రుడు "మహేశ్వరా! నా శిష్యులు రాక్షసులు, వారి మేలుకోరటం నాధర్మం కదా! వారికి జయము, దేవతలకు అపజయము కలిగే మంత్రం నాకు ప్రసాదించు" అన్నాడు.

విన్నాడు శివుడు, గట్టి చిక్కే వచ్చింది. నేను దేవపక్షపాతిని. ఇతడు దేవతల నాశనం కోరుతున్నాడు. రాక్షసులకు విజయం అంటే అధర్మ వర్తనమే కదా! మరి ఏమిటి కర్తవ్యం అని ఆలోచించి "మునీంద్రా! తలక్రిందులుగా ఉండి పొగ మాత్రమే త్రాగుతూ వేయి సంవత్సరాలు తపస్సు చెయ్యి. నీకోరిక సిద్ధిస్తుంది" అన్నాడు. చుట్టూ ఎండు కట్టెలు పెట్టుకుని, వాటికి నిప్పంటించి, వాటినుంచి వచ్చే పొగ పీలుస్తూ తపస్సు చెయ్యాలి. ఇది కష్టసాధ్యమైనపని. ఈవిధంగా శుక్రుడు తపస్సు చెయ్యలేడని శివుడు ఈ నియమం విధించాడు. సరే అన్నాడు శుక్రుడు. శివుడు చెప్పిన విధంగానే తపస్సు చెయ్యటం ప్రారంభించాడు.

శుక్రుని తపోవృత్తాంతము, రాక్షసుల కపటనాటకము, చారుల వల్ల విన్న

ఇంద్రుడు రాక్షసులను మీదికి దండయాత్ర చేశాడు. రాక్షసులను పట్టుకుని బాగా బాదాడు. రాక్షసులు ఇంద్రుడి చేతిలో చావుదెబ్బలు తిని శుక్రుని తల్లిని శరణు వేడారు. ఆమె వారికి అభయం ఇచ్చింది. అయినా వదలలేదు దేవతలు. అందుకని ఆమె దేవతల మీద సమ్మోహనం ప్రయోగించింది. దాంతో దేవతలంతా మాయలో పడి నిద్రకులోనయ్యారు. వారి శరీరం వారి వశం తప్పింది. చూశాడు ఇంద్రుడు. పరుగెత్తుకుంటూ వెళ్ళి జరిగిందంతా విష్ణువుకు వివరించాడు. శుక్రుని తల్లి ప్రయోగించిన మాయ ఇంద్రుని వెంట పడింది. ఇంద్రుడు విష్ణువును శరణు వేడటం చూసి వారిద్దరినీ కలిపి ఆవహించటానికి ప్రయత్నించింది. ఈ విషయం తెలిసిన హరి వెంటనే చక్రాయుధం ప్రయోగించాడు. ఆ చక్రం మాయతో పాటు భృగుని భార్యను కూడా చంపివేసింది. మాయ ఎప్పుడైతే చంపబడిందో అప్పుడు దేవతలకు పట్టిన నిద్ర మాయమైంది. కాని భృగు మహర్షి భార్య చనిపోయింది. దారుణమైన సంఘటన ఎంతకు దారితీస్తుందో అని ఇంద్రుడు, విష్ణువు భయపడసాగారు.

విష్ణువు చక్రం ప్రయోగించి తన భార్యను దారుణంగా చంపాడన్న విషయం విన్నాడు భృగువు. భార్య కోసం దుఃఖించాడు. విష్ణువు చేసిన పనికి మహర్షి కోపం కట్టలు తెంచుకుంది. వెనకాముందు ఆలోచించకుండా మునిపత్నిని నిర్దాక్షణ్యంగా వధించిన ఓ హరీ! దీనికి ఫలితంగా నానా యోనులందూ పుడుతూ, జనన మరణ దుఃఖాలు అనుభవిస్తూ ఉండు" అని శపించాడు.

మాతృ గర్భంలో తల క్రిందులుగా ప్రాణాలు అరచేత్తో పట్టుకుని, మలమూత్రాలతో కలుషితమైన స్థితిలో శిశువుగా ఉండటంకన్న దురవస్థ ఇంకా ఏముంది.క్రిములు కరుస్తుంటాయి. ఆకలి వేస్తుంది. ఒత్తిగిల్లటానికి వీలుండదు. ఈ రకంగా పది నెలలు గడవాలి. ఒక కల్పాంతం అంటే దాదాపు 42 కోట్ల సంవత్సరాలైనా నరకం అనుభవించవచ్చుగాని, ఒక్క గంటైనా సరే గర్భవాసం మాత్రం అనుభవించలేము. ఆ గర్భంనుంచి బయటికి రావటం భరించరాని బాధ. భూ పతనమైనప్పటినుంచి బాల్యావస్థ అంతా కష్టాల వల,....ఒకసారి కాదు. అనేక జన్మలు ఎత్తాల్సి వస్తోంది. ఏమిటి ఈ ఖర్మ? అని విచారించసాగాడు విష్ణువు.

అపుడు పరమేశ్వరి ప్రత్యక్షమై "ఓ హరీ! అంతా నీమేలుకే జరిగింది. భూలోకంలో రాక్షసుల దుశ్చర్యలు మితిమీరిపోయి, ధర్మం నాశనమయినప్పుడు నీవుభూలోకంలో జన్మించి ఆ రాక్షసులను చంపి ప్రజలను కష్టాలనుంచి కాపాడు. మునిగణాలను రక్షించి సాధుపుంగవులను ఉద్ధరించు. ధర్మ సంస్థాపన కోసం భూలోకంలో అవతరించు"అని దీవించింది.

ఆ పరమేశ్వరి ఆజ్ఞానుసారమే శ్రీమహా విష్ణువు అనేక అవతారాలెత్తి రాక్షస సంహారం చేసి, ధర్మ సంస్థాపన చేశాడు.

# 10. మహాభారతము

మనువులలో మొదటివాడు స్వాయంభవమనువు. అతని మన్వంతరంలో మరీచి బ్రహ్మమానసపుత్రుడు. అతడి భార్య ఊర్ణి. వీరికి ఆరుగురు కుమారులు కలిగారు. వారు క్రమంగా పెరిగి పెద్దవాళ్ళయ్యారు. ఒకరోజున అరణ్యప్రాంతంలో వారు పోతుండగా ఒక దృశ్యం కనపడింది. ముందు సరస్వతి వెడుతున్నది. ఆమెను చూచి మోహించిన బ్రహ్మ ఆమె వెనుక పరుగెడుతున్నాడు. అదిచూసిన మరీచి పుత్రులు విరగబడి నవ్వుతూ బ్రహ్మను గేలిచేశారు. దానికి బ్రహ్మకోపించి వారిని రాక్షస జాతిలో పుట్టండి అని శపించాడు.

తాటకాసునందనుల కుమారుడు మారీచుడు. జయవిజయుల యొక్క కింకరుడు జితుడు. సనకసనందనులచే శపించబడి మారీచునిగా పుట్టాడు. అతని కుమారుడు కాలనేమి. ఇతని కుమార్తె బృంద, జలంధరుని భార్య. కాలనేమి సంజీవిని తీసుకుని రావటానికి వెడుతున్న ఆంజనేయుణ్ణి అడ్డగించబోయి అతడి చేతిలో హతుడైనాడు. బ్రహ్మవలన శాపం పొందిన మరీచికుమారులు ఆరుగురు కాలనేమి కుమారులుగ జన్మించారు.

జయవిజయులు విష్ణుమూర్తి ద్వారపాలకులు. సనకసనందనాదుల శాపవశాన వారు కశ్యపప్రజాపతికి దితి వల్ల హిరణ్యకశ్యప హిరణ్యాక్షులుగా జన్మించారు. హిరణ్యకశ్యపుడికి ప్రహ్లాదుడుగాక ఇంకా అనుహ్లాదుడు, సంహ్లాదుడు, హ్లాదుడు మొదలైన ఆరుగురు మగపిల్లలు ఉన్నారు.ఇదే మరీచి యొక్క సంతానమైన షడ్గర్భు రెండవజన్మ.

వీరు తండ్రికి తెలియకుండా బ్రహ్మను గూర్చి తపస్సు చేశారు. అందుకుకోపించిన హిరణ్యకశ్యపుడు వారిని పాతాళానికి పోయి చాలాకాలం నిద్రావస్థలో ఉండండి. మరు జన్మలో దేవకీదేవి గర్భాన పుట్టండి. గత జన్మలో మీతండ్రి అయిన కాలనేమి కంసుడుగా పుట్టి మిమ్మల్ని చంపుతాడు అని శపించాడు.

పునర్వసుని కుమారుడు యాహకుడు. అతని కుమారుడు ఉగ్రసేనుడు. అతడు సతీసమేతంగా యమునా తీరాన వ్యాహ్యాళికి వెళ్లినప్పుడు ఒకరాక్షసుడు ఆమెను చూసి మోహించి ఉగ్రసేనుడి రూపంతో ఆమెతో క్రీడించాడు. అందువలన కాలనేమి అంశతో ఆమెకు పుట్టిన వాడే కంసుడు. ఈరకంగా కంసుడు ఉగ్రసేనునికి క్షేత్రజుడైన కుమారుడు. అతనికి ఇంకా కొంతమంది కుమారులు దేవకి అనే కుమార్తె ఉన్నారు.

కంసుడు పెద్దవాడై ఉగ్రసేనుణ్ణి బంధించి తానే రాజైనాడు. దేవకీ వసుదేవుల

వివాహం చేశాడు. దేవకి అష్టమగర్భాన పుట్టే వాడి వల్ల తనకు మరణం సంభవిస్తుందని తెలిసి దేవకీవసుదేవులను చెరసాలలో బంధించాడు. ప్రథమ యుగంలో మరీచి పుత్రులు ఆరుగురు కాలక్రమాన హిరణ్యాకశ్యపుని శాపం వల్ల దేవకి గర్భాన జన్మించారు.పుట్టిన వెంటనే కంసుడు వారిని చంపివేశాడు.

కొంతకాలం క్రితం దితి ఇంద్రునికన్న బలశాలి అయిన కుమారుడు కావాలని భర్తని కోరింది. తరువాత దితి గర్భవతిగా ఉన్న సమయంతో ఇంద్రుడు ఆమె గర్భంలో ప్రవేశించి లోపలి పిండాన్ని నలభై తొమ్మిది ముక్కలుగా నరికాడు. ఆముక్కలే బ్రతికి మరుద్గణాలైనాయి. ఇంద్రుడిచేత అదితి ఈపని చేయించిందని కోపించి అదితిని కారాగృహంలో బంధించబడి ఉండు. నీకు పుట్టిన కుమారులంతా నీకళ్ళముందే చంపబడతారు అని శపించింది. జన్మాంతరంలో అదితియే దేవకి. కశ్యపుడే వసుదేవుడు.

ఒకసారి బ్రహ్మ విష్ణువు దగ్గరకు వెళ్లి భూలోకంలో భారం పెరిగిపోతోంది. పాపులు ఎక్కువ అవుతున్నారు అని చెప్పగా వైకుంఠుడు తెల్లనిది, నల్లనిది రెండు రోమాలు తీసి ఇచ్చాడు. వాటి వల్ల రోహిణికి ఆదిశేషుని అంశతో పుట్టిన వాడు బలరాముడు. దేవకికి అష్టమగర్భాన పుట్టిన వాడు కృష్ణుడు. ఈరకంగా నరుడు అర్జునుడుగాను నారాయణుడు కృష్ణుడుగాను పుట్టారు.

| | | |
|---|---|---|
| యమధర్మరాజు అంశతో | - | విదురుడు, ధర్మరాజు |
| వాయువు అంశతో | - | భీముడు |
| అశ్వనీ దేవతల అంశతో | - | నకుల సహదేవులు |
| సూర్యుని అంశతో | - | కర్ణుడు |
| బృహస్పతి అంశతో | - | ద్రోణుడు |
| కామక్రోధాల అంశతో | - | అశ్వత్థామ |
| సముద్రాంశతో | - | శంతనుడు |
| అష్టవసువులలో ఆఖరి | | |
| వాడయిన ప్రభాసుడు | - | భీష్ముడు |
| గంధర్వరాజు అంశతో | - | దేవకుడు |
| మరుత్తుల అంశతో | - | విరాటుడు, కృపుడు, కృతవర్మ |
| అరిష్టనేమి కుమారుడు | | |
| హంసుని అంశతో | - | ధృతరాష్ట్రుడు |
| [illegible] | | [illegible] |

| | | |
|---|---|---|
| ద్వాపరాంశతో | - | శకుని |
| అగ్ని అంశతో | - | దుష్టద్యుమ్నుడు |
| రాక్షసాంశతో | - | శిఖండి |
| సనత్కుమారుని అంశతో | - | ప్రద్యుమ్నుడు |
| వరుణాంశతో | - | ద్రుపదుడు |
| లక్ష్మి అంశతో | - | ద్రౌపది |
| విశ్వేదేవుని అంశతో | - | ఉపపాండవులు |
| సిద్ధి అంశతో | - | కుంతి |
| ధృతి అంశతో | - | మాద్రి |
| మతి అంశతో | - | గాంధారి |
| హిరణ్యకశ్యపుడి అంశతో | - | శిశుపాలుడు |
| విప్రజిత్తు అంశతో | - | జరాసంధుడు |
| ప్రహ్లాదుని రెండవజన్మ | - | శల్యుడు |
| బలికుమార్తె | - | బకి |
| వారాహుడు, కిశోరుడుఅనే | | |
| రాక్షసుల అంశతో | - | చాణుర ముష్టికులు |
| అరిష్టుడు అనే | | |
| రాక్షసాంశతో | - | కంసుని ఏనుగైన కువలయపీడనము. |

ఈరకంగా దేవదానవులంతా ఈభూమి మీద మళ్ళీ పుట్టి మహాభారత యుద్ధానికి నాంది పలికారు.



# 11. మహిషుడు

విష్ణువుయొక్క నాభికమలంనుంచి పుట్టిన బ్రహ్మ కొన్ని వేల సంవత్సరాలు తపస్సు చేసి పరమేశ్వరిని మెప్పించి, ఆమె అనుజ్ఞతో సృష్టికార్యక్రమము కొనసాగిస్తూ, అందులో భాగంగా మానసికంగా

మరీచి, అంగిరసుడు, అత్రి, వసిష్ఠుడు, పులహుడు, క్రతువు, పులస్త్యుడు.

అనే ఏడుగురిని సృష్టించాడు. వీరిని బ్రహ్మమానసపుత్రులు అంటారు. ఆతరువాత

| | | |
|---|---|---|
| రోషము వల్ల | - | రుద్రుడు, |
| తొడ నుంచి | - | నారదుడు, |
| కుడిచేతి బొటన వేలునుంచి | - | దక్షుడు, |
| ఎడమ చేతి బొటన వేలునుంచి | - | వీరిణి అనే కన్యపుట్టారు. |

మరీచి కుమారుడు కశ్యపుడు. ఇతడు దక్ష ప్రజాపతి కుమార్తెలయిన

అదితి, దితి, దనువు, కాల, అనాయువు, సింహిక, క్రోధ, పృధ, విశ్వ, వినత, కపిల, కద్రువ. అనే పన్నెండు మందిని వివాహమాడాడు. కశ్యపుడికి దనువు యందు పుట్టినవారు దానవులు. వాళ్ళలో రంభుడు, కరంభుడు అనే వారిద్దరు. వీరికి సంతానం లేదు. అందుచేత సంతానంకోసం తపస్సు చెయ్యటం మొదలు పెట్టారు. రంభుడు తనచుట్టూ అగ్ని ప్రజ్వరిల్ల చేసి పంచాగ్నుల మధ్య ఉండి తపస్సు చేస్తున్నాడు. పంచాగ్నులు అంటే

1. పూర్వాగ్ని, 2.దక్షిణాగ్ని 3. పశ్చిమాగ్ని 4.ఉత్తరాగ్ని 5.సూర్యుడు.

కరంభుడు పీకలోతు నీళ్ళలో ఉండి తపస్సు చేస్తున్నాడు. ఈ విషయం తెలిసిన దేవేంద్రుడు మొసలి రూపంలో వెళ్ళి కరంభుణ్ణి చంపేశాడు. ఈ సంగతి తెలిసిన రంభుడు దుఃఖించి ఇంద్రుని మీద పగతీర్చుకునేందుకు గాను బలాఢ్యుడు, దేవతలను జయించగలిగినవాడు అయిన పుత్రుడి కోసం అగ్ని దేవుణ్ణి ప్రార్థించాడు. ఎంతసేపటికీ అగ్ని దేవుడు కనికరించలేదు. అప్పుడు రంభుడు హోమగుండం సృష్టించి దానిలో తనతలను హోమంచెయ్యటానికి పూను కున్నాడు. ఆ సమయంలో అగ్ని దేవుడు ప్రత్యక్షమై ఏవరం కావాలో కోరుకోమన్నాడు. దానికి రంభుడు "స్వామీ! అజేయుడూ, అపూర్వబలశాలి, కామరూపి, ముల్లోకాలను జయించి పాలించగలవాడు, అయిన కుమారుడు కావాలి" అన్నాడు. అగ్నిదేవుడు రంభుడి కోరిక తీరుస్తూ "ఇక్కడనుండి వెళ్ళేటప్పుడు ముందుగా నువు ఎవర్ని చూసి కామిస్తావో వారి యందు నీకు పై లక్షణాలుగల పుత్రుడు ఉదయిస్తాడు." అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

వరప్రసాది అయిన రంభుడు ఇంటికి బయలు దేరాడు. అతడు యక్ష, గంధర్వ, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్య గణాలు ఉండే ప్రాంతాల గుండా ప్రయాణిస్తున్నాడు. త్రోవలో ఎంతో మంది అప్సరాంగనలు, దేవతాస్త్రీలు, అపురూపసౌందర్యరాసులు తారసపడ్డారు. కాని రంభుడి మనసుమాత్రం చలించలేదు.

అప్పటికి కొంతకాలంక్రింతం మహిష్మతి అనే గంధర్వకాంత శాపవశాన మహిషము గా జన్మించింది. ఆ మహిషము సుందరీమణులయిన అప్సరాంగనలు తిరుగాడుతున్న ప్రదేశానికి కొంచెం దూరంగా, సెలయేటి గట్టున గడ్డిమేస్తోంది. ఆ గేదెను చూడగానే రంభుడి మనస్సు చలించింది. గతజన్మ ప్రారబ్ధాన్ని తప్పించటం ఎవరి వల్ల అవుతుంది? రంభుడి మనసు చలించటమేతడవుగా ఆ గేదె గర్భం దాల్చింది. గర్భవతి అయిన గేదెను వెంటపెట్టుకుని ఇంటికి బయలు దేరాడు రంభుడు. కొంతకాలానికి ఆ గేదె దున్నపోతుతల, మనిషి శరీరము కల పిల్లవాణ్ణి కన్నది. వాడే మహిషాసురుడు. పుత్రోదయం కాగానే ఆ మహిష్మతికి శాపవిమోచన మయి గంధర్వలోకానికి వెళ్ళిపోయింది.

మహిషాసురుడు బ్రహ్మను గూర్చి ఘోరమైన తపస్సు చేశాడు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమయ్యాడు. మరణంలేకుండా వరం కావాలి అన్నాడు మహిషుడు. పుట్టిన ప్రతి ప్రాణికీ మరణంతప్పదు. నేనుకూడా కలకాలంఉండను. నాకులేనిది నీకెలా ఇవ్వగలను. కాబట్టి ఇంకేదయినా వరం కోరుకో అన్నాడు బ్రహ్మ. ఆలోచించాడు మహిషుడు. లోకంలో బలహీన మైన ప్రాణి స్త్రీ ఒక్కటే. ఆడదాన్ని అరికాలితో నలిపివేస్తాను. కాబట్టి స్త్రీతో తప్ప మిగిలిన ఏ ప్రాణివల్లాకూడా నాకు ప్రాణహాని కలగకుండా ఉండేటట్లు వరమియ్యి అన్నాడు. తథాస్తు అన్నాడు విధాత.

బ్రహ్మ వర ప్రసాది అయిన మహిషుడికి దైత్య గణాలన్నీ జయజయధ్వానాలతో స్వాగతం పలికి 'రాజా నీవు లేని సమయంలో దేవతలు మనరాజ్యం అపహరించారు. అని చెప్పారు. ఆమాటవిన్న మరుక్షణమే కోపంతో ఊగిపోయాడు మహిషుడు. కళ్ళు ఎర్ర బడ్డాయి. భ్రుకుటి ముడిపడింది. కళ్ళనుంచి విస్ఫులింగాలు రాలాయి. వీరావేశంతో పెద్ద పెట్టున హుంకరించాడు. ఆ శబ్దానికి భూనభోంతరాళాలు దద్దరిల్లాయి. దిక్కులు పిక్కటిల్లాయి. వెంటనే

| | |
|---|---|
| 1.అసిలోముడు | 4. బాష్కలుడు |
| 2. ఉదర్కుడు | 5. త్రినేత్రుడు |
| 3. బిడాలుడు | 6. కాలబంధకుడు |

అనే వారిని దండనాయకులుగా, చిక్షురాక్షుడు సేనాధిపతిగా, దైత్యగణాలు వెంటరాగా జైత్రయాత్రకు బయలు దేరాడు.

భూలోకంలో ఉండే రాజ్యాలన్నీ మహిషుడికి పాదాక్రాంతమైనాయి. అప్పుడు అతడిదృష్టి దేవలోకం మీద పడింది.

దేవ దానవ గణాల మధ్య భీకర సంగ్రామం జరిగింది. ఆమహాయుద్ధంలో దేవతలంతా పరాజితులై పలాయనం చిత్తగించారు. దేవలోకాన్ని ఆక్రమించి ఇంద్రుడి సింహాసనాన్ని అధిష్టించాడు మహిషాసురుడు.ఆ విధంగా రాక్షసుల చేతిలో చావుదెబ్బలు తిన్న దేవతలు త్రిమూర్తులు ఉన్నచోటికి వచ్చి జరిన దురాగతాన్ని వారికి వివరించి తమను రక్షించవలసిందిగా వేడుకున్నారు.

ఇత్థం నిశమ్య దేవానాం వచాంసి మధుసూదనః
చకార కోపం శమ్భుశ్చ భ్రుకుటీకుటిలాననౌ॥

త్రిమూర్తుల ముఖమలనుండి వారి తేజస్సు బయటకు వచ్చింది. ఈ రకంగా దేవతల ముఖములనుండి బయటకు వచ్చిన తేజస్సు అంతా కలిసి తేజోరాసిగా ఏర్పడింది.

ఏకస్థం తదభూన్నారీ వ్యాప్తలోకత్రయం త్విషా

కాంతి వంతమైన ఆతేజో రాసి అంతా ఒక స్త్రీ రూపం దాల్చింది.

యదభూచ్ఛాంభవం తేజస్తేనాజాయత తన్ముఖమ్
యామ్యేన చాభవన్ కేశా బాహవో విష్ణుతేజసా..
సౌమ్యేన స్తనయోర్యుగ్మం మధ్య యైంద్రేణ చాభవత్।
వారుణేన చ జఙ్ఘోరూ నితమ్బ స్తేజసా భువః।

ఆరకంగా సృష్టింపబడిన స్త్రీమూర్తి శరీరాంగములన్నీ దేవతల తేజస్సు నుంచి ఉధ్భవించినవే. ఆ దేవి

| | | |
|---|---|---|
| ముఖము | - | శివుని తేజస్సు తోను, |
| కురులు | - | యముని తేజస్సు |
| బాహువులు | - | విష్ణు తేజస్సు |
| పాదములు | - | బ్రహ్మ తేజస్సు |
| పాదముల వ్రేళ్ళు | - | సూర్యుడి తేజస్సు |
| చేతి వేళ్ళు | - | అష్టవసువుల తేజస్సు |
| ముక్కు | - | కుబేరుడి తేజస్సు |
| దంతములు | - | ప్రజాపతి తేజస్సు |
| మూడుకనులు | - | అగ్ని తేజస్సు |
| చెవులు | - | వాయువు తేజస్సు |

ఈ రకంగా దేవతలదగ్గర నుండి వచ్చిన తేజస్సుతో ఆ దేవి యొక్క వివిధ అంగములు ఏర్పడ్డాయి.

**తతః సమస్త దేవానాం తేజోరాశి సముద్భవామ్।**

దేవతల శరీరము నుండి వచ్చిన కాంతితో బ్రహ్మాండమయిన తేజస్సుతో

వెలుగొందుచున్న ఒకస్త్రీమూర్తి దర్శన మిచ్చింది.ఆస్త్రీమూర్తిని చూసి తప్పకుండాఈవిడ మహిషాసుర సంహారం చేస్తుంది అని దేవతలు సంతోషించారు.

ఒక స్త్రీమూర్తి అయితే వచ్చింది. కాని యుద్ధం చెయ్యటానికి ఆవిడకి ఆయుధాలు లేవు. అప్పుడు దేవతలు వారి ఆయుధాల లోని శక్తులను తీసి ఆవిడకు ఇవ్వటం మొదలు పెట్టారు.

శూలం శూలాద్వినిష్కృష్య దదౌ తస్మై పినాకధృక్
చక్రం చ దత్తవాన్ కృష్ణః సముత్పాట్య స్వచక్రతః

| | | |
|---|---|---|
| శివుడు | - | శూలాన్నిఇచ్చాడు |
| విష్ణువు | - | చక్రాన్ని |
| వరుణుడు | - | శంఖము,పాశము |
| అగ్ని | - | బల్లెము |
| వాయువు | - | ధనుర్బాణములు |
| ఇంద్రుడు | - | వజ్రాయుధములు |
| యముడు | - | కాలదండము,ఖడ్గము,డాలు |
| ప్రజాపతి | - | అక్షమాల,కమండలము |
| సూర్యుడు | - | సమస్త రోమకూపములందుతనకిరణములు |
| విశ్వకర్మ | - | కవచము, గండ్రగొడ్డలి |

ఈ రకంగా దేవతలందరూ ఆవిడకు వివిధాయుధాలు సమకూర్చారు.అయితే ఆవిడకు ఆభరణాలు మాత్రం లేవు. అప్పుడు

క్షీరోదశ్చామలం హారమజరే చ తథామ్బరే
చూడమణిం తథా దివ్యం కుణ్డలే కటకాని చ
అర్ధ చన్ద్రం తథా శుభ్రం కేయూరాన్ సర్వబాహుషు

పాలసముద్రుడుఒక ముత్యాల హారము, ఎప్పటికీ నలగని, చిరగని, మాయని రెండు చీరలు, దివ్యమైన శిరోరత్నము, కమ్మలు, కటకములు (గాజులు) అర్థ చంద్రాకార ఆభరణము, భుజకీర్తులు, మంజీరములు, కంఠాభరణములు, వ్రేళ్ళకు ఉంగరాలు సముద్రము రెండు తామరపూల మాలలు ఒకటి తలపైకి, రెండవది మెడను ధరించటానికి చేత్తో పట్టుకోటాని పద్మము

| | |
|---|---|
| హిమవంతుడు | సింహవాహనము, రత్నములు |
| కుబేరుడు | పానపాత్ర (ఎన్నటికీ తరగనిది) |
| ఆదిశేషుడు | సర్పహారము |

ఈ రకంగా దేవతలందరూ రకరకాల ఆయుధాలు, ఆభరణాలు అందివ్వగా, వారి తేజస్సుతో ఆవిర్భవించిన అతి బలసంపన్నము, అరివీరభయంకరము తేజస్సంపన్నము అయిన రూపంతో దేవి

సమ్మానితా సనాదోచ్చైః సాట్టహాసం ముహుర్ముహుః
తస్యా నాదేన ఘోరేణ కృత్స్నమాపూరితం నభః
అమాయతాతిమహతా ప్రతిశబ్దో మహానభూత్
చక్షుభుః సకలాలోకాః సముద్రాశ్చ చకమ్పిరే
చచాల వసుధా చేలుః సకలాశ్చమహీధరాః

పెద్ద పెట్టున మహాట్టహాసం చేసింది.ఆ అట్టహాసానికి భూనభోంతరాళాలు దద్దరిల్లాయి. లోకాలన్నీ వణికిపోయాయి. సముద్రాలు కంపించాయి. భూమి చలించి పోయింది. పర్వతాలు కదిలిపోయాయి. సకలజగత్తూ గడగడవణికిపోయింది.

దేవతలందరూ ఆ జగన్మాతకు నమస్కరించి, జయజయధ్వానాలు చేశారు. మునులు, ఋషులు ఆమెను స్తుతించారు.

ఆరకంగా ముల్లోకాల్లోనూ ఎప్పుడైతే కలవరం చెలరేగిందో, అప్పుడు వెంటనే రాక్షసగణాలు తమసైన్యాన్ని యుద్ధ సన్నద్ధం చేశాయి. భయంకరమైన అట్టహాసం వచ్చిన వైపుకు చూశాడు మహిషుడు. అక్కడ ఆదేవి అతనికి దర్శనమిచ్చింది.

స దదర్శ తతోదేవీం వ్యాప్తలోకత్రయాం త్విషా
పాదాక్రాన్త్యా నతభువం కిరీటోల్లిఖితామ్బరామ్
క్షోభితాశేషపాతాళాం ధనుర్జ్యానిఃస్వనేన తామ్॥

శరీర కాంతులచే ముల్లోకాలు ప్రకాశిస్తున్నాయి. ఆమె నడుస్తుంటే భూమి వంగిపోతోంది. వింటినారి లాగి వదిలితే ఆ శబ్దానికి పాతాళలోకం అతలాకుతలం అయిపోతోంది. అటువంటి వేయిబాహువులుకల ఆదేవిని చూశాడు. మహిషుడు.

సహస్ర శీర్షాపురుషః సహస్రాక్షస్సహస్రపాత్।

వేయి శిరసులు, వేయికనులు, వేయిచేతులు అంటే అనంతమైనటువంటి శిరస్సులు, కనులు, చేతులు కలది ఆదేవి. ఎంతటి మహద్భాగ్యమతడిది. ఎవరి దర్శనంకోసమైతే దేవతలు, ఋషులు, సిద్ధులు తహతహలాడిపోతారో, ఎవరి కరుణాదృక్కులతో ముల్లోకాలు సుఖంగా ఉంటాయో, అట్టి దేవిని, సృష్టిస్థితి లయకారిణి అయిన ఆపరాత్పరిని చూశాడు మహిషుడు. ఆక్షణంలోనే అతని జన్మ సార్థకమైంది.

కాని తనలో ఉన్న పశుప్రవృత్తితో, అజ్ఞానంతో, నేను, నాది అన్న అహంకారంతో ఆ దేవితో యుద్ధానికి తలపడ్డాడు.

అప్పుడు ఆ జగన్మాతకు, రాక్షసులకు ఘోరమైన యుద్ధం జరిగింది. ఆయుద్ధంలో

| | | |
|---|---|---|
| ఉదగ్రుడు | - | 60వేల రథాలతోను |
| భాస్కలుడు | - | 60 లక్షల రథాలతోను, |
| మహాహనుడు | - | నూరులక్షల రథాలతోను |
| అసిలోముడు | - | 150 లక్షల రథాలతోను, |

ఆదేవిని ఎదిరించి పోరాడారు. గద, బల్లెము, రోకలి, ఖడ్గము, గండ్రగొడ్డలి,

మొదలైన ఆయుధాలు దేవిపైవిసిరారు. వాటన్నింటినీ తన బాణాలతో దేవి ఖండించివేసింది. తన యొక్క వివిధ ఆయుధాలతో రాక్షసుల దేహాలు ముక్కలు ముక్కలుగా చేసింది. రథాలు నుగ్గుచేసింది. మిగిలిన రాక్షససేనలు ప్రాణాలు అరచేత పట్టుకుని పారిపోవటం మొదలు పెట్టాయి.అదిచూసిన మహిషుని సేనాని చిక్షురుడు అనే మహాయోధుడు దేవితో యుద్ధానికి వచ్చాడు. వారిద్దరికీ భీకర సంగ్రామం జరిగింది. ఆ మహాయుద్ధంలో చిక్షురుడితోపాటు, అనేక మంది మహాయోధులు మరణించారు. చూశాడు వరబలగర్వితుడైన మహిషాసురుడు. ఒక ఆడది ఈవిధంగా తన సైన్యాన్ని నాశనం చేస్తుంటే ఆశ్చర్యపోయాడు. విపరీతమైన కోపానికి లోనయ్యాడు.కళ్ళు ఎర్ర జీరలు వారినాయి. వెంటనే తన అసలు రూపంతో దేవితో యుద్ధానికి వచ్చాడు. దేవి సైన్యంలో కొందరిని తోకతో కొట్టి చంపాడు. కొందరిని కొమ్ములతోపొడిచాడు. కొందరిని గిట్టలతో తొక్కివేశాడు. విపరీతమైన కోపంతో, ఆవేశంతో గిరగిరాతిరుగుతున్నాడు మహిషుడు. అతని గిట్టల రాపిడికి భూతలం దుమ్మయిపోతోంది. పర్వతాలను కొమ్ములతో ఎగరేస్తున్నాడు. తోక దెబ్బలకు సముద్రం అతలాకుతలం అయిపోతోంది.

ఈరకంగా ప్రళయాన్ని సృష్టిస్తున్న మహిషుణ్ణి దేవి పాశంతో బంధించి వేసింది. అప్పుడు ఆరాక్షసుడు మహిష రూపాన్ని వదలి సింహంగా మారాడు. దేవి ఆసింహం శిరస్సు ఖండించింది. మానవాకారం పొందాడు. ఆమానవుని శిరస్సు ఖండించింది. పెద్ద ఏనుగు అయ్యాడు. తొండాన్ని నరికి వేసింది. అప్పుడు మళ్ళీ మహిషరూపం ధరించి ముల్లోకాలు తల్లడిల్లచేస్తూ భయంకరంగా గర్జించాడు. అది విని దేవి

గర్జ గర్జ క్షణంమూఢ మధు యావత్పిబామ్యహమ్।
మయాత్వయి హతే త్రైవ గర్జిష్యన్త్యాశు దేవతాః॥

ఓరీ మూర్ఖుడా! ఇంకొక్క క్షణం, నేను ఈ మద్యంతాగేదాకా ఇలాగే గర్జించరా! నిన్ను నేను చంపిన మరుక్షణంలో దేవతలు కూడా ఇక్కడే ఇలాగే గర్జిస్తారు.అని చెప్పి, ఆకాశంలోకి ఎగిరి, ఆరాక్షసుడి మీదపడి, కాలితో పీకను తొక్కిపట్టి శూలంతో గ్రుచ్చింది. ఆదెబ్బకు ఆ రాక్షసుడు తన నిజస్వరూపంతో అంటే తలమాత్రం మహిషం, మిగిలిన శరీరము మానవుడుగా కనిపించాడు. ఆ క్షణంలోనే దేవి తన ఖడ్గంతో కొట్టినదెబ్బకు ఆరాక్షసుడి తల ఆకాశంలోకి ఎగిరి, గిరగిరా తిరుగుతూ నేలమీదపడి ముక్కలు ముక్కలయింది.

ఆదృశ్యం చూపి దేవతలు, ఋషులు, గంధర్వులు ఆ దేవిని అనేక విధాల కొనియాడారు.

# 12. చాముండ

పూర్వకాలంలో శుంభ నిశుంభులనే రాక్షసులు బ్రహ్మను గూర్చి కొన్ని వేల సంవత్సరాలు తపస్సు చేసి స్త్రీతో తప్ప ఇంకే ప్రాణిచేతా చావు లేకుండా వరం పొందారు. వరబలంతో లోకాలన్నీ జయించి ప్రజలను, సాధుపుంగవులను అనేక రకాలుగా బాధిస్తున్నారు. అప్పుడు దేవతలను రక్షించటానికి అంబిక సింహవాహనమెక్కి, శుంభుని పట్టణానికి వెళ్ళి, నగరంవెలుపల ఉన్న ఉద్యానవనంలో ఆగింది. ఆవనంలో అంబిక తిరుగుతూ మధురమైన స్వరంతో పాట పాడుతోంది.

శుంభునికి చండుడు, ముండుడు, ధూమ్రాక్షుడు, రక్తబీజుడు అనేవారు సేనాపతులు. చండముండులు ఆవనంలో తిరుగుతూ పరమేశ్వరి పాటవిని పరవశించి తిన్నగా తమరాజైన శుంభుని వద్దకు పోయి దేవి యొక్క అందచందాలు వర్ణించి, ఆమెను చేపట్టి సుఖ సంతోషాలతో కాలం వెళ్ళ బుచ్చమని సలహా ఇచ్చారు. వెంటనే రాక్ష రాజైన శుంభుడు ధూమలోచనుణ్ణి పంపి పరమేశ్వరిని తీసుకు రమన్నాడు. ధూమ్రలోచనడు వెళ్ళిన కొంత సేపటికే అతని అనుచరులు తిరిగి వచ్చి దేవి చేతిలో ధూమ్రలోచనుడు మరణించాడని చెప్పారు. ఆమాట విని కుపితుడై చండముండులను చూసి "ఓ రాక్షస శ్రేష్ఠులారా! మీరు సైన్య సమేతులై పోయి ఆమెను జుట్టు పట్టుకుని ఈడ్చిగాని, బంధించిగాని తీసుకురండి." అని ఆజ్ఞాపించాడు.

అక్కడి సింహవాహనంపై ఉన్న ఆ దేవిని చూసి చండుడు " ఓలలనా! రాక్షస రాజైన శుంభుని వివాహమాడి స్వర్గ సుఖాలనుభవించు. మారాజు మంచి శౌర్య పరాక్రమాలు కలవాడు. అతనితో పోరు తగదు. నీమేలు కోరి చెబుతున్నాను." అన్నాడు. దానికి ఆ పరమేశ్వరి మండిపడి "నేను మీరాజును వరించటమేమిటి? చేతనైతే కత్తి పట్టి యుద్ధం చెయ్యి" అంది.

దేవి నోటినుండి ఆమాట వచ్చినదే తడవుగా రాక్షససేనలు ప్రచండ వేగంతో కత్తులు దూసి ఆమె మీదకురికారు. ఆదృశ్యం చూసి దేవి ముఖం నల్ల బడింది. భయంకరమైన ఆ ముఖమునుంచి ఘోరమైన ముఖముతో, ఖడ్గము, పాశము ధరించి, విచిత్రమైన పుర్రెలబెత్తము చేత పట్టుకుని పుర్రెలమాల మెడలో ధరించి పెద్దపులి చర్మముకట్టుకుని కృశించి పోయిన కండలు, లోతుకు పోయిన ఎర్రని కనులు, తెరచి ఉన్న నోరు, వేలాడు తున్న నాలుకతో భయంకరాకారము గల కాళికాశక్తి ఉద్భవించింది. ఆ శక్తి దిక్కులు పిక్కటిల్లే లాగా భీకర గర్జనలు చేస్తూ రాక్షససేనను తినెయ్యటం మొదలు పెట్టింది. ఏనుగులు, గుర్రాలు, వాటి పై స్వారీ చేసేవారు, రథాలు మొదలైన వాటన్నింటినీ చేత్తో పట్టుకుని నోట్లో వేసుకోవటం మొదలు పెట్టింది.

ఈరకంగా అందిన వాళ్ళని అందినట్లు తినేస్తు, మిగిలిన వాళ్ళని కాళ్ళతో త్రొక్కివేస్తూ, చేతులతో మర్దన చేస్తూ, రాక్షస సేనను నాశనం చేస్తోంది. ఈ దృశ్యం చూసిన, చండుడు తీవ్రమైన కోపంతో ఖడ్గపాణియై కాళి మీదకు దూకాడు. వారిద్దరి మధ్యా భయంకరమైన యుద్ధం జరిగింది. చివరకు కాళి ఒక్క వేటుతో చండునితల నరికి వేసింది. అది చూసిన ముండుడు ధైర్యంగా ఆ శక్తిని ఎదిరించాడు. కాని ఆ శక్తి యొక్క కత్తి వేటుకు ముండుడు కూడా బలి అయ్యాడు.

అప్పుడు కాళి చండముండుల శిరస్సులను తన చేతులతో పట్టుకుని అంబిక దగ్గరకు పోగా, ఆపరమేశ్వరి "నీవు చండముండులను చంపి వారి శిరస్సులను నాదగ్గరకు తెచ్చావు కాబట్టి ఇకమీదట లోకంలో చాముండ అనే పేరుతో ప్రసిద్ధి చెందుతావు" అని దీవించింది.

ఆ రకంగా ఉద్భవించిన చాముండ సాధకుల కోర్కెలు తీరుస్తూ వారి శత్రు సంహారం చేస్తున్నది.



# 13. రక్తబీజుడు

రంభుడు మరణించిన తరువాత అతని భార్య రంభుడికి అగ్నికార్యములు చేసితను కూడా చితిలో దూకింది. అప్పుడు ఆచితి లోనుంచి రౌద్రాకారు డైన పురుషుడు ఒకడు బయటకు వచ్చాడు. అతడే రక్త బీజుడు. రంభుడే రక్త బీజుడుగా జన్మించాడు. ఇతడు బ్రహ్మనుగురించి ఘోరమైన తపస్సు చేసి తనశరీరం నుంచి నేలమీద పడిన ప్రతి రక్తపుబిందువు నుంచి తనతో సమానమైన బలంకల రాక్షసుడు ఒకడుపుట్టేటట్టుగా వరంపొందాడు. ఆతరువాత కాలంలో శుంభనిశుంభులకు ఇతడు సేనాపతి అయ్యాడు,

పరమేశ్వరి చండముండులను సంహరించిందనేవిషయం తెలిసి శుంభుడు రక్తబీజుణ్ణి పిలిచి "సేనాసమేతుడవైవెళ్ళి దాన్ని బంధించుకునిరా' అన్నాడు

రక్తబీజుడు సేనాసమేతుడై దేవి వద్దకువెళ్ళి "దేవీ' నీవు అపురూప సౌందర్యరాశివి, నీకు మా రాజైన శుంభుడే సరి అయినవాడు. కాబట్టి అతణ్ణిచేపట్టి సుఖించు అన్నాడు. దానికి పరమేశ్వరి"ఇంతమంది చచ్చినా మీరాజుకు బుద్ధిరాలేదు అతనువట్టి మూర్ఖుడు. నిన్నుకూడా ఇప్పుడే యమపురికి పంపుతాను" అన్నది.

దానితో కోపగించిన రక్తబీజుని సేన దేవిని చుట్టుముట్టింది, దేవికి సహాయంగా సప్తమాతృకలు వచ్చారు.రక్తబీజుడు ఇంద్రాణితో యుద్ధంచేశాడు. ఆమెవజ్రాయుధంతో అతణ్ణి కొట్టింది. ఆదెబ్బకు అతని శరీరం నుంచి రక్తం కారింది. అంతే ఆరక్తపు బిందువులనుంచి రక్తబీజునితో సమానమైన పరాక్రమం గలవారు కొంతమంది రాక్షసులు ఉద్భవించారు. అలా పుట్టిన రాక్షసులు కూడా సప్తమాతృకలతో వెనకడుగు వేయకుండా యుద్ధం చేస్తున్నారు. ఇంతలో వైష్ణవి తన చక్రాయుధంతో ఆరాక్షసుణ్ణి కొట్టింది. "ఇంకేముంది? ఆరక్తంనుంచి మళ్ళీమరి కొంతమంది రక్తబీజులు పుట్టారు. ఈరకంగా పుట్టిన అతి భయంకరులైన రాక్షసులను చూసి దేవతలు భయభ్రాంతులైనారు.

అప్పుడు పరమేశ్వరి కాళిని చూసి "ఓదేవీ! నీనోటిని విశాలంగా పెంచు. రక్తబీజుని శరీరంనుంచి ఒకబొట్టు రక్తం కూడా కిందపడకుండా తాగెయ్యి. అతని వల్ల పుట్టిన రాక్షసులను మ్రింగేసెయ్యి. ఈరకంగా చెయ్యటంవల్ల శరీరంలోని రక్తం చాలా వరకు పోయి అతడు శక్తి హీనుడై తనకుతానుగా చచ్చిపోతాడు. అతని రక్తంనుంచి కొత్తవారు పుట్టరు. అంతకన్నా వేరే మార్గంలేదు" అన్నది. కాళి అలానే చేసింది.

పరమేశ్వరి రక్తబీజుణ్ణి తన శూలంతో పొడిచింది. అతని శరీరం నుంచి బయటకు వచ్చిన రక్తాన్ని కాళి తాగివేసింది. దేవి పలురకాల ఆయుధాలతో ఆరాక్షసుణ్ణి గాయపరిచింది. దానివల్ల అతను గాయపడటం, ఆగాయాలనుంచి రక్తం కారటం, ఆరక్తాన్ని కాళి త్రాగి వేయటం తృటిలో జరిగిపోయినాయి.

ఈరకంగా రక్తబీజుడు బాగా గాయపడ్డాడు. అతని శరీరంనుంచి బాగా రక్తం పోయింది. చివరకు రక్తబీజుడు రక్తహీనుడై చనిపోయాడు. రక్తబీజుని మరణ వార్తవిని దేవతలు మిక్కిలి సంతోషం పొందారు. సప్తమాతృకలు రక్తపానము చేసి రక్తబీజుని వధ కారణంగా ఆనందంతో నృత్యం చేశారు.

# 14. శుంభనిశుంభులు

పూర్వకాలంలో పాతాళ లోకంలో ఉండే రాక్షసులలో శుంభ నిశుంభులు అనే ఇద్దరు ఉద్దండులుండేవారు. వాళ్ళు బ్రహ్మదేవుని గూర్చి గతంలో ఎవ్వరూ చెయ్యనంత ఘోరమైన తపస్సు చేశారు. వారి కఠోర మైన నియమాలకూ, తపస్సుకూ మెచ్చి బ్రహ్మ ఏంవరం కావాలో కోరుకోండి అన్నాడు. అందరు రాక్షసుల లాగానే వారు కూడా చావులేకుండా వరం కావాలి అన్నారు.

“ ఈ ప్రపంచంలో మరణం లేకుండా ఏప్రాణీ ఉండదు. పుట్టిన ప్రతిప్రాణీ మరణించి తీరాల్సిందే. ఇది సృష్టి ధర్మము. దానికి విరుద్ధంగా నేను ఆవరం ఇవ్వలేను. అయినా బ్రహ్మకల్పం పూర్తి కాగానే నేను కూడా వెళ్ళి పోవలసినదే. అందుచేత మీరు శాశ్వతంగా ఉండే వరం ఇవ్వటానికి లేదు. మరి ఇంకేదైనా కోరుకోండి” అన్నాడు బ్రహ్మ. ఆలోచించారు రాక్షసులు. లోకంలో బలహీనురాలు, ఏమీచేతకానిది ఆడది. కాబట్టి స్త్రీ వల్ల తప్ప మరి ఏ ఇతరప్రాణి వల్ల మరణం రాకుండా వరమివ్వమన్నారు. తథాస్తు అన్నాడు విధాత.

ఈ రకంగా వరం పొందిన రాక్షస సోదరులు భృగువును పురోహితునిగా, చండుడు, ముండుడు, ధూమ్రాక్షుడు, రక్తబీజులను సైన్యాధ్యక్షులుగా నియమించుచున్నారు. ఆసోదరులలో పెద్దవాడయిన శుంభుడు రాజయ్యాడు. నిశంభుడు మంత్రి అయ్యాడు.

ఈ రకంగా రాజ్యస్థాపన చేసిన తరువాత గతంలో దేవతల దెబ్బకి చావగామిగిలి, పారిపోయి తలదాచుకున్న రాక్షసులంతా వచ్చి శుంభుని పక్షాన చేరారు. కొంతకాలానికి శుంభుడు జైత్ర యాత్ర మొదలు పెట్టాడు. భూలోకంలోని రాజులందర్నీ కూడా ఓడించి పాదా క్రాంతుల్ని చేసుకున్నాడు. యజ్ఞయాగాలలో దేవతలకు హవిర్భాగం ఇవ్వకుండా చేశాడు. కాదన్న వారిని చిత్రహింసలకు గురిచేశాడు. ఇంతెందుకు ఎల్లఎడలవారు రాక్షస ప్రవృత్తి ప్రసరింపచేశారు.

ఒకనాడు నిశుంభుడు కొంత సైన్యముతో బయలుదేరి దేవలోకానికి వెళ్ళి ఇంద్రుణ్ణి యుద్ధానికి పిలిచాడు. ఇంద్రుడు కోపోద్రిక్తుడై వచ్చి తన వజ్రాయుధంతో నిశుంభుని తలపై కొట్టాడు. ఈవార్త తెలిసిన శుంభుడు పరిగెత్తుకుంటూవచ్చి ఇంద్రుణ్ణి, దేవతలను చావబాదాడు. వారంతా దెబ్బలు తిని కదలలేని పరిస్థితిలో ప్రాణాలు దక్కించుకుని పారిపోయారు. ఆ తరువాత శుంభుడు దిక్పాలకులను కూడా వెళ్ళగొట్టి మూడు లోకాలు ఆక్రమించేశాడు. ఇది కాలప్రభావం దేవతలైనాసరే! కాలపురుషునికి తలవగ్గవలసినదేకదా! భూలోకంలో వంద యజ్ఞాలు చేస్తే కాని ఇంద్రపదవిరాదు. ఆరకంగా వంద యజ్ఞాలు పూర్తి చేసిన సురాధిపతి, రాక్షసులతాకిడికి తట్టుకోలేక [illegible]

అడవులూ, కొండలు పట్టు కుని తిరుగుతున్నదేవతలందరూ కొంత కాలానికి ఒక చోటికి చేరారు. వారందరూ కలిసి దేవగురువైన బృహస్పతి దగ్గరకు పోయి తమకు తరుణోపాయం చూపమని వేడుకున్నారు. అప్పుడు బృహస్పతి "దేవేంద్రా! గతంలో మీకిలాంటి కష్టాలు వచ్చినప్పుడు మిమ్మల్ని రక్షించింది ఆపరమేశ్వరి. మీకు ఎప్పుడు ఏకష్టం వచ్చినా మిమ్మల్ని రక్షిస్తానని చెప్పింది. కాబట్టి ఆమెనే ప్రార్థించండి." అన్నాడు. దేవతలంతా పరమేశ్వరిని ప్రార్థించటం మొదలు పెట్టారు.

"నమో దేవ్యై మహాదేవ్యై శివాయై సతతం నమః
నమః ప్రకృత్యై భద్రాయై నియతాః ప్రణతాః స్మ తామ్"

మహాదేవి అయిన దేవికి నమస్కారము. నిత్య శుభంకరి అయిన ఆమెకు ఎల్లప్పుడూ నమస్కారము.

యా దేవీ సర్వభూతేషు నిద్రారూపేణ సంస్థితా
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః॥
యా దేవీ సర్వభూతేషు క్షుధారూపేణ సంస్థితా
నమస్త స్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః

సర్వ భూతములందు నిద్రారూపమైఉండు ఓదేవీ నీకు నమస్కారము.
సర్వభూతములందు ఆకలి రూపముననున్న ఓదేవి నీకు ప్రణామములు.

ఆపరమేశ్వరి వారికి ప్రత్యక్షమై "దేవతలారా! విచారించకండి. శుంభ నిశుంభులకు కాలం ఆసన్నమైంది. అని తాను సింహ వాహనయై శుంభుని పురానికి చేరి అక్కడ ఉద్యానవనంలో విహరించసాగింది.

ఆ ఉద్యానవనంలో వాహ్యాళికి వచ్చిన శుంభుని సేనాపతులయిన చండ ముండులు ఆదేవి సౌందర్యానికి ముగ్ధులై తమ రాజు వద్దకు పోయి అతిలోక సౌందర్యవతి అయిన ఆమెను చేపట్టి సుఖించమని అతడికి సలహా ఇచ్చారు. 'ప్రభూ! నువ్వు మూడులోకాలు జయించావు. ఆలోకాలలో ప్రసిద్ధమైన ఇంద్రుని ఐరావతము, ఉచ్ఛైశ్రవము, పారిజాతము, పుష్పకవిమానము మొదలైనవన్నీ నీదగ్గరే ఉన్నాయి. అట్లాగే అపురూప సౌందర్యరాశి అయిన ఆస్త్రీరత్నముకుడా నీదగ్గరే ఉండ తగింది. కాబట్టి వెంటనే ఆమెను చేపట్టు అన్నారు.

ఆ మాటలకు శుంభుడు మహదానందం పొంది. ధూమ్రలోచనుణ్ణి పిలిచి ఆ స్త్రీని సగౌరవంగా తీసుకుని రా' అన్నాడు. ససైన్యంగ వెళ్ళాడు. ధూమ్రలోచనుడు. దేవికి నమస్కరించి "ఓచారులోచనా! నీవు ముల్లోకాలకూ అందగత్తెవు. మామహారాజు శుంభుడు. అతడు ముల్లోకాలనూ జయించాడు. అతడిని మించిన వీరుడు లేడు కాబట్టి నువు ఆయనను వివాహమాడి నట్లైతే పూవుకు తావి అబ్బినట్లుఉంటుంది. ఆలోచించి అతడిని

వివాహమాడవలసింది'' అన్నాడు. దానికి దేవి "నువ్వు నిజమేచెప్పావు. మీరాజు అంత గొప్ప వాడు, వీరుడు, శూరుడు అని నేనూ విన్నాను. అతని తమ్ముడైన నిశుంభుడు కూడా అంతటి పరాక్రమవంతుడే. కాని నేను ఏ నిర్ణయమూ తీసుకోలేను. అశక్తు రాలిని ఎందుకంటే నా చిన్న తనంలో, తెలియని వయస్సులో నన్ను యుద్ధంలో ఓడించిన వాడినే వివాహమాడతాను. అనిప్రతిన చేశాను. కాబట్టి మీరాజు వచ్చి నన్ను ఓడించి నట్లైతే నేను అతడికి భార్యనౌతాను'' అన్నది.

అది విన్న ధూమ్రలోచనుడు కోపగించి "మాప్రభువు పరాక్రమం నీకు తెలియదు. అతనితో యుద్ధం అంటే కోరి మృత్యువును ఆహ్వానించినట్లే. ఇంద్రాది దేవతలుకూడా అతని ముందు నిలవలేక అడవుల పాలైనారు. ఆడదానివి అబలవు. నువ్వెంత? మారు మాటాడకుండా మా ప్రభువు దగ్గరకురా! అలాగనక రాకపోతే నిన్ను బలాత్కారంగా జుట్టుపట్టి ఈడ్చుకుని వెళ్ళవలసి వస్తుంది.'' అని ఆమె వైపుకు నడుపసాగాడు. అప్పుడు ఒక్క హుంకారముతో ధూమ్రలోచనుణ్ణి, అతడి సైన్యాన్ని భస్మంచేసి వేసింది. చావగా మిగిలిన వాళ్ళు తమ ఏలిక వద్దకు పోయి జరిగిన విషయం యావత్తూ వివరించారు.

జరిగింది యావత్తూ విన్నాడు శుంభుడు ఒక్క ఆడదానికి ఇంతపరాక్రమమా! అని ఆశ్చర్యపోయాడు. ధూమ్రలోచనుడు మరణించినందుకు విచారించి కోపోద్రిక్తుడై తన సైన్యాధ్యక్షులైన చండముండులను పిలిచి "సేనాపతులారా! మీరు ఆమె ఉన్న చోటికి సైన్యసమేతులై వెళ్ళండి. ఆమెను బంధించి ఈడ్చుకురండి. అదుష్టురాలిని గాయపరచండి. ఆ సింహాన్ని చంపండి. ఆ అంబికను బంధించితెండి. పొండి'' అన్నాడు.

శుంభుని ఆజ్ఞమేరకు చండముండులు చతురంగబలసమేతులై వెళ్ళి ఆ పరమేశ్వరి తో యుద్ధంచేసి మరణించారు. ఆ వార్త విన్న శుంభుడు కుపితుడై అసుర సైన్యాలను సమాయత్తంచెయ్యటం మొదలు పెట్టాడు. ముందుగా మహావీరులైన 'కంబులు' అను ఒక జాతికి చెందిని ఎనభైనలుగురు రాక్షసులను వారి వారి బలాలతో నిలిపాడు. ఆతరువాత 'కోటి వీర్యాంసుర' కుటుంబాలకు చెందిన యాభై మంది వీరులను, 'ధౌమ్ర' కుటుంబాలకు చెందిన నూరుమందిని, అదేవిధంగా కాలక, మౌర్య, దౌర్హృ, కాలకేయకుటుంబాలకు చెందిన అరివీర భయంకరులైన రాక్షసవీరుల నందరినీ యుద్ధానికి సన్నద్ధంచేసి, తనుకూడా నిశుంభునితో కలిసి, స్వసైన్యంగ ఆ పరమేశ్వరిపై యుద్ధానికి బయలు దేరాడు.

ఉప్పెనలాగా అతి భయంకరంగా వస్తున్న అసుర సైన్యాన్ని చూసి పరమేశ్వరి ధనుష్టంకారం చేసింది. దేవి వాహన మైన సింహం జూలు విదిల్చి మహానాదం చేసింది. దేవిచేతిలోని ఘంట గణగణమ్రోగింది. యుద్ధానికి సిద్ధము అనే సూచనగా కాళి తననోటిని పూర్తిగా తెరిచి పెద్ద పెట్టున హుంకరించింది. భూనభోంతరాళాలు దద్దరిల్లాయి. సముద్రకెరటాలు ఉవ్వెత్తునలేచాయి. కొండగుహలలో నిద్రస్తున్న క్రూరజంతువులు కూడా ఏదో ఆపదముంచుకు వస్తున్నదని భయపడి కనిపించని దిక్కుగా పరుగులు తీశాయి. రాక్షసేంద్రుడికి ఎడమకన్ను, ఎడమ భుజము అదిరినాయి. ఆ శుభముహూర్తం కోసం పొంచి ఉన్న దేవతలందరూ తమతమ ఆయుధాలతో వచ్చి దేవి ప్రక్కన

నుంచున్నారు. బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు, కుమారస్వామి, వరహావతారుడు, ఇంద్రుడు, చండికలయొక్క శక్తులు అన్నీ దేవి సరసన నిలిచాయి. వాటినే సప్త మాతృకలు అంటారు. అవి.

1. బ్రాహ్మి
2. మహేశ్వరి
3. కౌమారి
4. వైష్ణవి
5. వారాహి
6. మాహేంద్రి
7. చాముండ (కాళి)

ఆశక్తి ఏ దేవుని రూపమో, ఆభూషణములు, ఆయుధములు ధరించి, అతని వాహనము ఎక్కివచ్చినాయి.

హంస వాహనం మీద అక్షమాలా కమండలం ధరించి బ్రహ్మాణి వచ్చింది. ఎద్దునెక్కి, త్రిశూలంతో మహేశ్వరి, శక్తి ఆయుధంతో నెమలి వాహనాన్ని ఎక్కి కౌమారి, చక్రాయుధం ధరించి గ్రద్దనెక్కి వైష్ణవి, వజ్రాయుధం ధరించి మాహేంద్రి అదేవిధంగా వారాహి, నారసింహి వచ్చారు. పరమేశ్వరుడు ' నాప్రీతి కొరకు అసురులు నీచే చంపబడుదురుగాక' అని పరమేశ్వరిని ఆశీర్వదించాడు.

ఆ సమయంలోనే దేవి శరీరం నుంచి నల్లని శరీరము, ఎర్రని కనులు, కోరలు కలిగి లోతైన పొట్టతో అత్యంత భయంకరమైన రూపముతో కొన్ని వందల నక్కలు ఒక్కసారిగా అరుస్తునట్టుగా అరుస్తూ 'చండిక' అనే శక్తి ఉద్భవించింది.

పరమేశ్వరి శివునితో "ప్రభూ! నీవు శుంభ నిశుంభుల దగ్గరకు నాదూతగా వెళ్ళి, వారు జీవించదలచుకున్నట్లైతే యజ్ఞయాగాదులలో దేవతలకు హవిర్భాగము ఇచ్చి, వారి రాజ్యము వారి కిచ్చి పాతాళమునకు పొమ్మను, లేక బల గర్వముతో యుద్ధము చేయదలచుకున్నట్లైతే వారికి మరణము తథ్యము అని చెప్పి రావలసినది' అన్నది. ఈ రకంగా శివుని దూతగా పంపింది. కాబట్టే శివదూతి అని ఆమెకు పేరు వచ్చింది.

శివుని దౌత్యము లక్ష్యపెట్టక ఆరాక్షసులు పరమేశ్వరితో యుద్ధానికి తలపడ్డారు. ఆయుద్ధంలో శుంభ నిశుంభులకు ఎటుచూసినా సప్తమాతృకలే కనిపిస్తున్నారు. బ్రాహ్మి శత్రువులపై మంత్రజలంచల్లుతూ వారిని ధైర్య శౌర్యహీనులుగా చేస్తున్నది. మహేశ్వరి శూలంతోను, వైష్ణవి చక్రంతోను రాక్షస సంహారం చేస్తున్నారు.

మాహేంద్రి వజ్రాయుధంతో వారాహితన కోరల తోను, నారసింహి తన గోళ్ళతో నూ రాక్షసులను దారుణంగా సంహరిస్తున్నారు. కాళి భయంకరంగా అట్టహాసం చేస్తూ, విశాల మైన నోరు తెరిచి రాక్షసులను మ్రింగివేస్తోంది. ఈ రకంగా భయంకరమైన యుద్ధం సాగుతోంది. రాక్షస వీరులు లెక్కకుమిక్కిలిగా చస్తున్నారు.

అది చూసిన శుంభుని సేనాపతి రక్త బీజుడు పరమేశ్వరితో యుద్ధానికి వచ్చాడు. అతని శరీరంలోని రక్తం మొత్తం పీల్చి వేసి అతణ్ణి సంహరించింది పరమేశ్వరి.

రక్తబీజ వధ విని శుంభ నిశుంభులు ఆగ్రహోదగ్రులైనారు. అప్పుడు శుంభుని తమ్ముడైన నిశుంభుడు కొంతమంది మహావీరులైన రాక్షసుల=లతో కలిసి పరమేశ్వరి

మీదికియుద్ధానికి వెళ్ళాడు. వారిద్దరికీ భీకర సంగ్రామం జరిగింది ఆయుద్ధంలో రాక్షసులను, వారి ఏనుగులను సింహం చీల్చి చెండాడింది. సప్తమాతృకలు తమతమ ఆయుధాలతో రాక్షస సంహారము చేశాయి. కాళి, చండి శత్రుభక్షణ చేశారు. అది చూసి కుపితుడైన శుంభుడు ఒక శూలంతీసుకుని దేవి పైన యుద్ధానికి వెళ్ళాడు. అప్పుడు ఆపరమేశ్వరి ఆమెచేతిలోని త్రిశూలంతో నిశుంభుణ్ణి సంహరించింది. ఆ దృశ్యం చూసిన అసురులు యుద్ధ భూమినుండి పారి పోయారు.

నిశుంభుని మరణం కళ్ళారాచూసిన శుంభుడు దేవితో " ఓదుర్గా! నీ బలగర్వమునాదగ్గర చూపకు. ఇతరులపై ఆధారపడియుద్ధం చేసే నీవుకూడా గొప్ప దానివేనా? అన్నాడు. దానికి ఆ పరమేశ్వరి " ఓ మూర్ఖుడా! ఈ లోకంలోనేను ఒంటరి దానను. ఏకాకిని నాకెవ్వరూలేరు చూడు ' అనగానే మాతృకలు మొదలైనశక్తులన్నీ ఆమెలో ప్రవేశించి అంతర్ధానమైపోయి నాయి. పరమేశ్వరి ఒక్కతే కనిపిస్తోంది.

అప్పుడు ఆ పరమేశ్వరికీ, శుంభుడికీ మధ్య భీకర పోరాటం జరిగింది. శుంభుడు రాక్షసాస్త్రాలు ప్రయోగించగా దివ్యాస్త్రాలతో దేవి వాటిని నాశనం చేసింది. బాణాలతో అతని కత్తి విరగ్గొట్టింది. డాలు నాశనం చేసింది గుర్రాలను చంపింది. విల్లు విరగ్గొట్టింది. సారథిని చంపి రథాన్ని కూల్చి వేసింది. అది చూసి కోపించన శుంభుడు పరమేశ్వరిని పట్టుకుని ఆకాశంలోకి ఎగిరిపోయాడు. అక్కడవారిద్దరికీ బాహా బాహి యుద్ధం జరిగింది. చివరకు దేవి అతణ్ణి నేలమీదకు విసిరి వేసి శూలంతో పొడిచి సంహరించింది

ఈ రకంగా శుంభ నిశుంభులు తమ కోరిక ప్రకారము స్త్రీ చేతిలోనే హతులైనారు. లోకాలకు పట్టిన పీడ వదిలి పోయింది. దేవగణాలు పుష్పవృష్టికురిపించాయి. గంధర్వులు గానంచేశారు. అప్సరలు నాట్యం చేశారు. సూర్యుడు పూర్ణతే స్సుతో వెలిగాడు. లోకాలన్నీ సుఖించాయి.

దేవతలు, యక్షులు, కిన్నెరులు, కింపురుషులు, సిద్ధులు, మహర్షులు పరమేశ్వరిని పరిపరివిధాల కీర్తించారు.

సృష్టిస్థితి వినాశానాం శక్తి భూతే సనాతిని।
గుణాశ్రయే గుణమయే నారాయణి నమోస్తుతే॥
శరణాగత దీనార్త పరిత్రాణపరాయణే।
సర్వస్యార్తి హరే దేవి నారాయణి నమోస్తుతే।
హంసయుక్త విమానస్థే బ్రహ్మాణీరూపధారిణీ।
కౌశామ్భః క్షరికే దేవి నారాయణిన మోస్తుతే॥

సృష్టి స్థితి లయాలకు కారణమైన దానవు, గుణములకు నిలయమైన ఓదేవీ నీకు నమస్కారము.

శరణన్న అభాగ్యులను దుఃఖితులను రక్షించి అందరి కష్టములు నశింప చేసే ఓదేవి నీకు నమస్కారము.

బ్రాహ్మి రూపంధరించి హంస విమానం మీద కూచుని మంత్రపూరితజలం జల్లు ఓదేవి నీకు నమస్కారములు. ఆరకంగా పరమేశ్వరి దయవల్ల శుంభులు మరణించారు.

---

# 15 సురథుడు - సమాధి

కల్పము అంటే 42,33,60,000 సంవత్సరాలు. ఒక కల్పానికి 14 మన్వంతరాలుంటాయి. కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగము అని యుగాలు నాలుగు. ఈ మొత్తం కలిస్తే ఒక మహాయుగము. అటువంటి ఏడు మహాయుగాలు ఒక మన్వంతరం. అంటే 3,02,40,000 సంవత్సరాలు. ఒక్కొక్క మనువు పాలించే కాలాన్ని మన్వంతరం అంటారు. మొత్తం 14 మంది మనువులు అంటే 14 మన్వంతరాలు.

సూర్యుని భార్య సువర్ణకు పుట్టినవాడు సావర్ణి. రెండవ మన్వంతరములో స్వారోచిషుడు మనువు. స్వారోచిష మన్వంతరములో సావర్ణి సురథుడు అను పేరుగల రాజుగా చైత్ర వంశంలో పుట్టాడు. ఇతడు భూమండలం అంతటినీ పాలిస్తున్నాడు. ఇతడు మంచి రాజు. సత్యవ్రతము, దానగుణము, భూతదయ. చదువు, విజ్ఞానము, పాండిత్యము, శౌర్యము, సాహసము కలవాడు. ఏకపత్నీ వ్రతుడు. గురుభక్తి, దైవభక్తి కలవాడు. మంచివాడు. లోకంలోని ప్రజలందరూ తనలాగే మంచి హృదయంతో ఉంటారనుకునే వాడు. ప్రజలను కన్నబిడ్డల వలె పాలిస్తున్నాడు.

ఒకనాడు సురథుడి రాజ్యానికి దూరంగా తిన్న కోలలు అనే ఒక ఆటవిక జాతి వారు ఇతని పైకి దండెత్తి వచ్చారు. ఈ యుద్ధానికి కారణం ఏమీలేదు. వారు ఎందుకు యుద్ధానికి వచ్చారో తెలియదు. సురథుడి సైన్యంకూడా సరిగా లేదు. మంత్రులు, సేనానులు చూస్తూ ఊరుకున్నారే కాని నడుంకట్టి యుద్ధానికి సన్నద్ధం కాలేదు. సురథుడు తన సైన్యంతో కోలల మీద తిరగబడ్డాడు. కాని ఫలితం లేకపోయింది. కోలలు తక్కువ మంది అయినప్పటికీ సురథుని సేన వారిని హతమార్చలేకపోయింది. ఫలితంగా సురథుడు ఓడిపోయాడు.

ఓడిపోయిన రాజుయొక్క ధనాగారాన్ని అతని మంత్రులు, సేనాపతులు కొల్లగొట్టారు. రాజ్యం పోయింది, ధనం పోయింది. గౌరవం లేదు. ఇంక అక్కడ ఉండలేక సురథుడు గుర్రం ఎక్కి వేట పేరుతో అడవిలోకి ఒంటరిగా వెళ్ళిపోయాడు. ఆవిధంగా అడవిలో కొంత దూరంపోగా బ్రాహ్మణ శ్రేష్ఠుడైన 'మేధసుడు' అను మహర్షి ఆశ్రమం కనిపించింది. ఆ ఆశ్రమం ప్రశాంత వాతావరణంలో ఉంది. అందులో మృగాలు నిర్భయంగా తిరుగుతున్నాయి. మహర్షి శిష్యులు వేదాలు వల్లిస్తున్నారు. ఆ ఆశ్రమ ప్రాంగణంలోకి వెళ్ళాడు రాజు. మహర్షి రాజును సాదరంగా ఆహ్వానించి అతిథి సత్కారాలు చేశాడు. ఆశ్రమంలోనే కాలం గడుపుతున్నాడు సురథుడు. కొంతకాలం గడిచింది.

ఒకరోజు సురథుడు గతాన్ని గుర్తు తెచ్చుకుని ఈవిధంగా విచారించసాగాడు.

నాపూర్వీకుల దగ్గరనుంచీ ధర్మాన్ని రక్షిస్తూ ఏలబడిన నాసామ్రాజ్యము ఇప్పుడు ఎలా ఉన్నదోగదా? దుర్మార్గులైన నాఉద్యోగులు దర్మాన్ని రక్షిస్తున్నారా? యుద్ధనైపుణ్యం గల నాపట్టపు ఏనుగు ఇపుడు ఎన్ని ఇబ్బందులు పడుతున్నదో? నేను కష్టపడి కూడబెట్టిన ధనమంతా శత్రువులు లాగేసుకుని ఉంటారు. రాజ్యంలోని ప్రజలు ఏవిధంగా ఇబ్బందులు పడుతున్నారో కదా?

ఈవిధంగా ఆలోచిస్తున్న సురధుడికి ఆశ్రమం దాపున ఒక వైశ్యుడు కనిపించాడు. అతడు చాలా విచారంగా ఉన్నట్లు కనిపిస్తున్నాడు. అతణ్ణి చూసి సురధుడు నీ విచారానికి కారణం ఏమిటి? అని అడిగాడు.

దానికి వైశ్యుడు "నాపేరు సమాధి. నేను వైశ్యుడిని చాలా ధనవంతుణ్ణి. డబ్బు మీద ఆశతో నాభార్య పుత్రులు నాడబ్బు లాక్కుని, నన్ను ఒంటరిని చేసి ఇంటినుండి తరిమివేశారు. ఈ విధంగా భార్యా, పిల్లలు, డబ్బు, బంధువులు అందరూ దూరమై పోయారు. ఇప్పుడు నావారి క్షేమసమాచారము ఏమీ నాకు తెలియటం లేదు. ఇంటిదగ్గర వాళ్ళు క్షేమంగాఉన్నారో? ఇబ్బందులు పడుతున్నారో? కుమారులు మంచిగా నడచుకుంటున్నారా? బుద్ధిగా ఉన్నారా? లేదా ? అని ఆలోచిస్తున్నాను. అవి తలచుకుంటే నాకు దుఃఖము పొంగుకువస్తోంది." అన్నాడు.

ఆమటాలు విన్న రాజు "ఓ వైశ్య శ్రేష్ఠా! నీధనం అపహరించికదా వారు నిన్ను వెళ్ళగొట్టారు. మరివారి గురించి ఎందుకు ఆలోచిస్తున్నావు?" అన్నాడు. దానికి వైశ్యుడు రాజా! నేను కూడా అలాగే అనుకున్నాను. కానీ ఏంచెయ్యను. ఎంతప్రన్నా నామనసు అటే పీకుతోంది. వాళ్ళను గురించి ఆలోచించ కుండా ఉండలేకపోతున్నాను. ఇది తప్పు అని తెలిసి కూడా ఏమీ చెయ్యలేక పోతున్నాను. రాజా! వారు దుర్మార్గులే అయినప్పటికీ వారి మీదే మనసున్నది. ఏం చెయ్యమంటావు." అన్నాడు.

అప్పుడు వారిద్దరూ మహర్షి దగ్గరకు వచ్చి నమస్కరించి ఈ విధంగా అన్నారు.' ' మహర్షీ! నేను రాజ్యం పోగొట్టు కున్నాను. కాని నామనసు ఆ రాజ్యము, అక్కడి పరివారము మీదనే లగ్నమై ఉన్నది. ఇతణ్ణి భార్యా పుత్రులు తరిమి వేశారు. కాని ఇతడి మనసు వారిని గురించే ఆలోచిస్తోంది. దీనికి కారణం ఏమిటి? అదివిని మహర్షి దేవీ తత్వాన్ని గురించి వారికి వివరించటం ప్రారంభించాడు.

ఇంద్రియాలకు సంబంధించిన జ్ఞానము ప్రాణులన్నింటికీ ఉంటుంది. కొన్ని ప్రాణులు పగటిపూట కొన్ని రాత్రిపూట చూడగలవు. మరి కొన్ని ప్రాణులు రాత్రిం బవళ్ళూ చూడగలవు. మానవులకున్న జ్ఞానము పశు, పక్షి, మృగాలకు కూడా ఉన్నది. ఆహారము నిద్ర అనేవి అన్నిటికీ సమానమే. పక్షులు తమ పిల్లలకు ఆహారం పెట్టి పోషిస్తున్నాయి. ఇందులో స్వార్థం లేదు. కాని మానవులు తమ పిల్లల్ని పెంచటంలో స్వార్థం కూడా ఉంది.

వీళ్ళు ఆ పరమేశ్వరి యొక్క మాయ వలన సంసారమనే సుడిగుండంలో చిక్కుకు పోతున్నారు. ఆ మాయను తప్పించుకోవటం త్రిమూర్తులకు కూడా సాధ్యం కాలేదు. ఆ మాయ పేరే భగవతి. ఆమె మానవుల మనసులనాకర్షించి సమ్మోహితులను చేస్తుంది. సృష్టి స్థితి లయకారిణి ఆమె. ఆమె పరాశక్తి ముక్తి హేతువు. శాశ్వతంగా వుండేది ఆమె. ఆవిడే సర్వేశ్వరి. దేవకార్యములు సాధించటానికి ఆవిడ భూలోకంలో అవతరిస్తుంది. పూర్వ కాలంలో విష్ణువు యోగనిద్రలో ఉన్నప్పుడు అతణ్ణి ఆవరించి ఉన్నది ఆమాయ. విష్ణుమూర్తి మధుకైటభులను రాక్షసులను ఆదేవి సహాయంతోనే చంపగలిగాడు. ఆపరాశక్తియే,మహిషాసురణ్ణి, శుంభనిశుంభుల్ని వధించింది. అప్పుడు దేవతలంతా ఆమెను పరిపరివిధాల స్తుతించి తల్లీ నువు సర్వకాలసర్వావస్థలయందూ మమ్మల్ని రక్షించాలి అని ప్రార్థించారు. దానికి ఆదేవి

"వైవస్వతమన్వంతరంలో శుంభనిశుంభులని ఇద్దరు రాక్షసులు పుడతారు. అప్పుడు నందగోపుని ఇంట యశోదా గర్భాన కృష్ణుడుగా పుట్టివారిని సంహరిస్తాను.

కొంతకాలానికి విప్రచిత్తి వంశీయులైన భయంకరమైన రాక్షసులుపుడతారు. వారిని నేను సంహరించేటప్పుడు నాదంతాలు ఎర్రగా మారతాయి. అందుచేత నన్ను రక్తదంతిక అంటారు.

కొంతకాలం పాటు దేశంలో వర్షాలు పడవు. అప్పుడు మునులు నన్ను స్తోత్రం చేయగా నేనుజన్మించి ప్రజలను వెయికళ్ళతో కాపాడుతాను. అందుకని నన్ను 'శతాక్షి' అంటారు. వర్షాలు కురిసే దాకా ప్రజలకు కాయగూరలు ఇచ్చి కాపాడతాను. అందుకని నన్ను శాకంబరి అంటారు.

నిలకడ అయిన బుద్ధితో ఎవరు నన్ను స్తోత్రం చేస్తారో వారి బాధలన్నీ నేను పోగొడతాను.

నా మహత్యాన్ని వినేవారికి శత్రువులు నశిస్తారు గ్రహపీడలుండవు. జగత్తు అంతావారికి వశమౌతుంది. అన్ని చోట్లా వారు పూజింపబడతారు" అని చెప్పింది.

కాబట్టి ఓరాజా! దేవీతత్వాన్ని, దేవీమహోత్యన్ని నీకు వివరించాను. ఆమె అంత ప్రతిభకల వారు ఇంకోరు లేరు. కాబట్టి మీరు కూడా ఆదేవిని శరణుకోరండి. మీ కష్టాలు తీరుతాయి. " అన్నాడు.

అప్పుడు సురధుడు సమాధి ఇద్దరూ ఆ పరమేశ్వరిని అత్యంత శ్రద్ధాభక్తులతో ధ్యానించారు. కఠినమైన నియమనిష్టలతో కొంతకాలం ఉపాశించారు. ఆ దేవి సంతుష్టాంతరంగితయై వారికి ప్రత్యక్షమై ఏవరంకావాలో కోరుకోమంది. సురధుడు తన రాజ్యం కావాలి అని కోరగా సమాధి ఆత్మ సాక్షాత్కారం కావాలి అని అడిగాడు. దేవీ వరప్రసాదుడైన సురధుడు వెయ్యి సంవత్సరాలు రాజ్యం చేసి చివరకు దేవీ సాన్నిధ్యం చేరాడు. సమాధి పుణ్యస్థలాలు సేవించి, తనువు చాలించి దివ్యపదానికి వెళ్ళి పోయాడు. ఈ విధంగా వారిని పరమేశ్వరి కరుణించింది.

# 16. వృత్రాసురుడు

త్వష్ట ఒక ప్రజాపతి. అతడికి ఇంద్రుడి మీద చాలా కోపం వచ్చింది. అందుకని ఇంద్రుణ్ణి సంహరించటానికి తన తపశ్శక్తితో మూడుతలలుగల కుమారుణ్ణి సృష్టించాడు. అతడి పేరు విశ్వరూపుడు. విశ్వరూపుడు తనమూడుముఖాలలోని

| | | |
|---|---|---|
| ఒక ముఖంతో | - | వేదాలు వల్లిస్తూ |
| రెండవముఖంతో | - | మద్యపానం చేస్తూ |
| మూడవ ముఖంతో | - | ప్రపంచవిశేషాలు చూస్తుంటాడు. |

విశ్వరూపుడు బ్రహ్మచారిగానే ఉండిపోయి కఠోర నియమాలతో, అకుంఠిత దీక్షతో తపస్సు చేశాడు. అతడికి తపో భంగం చెయ్యమని అప్సరాంగనలను వినియోగించాడు ఇంద్రుడు. వారు రకరకాల విన్యాసాలు చూపారు. హొయలు ఒలికించారు, కవ్వించారు. చేయతగిన దంతా చేశారు. విశ్వరూపుడు శిలావిగ్రహంలా కూచున్నాడు. కన్నెత్తి చూడలేదు. పన్నెత్తి మాటలాడలేదు. దాంతో అప్సరసలు విసిగిపోయి ఇంద్రుడి దగ్గరకు వెళ్ళి జరిగింది చెప్పారు.

వారి మాటలు వినగానే ఇంద్రుడికి చెమటలు పట్టాయి. ఇక లాభంలేదనుకుని తనే వజ్రాయుధం ధరించి ఐరావత మెక్కి విశ్వరూపుడి ఆశ్రమానికి వచ్చాడు. విశ్వరూపుడు నిశ్చలుడై తపోనిష్ఠలో ఉన్నాడు. ముందు వెనుకలు ఆలోచించకుండా తన వజ్రాయుధంతో విశ్వరూపుణ్ణి కొట్టాడు. తపస్సు చేసుకుంటున్న వాడిని చంపకూడదనే జ్ఞానం కూడా లేకపోయిందా మూర్ఖుడికి. స్వార్థం ఎంతపనైనా చేయిస్తుందికదా!

ఇంద్రుడి చేతిలో దెబ్బతిన్న విశ్వరూపుడు మరణించాడు. ఆశ్రమంచుట్టు ప్రక్కల నివాసమున్న మునులు ఇంద్రుని కిరాతకానికి అసహ్యించుకున్నారు. త్వరలోనే దీనికి తగిన ప్రతిఫలం అనుభవిస్తావు అని నిందించారు. ఇంద్రుడు చలించలేదు.

విశ్వరూపుడు మరణించినాకూడా =బ్రతికి ఉన్నట్లే కనిపించాడు ఇంద్రుడికి. అప్పుడు ప్రక్కనే ఉన్న తక్షకుణ్ణి చూసి " విశ్వరూపుడి మూడు తలలు తెగేసిరా" అన్నాడు. 'వాడెలాగూ చచ్చిపోయాడు. మళ్ళీ అతని తలలు నరకటం ఎందుకు? 'వజ్రాయుధంతో దెబ్బతిని కూడా బ్రతకటం జరుగుతుందా?'' అన్నాడు. తక్షకుడు. దానికి ఇంద్రుడు "విశ్వరూపుడు సామాన్యుడు కాదు. మహాతపస్సంపన్నుడు. ఏమైనా చెయ్యగలడు. అందుకని మనం సుఖంగా ఉండాలంటే నువు వెళ్ళి విశ్వరూపుడి మూడుతలలు తెగేసిరా. ఎందుకైనా మంచిది అన్నాడు. శవం తలనరకట మనేది నీచాతి నీచమయినపని. ఆపని చేస్తే నాకేమిటి ఉపయోగం? ' అన్నాడు తక్షకుడు. దానికి ఇంద్రుడు ఇంత చిన్న విషయానికి అంత ఆలోచన ఎందుకు? ఈ నాటినుంచీ ఎక్కడ యజ్ఞం జరిగినా యజ్ఞపశువు యొక్కతల నీకే చెందుతుంది. ఇక బయలు దేరు అన్నాడు. అంతవరకు

ఇంద్రుడికి ధర్మపన్నాలు బోధించిన తక్షకుడు ఎగిరి గంతేసి, విశ్వరూపుడి శవం దగ్గరకు పోయి అతని మూడుతలలనూ ఒక్క వేటుతో నరికేశాడు.

అంతే! ఆ మూడు ముఖాలనుంచి ఒక్క సారిగా కేకలుపెడుతూ రకరకాల జాతుల పక్షులు పుట్టాయి.

వేదం వల్లించిన ముఖంనుంచి - కౌజు పిట్టలు

మద్యం తాగిన ముఖంనుంచి - పిచ్చుకలు

ప్రపంచాన్ని చూసేముఖంనుంచి - తిత్తిరి పక్షులూ పుట్టాయి.

ఏ ముఖం నుంచి ఏ పక్షులు పుడితేనేం? తపోనిష్ఠలో ఉన్న విశ్వరూపుడు మాత్రం మరణించాడు.

విశ్వరూపుని మరణవార్త విన్నాడు త్వష్ట. ఇంద్రుడు చేసిన పనికి కోపము, కుమారుని మరణానికి దుఃఖము ఒకేసారికలిగాయి. ఏతప్పుచెయ్యని విశ్వరూపుణ్ణిచంపిన ఇంద్రుణ్ణి కడ తేర్చటానికి ఇంకొకణ్ణి సృష్టిస్తానంటూ హోమంచెయ్యటం ప్రారంభించాడు.

హోమంపూర్తయింది. హోమగుండం నుంచి అగ్నితో సమానమైన తేజస్సుకలవాడు, ప్రతాపంలో సూర్యుడితో సమానమైనవాడు, దివ్యకాంతులతో విరాజిల్లేవాడు అయిన కుమారుడు ఉదయించాడు. త్వష్ట ఆ కుమారుణ్ణిచూసి నువ్వు త్వరత్వరగా పెరిగి ఆ ఇంద్రుణ్ణి ముక్కలు ముక్కలుగా నరుకు అన్నాడు. అంతలోనే ఆ శిశువు కొండంతగా పెరిగి తండ్రిని చూసి నన్ను ఎందుకు పుట్టించావు?నాపేరేమిటి?నేనేం చెయ్యాలి? తండ్రీ! నువ్వెందుకు విచారంగా ఉన్నావు?నీకు కష్టం కలిగించిన వారెరరు? ఇంద్రుడా? చంద్రుడా?సూర్యుడా?యముడా?ఎవర్ని కడ తేర్చాలో చెప్పు.వాణ్ణి సంహరించేస్తాను అన్నాడు.

త్వష్ట కొద్ది సేపు ఆలోచించి వృజినము నుంచి రక్షించే వాడు కాబట్టి నీ పేరు వృత్రుడు అన్నాడు. వృజినము అంటే పాపము.

కుమారా! నీఅన్న విశ్వరూపుడు. మూడుతలలు కలవాడు. వేదవేదాంగాలూ తెలిసినవాడు. తపోదీక్షలో ఉండగా ఇంద్రుడు నిర్దాక్షిణ్యంగా వజ్రాయుధంతో కొట్టిచంపాడు. అంతే కాదు చచ్చినవాడితలలు తెగనరికాడు. ఆ బ్రహ్మద్రోహిని చంపిరా!అన్నాడు. త్వష్టతన తపశ్శక్తితో రకరకాల ఆయుధాలు సృషించి కుమారుడికిచ్చాడు. దివ్య రథం సృష్టించాడు. కవచము, ధనుర్బాణాలు ధరించి గతంలో దేవతలచే ఓడింపబడిన రాక్షసులందరినీ చేరదీసి, ఇంద్రుడిమీదకి యుద్ధానికి బయలుదేరాడు వృత్రాసురుడు.

దూతల ద్వారా వృత్రుడి వార్తవిన్న ఇంద్రుడు గడగడలాడి పోయాడు. వెంటనే దేవ గురువైన బృహస్పతికి కబురుచేసి విషయం వివరించి కర్తవ్యం ఆలోచించమన్నాడు.

బృహస్పతి కొద్దిసేపు ధ్యానంలోకి వెళ్ళి ఆ తరువాత ఈ విధంగా అన్నాడు.

"దేవేంద్రా!అకారణంగా ఇతరులను బాధించేవాడు దారుణమైన కష్టాలు అనుభవిస్తాడు. అలా అనటానికి నువ్వే ప్రత్యక్షసాక్షివి. ఏ పని చెయ్యాలన్నా బాగా ఆలోచించి చెయ్యాలి. లేకపోతే ఇలాగే అవుతుంది. నువ్వు చేసిన పని సామాన్యమైన దను కున్నావా? బ్రహ్మహత్య. వృత్రుడికి అతడి తండ్రి దివ్యాయుధాలు, దివ్యరథం ఇచ్చాడు. వాడి ఆయుధాల ముందు నీ వజ్రాయుధం పనికి రాదు.చేసిన దానికి ఫలితం పూర్తిగా అనుభవించాలి. కానివ్వు." అని చల్లగాజారుకున్నాడు. ఏదయితే అదవుతుందని ఇంద్రుడు వృత్రునితో యుద్ధానికి దిగాడు. దేవదానవులకు చాలా కాలం భీకరమైన పోరు జరిగింది. ఆయుద్ధంలో దేవతలు చావు దెబ్బలు తిని ప్రాణాలరచేత పట్టుకుని పారిపోయారు.

వృత్రుడు విజయవార్తను తండ్రికి ఎరిగించి ఇంకేంచెయ్యాలో చెప్పు అన్నాడు. దానికి త్వష్ట నావిచారము పూర్తిగా పోగొట్టావు. కాని ఒక్క విషయం ఇంద్రుడు సామాన్యుడు కాదు. జిత్తులమారి. వాణ్ణినమ్మకూడదు. బ్రహ్మను గూర్చి తపస్సు చేసి ఇంద్రుణ్ణి జయించే శక్తి సంపాదించుకో అన్నాడు.

తండ్రి మాట ప్రకారం బ్రహ్మను గూర్చి ఘోరమైన తపస్సు చేశాడు వృత్రుడు. బ్రహ్మ అతని తపస్సుకు మెచ్చి ప్రత్యక్షమై ఏవరం కావాలో కోరుకోమన్నాడు. వృత్రుడు బ్రహ్మకు నమస్కరించి " దేవా ఇసుము మొదలయిన లోహాలతోగాని, కర్రలతో గాని, ఎండిన మట్టితోగాని, తడిసిన వాటితోగాని, అస్త్రాల చేతగాని, శస్త్రాలచేతగాని, నాకు చావు రాకూడదు. యుద్ధ సమయంలో నాశక్తి వృద్ధి అవుతూఉండాలి అన్నాడు. చావులేకుండా వరం అడగలేదుకదా, అందుకని బ్రహ్మ తథాస్తు అన్నాడు. కుమారుడి వరాల సంగతి తెలిసి చాలాసంతోషించాడు త్వష్ట, వృత్రుణ్ణి పిలిచి ఇప్పుడు వెళ్ళి ఆ ఇంద్రుణ్ణి చంపిరా। అన్నాడు. వృత్రుడు ఇంద్రుడితో యుద్ధానికి వెళ్ళాడు. ఆ యుద్ధంలో వృత్రుడు ఇంద్రుణ్ణి కాస్తా గుటుక్కున మింగేశాడు. దేవతలు బృహస్పతి దగ్గరికి వెళ్ళి ఇంద్రుణ్ణి రక్షించమని ప్రార్థించారు. అతడు వృత్రుని నోటిలో ఇంకా బతికే ఉన్నాడు చావలేదు. అందుచేత బృహస్పతి వృత్రుడికి ఆవలింత వచ్చేటట్లు చేశాడు. వృత్రుడు ఆవలించగానే ఇంద్రుడు బయటకు వచ్చేశాడు.అప్పుడు ఇంద్రుణ్ణి, మిగిలిన దేవతలనీ చావగొట్టగా వారు బ్రతుకు జీవుడా అని దేవలోకం నుంచి పారి పోయారు. స్వర్గాన్ని ఆక్రమించి ఇంద్రుడి సింహాసనం అధిష్టించాడు వృత్రుడు. ఆవిషయం తెలిసి మహదానందం పొందాడు త్వష్ట.

దేవతలు అనేక సంవత్సరాలు అడవులు, గుట్టలు, కొండలు, కోనలు పట్టుకుని తిరిగి చివరకు వైకుంఠం చేరి రక్షించమని విష్ణుమూర్తిని వేడుకున్నారు. అప్పుడు విష్ణువు , వృత్రుడు చాలా బలవంతుడు. పైగా తపశక్తి సంపన్నుడు, వరబలం కలవాడు. కాబట్టి అతణ్ణి జయించటం సాధ్యంకాదు. మామూలు ఆయుధాలకు చావడు. మాయోపాయంతోనే అతడు చస్తాడు. దీనికి పరమేశ్వరి అనుగ్రహం కావాలి. ముందుగా మీరంతా పరమేశ్వరిని ధ్యానించండి అన్నాడు. దేవతలు పరమేశ్వరిని పరిపరివిధాల ధ్యానించారు. అప్పుడు ఆ

దేవి వారికి ప్రత్యక్షమై మీరంతా వృత్రునితో స్నేహం చెయ్యండి. అప్పుడు వాణ్ణి చంపటం తేలిక, విష్ణువు శక్తిని వజ్రాయుధంలో నిక్షిప్తం చెయ్యండి. మీకు శుభం కలుగుతుంది. అని చెప్పింది.

దేవతల పక్షాన కొందరు మునులు రాయబారులుగా వృత్రుడు దగ్గరకు వెళ్ళి రాజా! దేవదానవులు కలసి ఉండటం క్షేమం. మీ విరోధంవల్ల లోకాలకు బాధ కలుగుతోంది. మామీద నీకు ఏమాత్రం గౌరవమున్నా ఇంద్రుడితో చెలిమి చెయ్యి. అన్నారు. దానికి వృత్రుడు ఏపరిస్థితిలోనూ పగలు గాని, రాత్రిగాని, కర్రతో గాని, లోహంతో గాని ఇంద్రుడు నన్ను చంపటానికి ప్రయత్నించరాదు. దీనికిష్టమైతే చెలిమికి నేను సిద్ధం. అన్నాడు. వృత్రుడి షరతు లన్నిటినీ అంగీకరించి అందరి ముందు అతడితో స్నేహం చేసుకున్నాడు ఇంద్రుడు.

ఇంద్రుడు, వృత్రుడు మిత్రులుగా ఉంటున్నారు. ఈ విషయం తెలిసిన త్వష్ట పరుగెత్తుకు వచ్చి "ఇంద్రుడు మాయావి, తల్లి కడుపులో ఉన్న పిండాన్ని ముక్కలు ముక్కలు గా నరికినవాడు. వట్టి దుర్మార్గుడు. వాడి మాటలు నమ్మద్దు. వాడితో స్నేహం వద్దు" అన్నాడు. తండ్రి మాటలు లక్ష్యపెట్టలేదు వృత్రుడు.

ఒకరోజు సాయం సంధ్యా సమయాన మిత్రులిద్దరూ సముద్రతీరాన వ్యాహ్యాళికి వెళ్ళారు. అది పగలూ కాదు రాత్రీ కాదు. సంధ్యా సమయం, వృత్రుణ్ణి సంహరించవచ్చుఅని ఇంద్రుడు హరిని ప్రార్థించాడు. వెంటనే విష్ణుశక్తి ఇంద్రుని వజ్రాయుధంలో ప్రవేశించింది. సముద్రకెరటాలమించి వస్తున్న నురగ తడీకాదు పొడీకాదు. ఇంద్రుడు పరమేశ్వరిని ప్రార్థించాడు. ఆ దేవి అంశ వజ్రాయుధంలో చేరింది. ఇంద్రుడు వజ్రాయుధాన్ని సముద్రపు నురగలో ముంచి వృత్రుని శిరస్సు తెగనరికాడు. వృత్రుడు మరణించాడు. దేవతలంతా దేవిని అనేక విధాలుగా ప్రార్థించారు.

ఈ విధంగా పరమేశ్వరి కరుణవల్ల వృత్రాసుర సంహారం జరిగి లోకాలన్నీ సుఖంగా వున్నాయి.

---

# 17. నహుషుడు

బ్రహ్మ మానస పుత్రుడు అంగీరసుడు. అతని భార్య శివ. ఈమెనే శ్రద్ధ అని కూడా అంటారు. ఇతనికి బృహస్పతి, సంవర్తనుడు మొదలుగా గల పదిమంది కుమారులున్నారు.

బృహస్పతి దేవగురువు. ఇతని భార్య తార. చాలా అందగత్తె. చంద్రుడు బృహస్పతి దగ్గర విద్య నేర్చుకొనేవాడు. ఆ కాలంలో బృహస్పతి భార్య అయిన తార చంద్రుని మీద మనసుపడి కొంతకాలం అతని దగ్గర ఉండిపోయింది. వీరిద్దరికీ పుట్టిన వాడే బుధుడు.

సుద్యుమ్నుడు అనే మహారాజు చాలా అందగాడు, మంచి గుణవంతుడు. ఒకనాడు వేటకు సైన్యసమేతంగా వెళ్ళి ఒక వనంలో ప్రవేశించాడు. ఆవనంలో కాలుపెట్టటమే తడవుగా సపరివారంగా అందరూ స్త్రీ లుగా మారి పోయారు. స్త్రీ రూపం పొందిన సుద్యుమ్న మహారాజు ఇళ అనే పేరుతో ఆవనంలోనే ఉండసాగాడు. ఒకనాడు బుధుడు ఆ వనంలో ఇళను చూచి మోహించాడు. ఇళా, బుధులకు పురూరవుడు అనే కుమారుడు కలిగాడు.

పురూరవుడు రాజ్యం చేస్తున్న కాలంలో ఒకనాడు ఒక వనంలో ఊర్వశిని చూశాడు. చూసిందే తడవుగా ఇద్దరూ ఒకరినొకరు కోరుకున్నారు. కొంతకాలంకలిసి కాపురంచేశారు. పురూరవుడికి ఊర్వశి యందు సత్యాయువు, శ్రుతాయువు, ధృడాయువు, ఆయువు మొదలైన పదకొండుమంది పుత్రులు కలిగారు. వీరిలో ఆరవవాడు ఆయువు. ఇతడు 'స్వర్భానవి' అనే కన్యను వివాహమాడాడు. ఆమె యందతనికి నలుగురు కుమారులు కలిగారు.

1. నహుషుడు  3. గయుడు
2. వృద్ధశర్మ  4. అనేనసుడు

తండ్రి తరువాత నహుషుడురాజై ప్రజారంజకంగా రాజ్యాన్ని పాలించాడు. రాజ్యపాలన చేస్తున్నప్పుడు నహుషుడు అనేక యజ్ఞాలు, అశ్వమేధయాగాలు, క్రతువులు చేశాడు.

త్వష్ట ప్రజాపతి ఇంద్రుని మీద కోపించి, అతన్ని చంపటానికి విశ్వరూపుడు అనే మూడుతలలు కల కుమారుణ్ణి సృష్టించాడు. విశ్వరూపుడు తపస్సు చేసుకుంటున్న సమయంలో ఇంద్రుడు అతణ్ణి చంపి, తలలు నరికించాడు. ఆ విషయం తెలిసిన త్వష్ట వృత్రుడు అనే మరో కుమారుణ్ణి హోమగుండం నుంచి సృష్టించాడు. మొదట వృత్రుడి చేతిలో ఓడిపోయిన ఇంద్రుడు తరువాత అతడితో స్నేహంచేసి, నమ్మించి ద్రోహబుద్ధితో చంపాడు. నమ్మకద్రోహము, మిత్రఘాతుకముచేసి నందుకు మునులు ఇంద్రుణ్ణి నిందించారు. అకారణంగా వృత్రుణ్ణి చంపినందుకుగాను ఇంద్రుడికి బ్రహ్మహత్యాపాతకం

పట్టుకున్నది. అతని ముఖంలో కళా, కాంతులు తగ్గిపోయాయి. కళాహీనమైన తనముఖాన్ని ఎవరికీ చూపలేక అమరావతీ నగరాన్ని వదిలి, ఎవ్వరికీ చెప్పకుండా మానస సరోవరానికి వెళ్ళి అందులోని ఒక పద్మము యొక్క గొట్టం (తామరతూడు) లో సూక్ష్మరూపుడై దాక్కున్నాడు. స్వర్గము రాజులేని రాజ్యమయింది. దేవతలంతా కూర్చుని ఆలోచించారు. ఇంద్రుడు మళ్ళీ రాజ్యానికి రావాలంటే బ్రహ్మహత్యా పాతకం పోవాలి. అది పోవాలంటే అశ్వమేధయాగం చెయ్యాలి. మరి అంత వరకు ఏమిటి చెయ్యటం? ఈ లోపు ఇంద్రపదవి ఎవరో ఒకరు అధిష్టించాలికదా. ఆ పదవికి అర్హులు దేవలోకంలో ఎవరూ కనిపించలేదు

ఇంద్రుడు దిక్పాలకులలో ఒకడు. తూర్పు దిక్కుకు అధిపతి. అయినప్పటికీ దేవలోకానికి రాజు. ఇంద్రుడు అనేది ఒకడి పేరు కాదు. ఇంద్రపదవిలో ఉన్న ప్రతి వాడినీ ఇంద్రుడు అనే అంటారు. భూలోకంలో శతక్రతవులు చేసినవాడు ఇంద్రపదవికి అర్హుడు మన్వంతరాన్ని బట్టి, వారు చేసే పనులను బట్టి ఆపదవిలో ఉన్నవారు మారుతుంటారు.

| | | |
|---|---|---|
| ఉత్తమ మన్వంతరంలో | - | సుశాంతుడు |
| రైవత మన్వంతరంలో | - | విభుడు |
| చాక్షుషమన్వంతరంలో | - | మనోజవుడు |

అనేవాళ్ళు వరుసగా ఇంద్రసింహాసనాన్ని అధిరోహించారు.

భూలోకంలో ధర్మాన్ని నాలుగు పాదాలా రక్షిస్తూ వందకు పైగా యజ్ఞాలు చేసిన వాడు నహుషుడు. కాబట్టి నహుషుడే ఇంద్రపదవికి సరిపోయినవాడు అని యోచించి నహుషుణ్ణి సగౌరవంగా రప్పించి, ఇంద్రునిగా మన్నించి స్వర్గాధిపత్యం అప్పగించారు. నహుషుడు దేవలోకానికి రాజైనాడు.

దేవరాజు అవగానే నహుషుడికి మతి భ్రమించింది. ధర్మాన్ని విడిచి పెట్టేశాడు. అక్కడ ఉన్న అప్సర స్త్రీలతో పెచ్చు పెరిగిన కామంతో విహరిచంటం మొదలు పెట్టాడు. సర్వకాలసర్వావస్థలయందు అతడికి ఇదే ఆలోచన. వేరేధ్యాసేలేదు. నిత్యమూ కేళీ విలాసాలలో తేలియాడే దేవతలకు కూడా నహుషుని చర్య ఏవగింపు కలిగించింది.

ఇంద్రుని భార్య శచీదేవి. చాల అందగత్తె. ఇంద్రుడు బ్రహ్మహత్యా పాతకం వల్ల కనిపించకుండా మానససరోవరంలోని పద్మంలో దాక్కున్నాడు. ఇక్కడ శచీదేవి ఒంటరిగా ఉన్నది.

నహుషుడు ఇంద్రుడైనాడు. ఇంద్రుని సింహాసనం అధిష్టించాడు. ఇంద్రుడు పాలించే దేవలోకానికి రాజైనాడు. ఇంద్రుని వాహనమైన ఐరావతం, ఉచ్ఛైశ్రవం అతినికి వాహనాలయినాయి. అప్సరసలు అతను చెప్పినట్లు ఆడుతున్నారు. దేవతలు అతని ఆజ్ఞలు పాటిస్తున్నారు. దిక్పాలకులు అతని మాటప్రకారం నడుస్తున్నారు. అంటే ఇంద్రుని అధికారాలు, వస్తు వాహనాలు అన్నీ అతనికి సంక్రమించాయి. మరి ఇంద్రుని భార్య శచీదేవి కూడా అతని సొంతం కావాలి కదా! ఆలోచించసాగాడు నహుషుడు.

కూర్చున్నది ఇంద్రసింహాసనంకదా.

వెంటనే దేవఋషులను పిలిచి నేను ఇంద్రుణ్ణి. దేవలోకానికి రాజును కదా! మరినాకు రాణి ఏది? శచీదేవిని తెచ్చి నాపక్కన కూర్చోబెట్టండి. మీరే ఈపని చేస్తారో? మరెవరితోనైనా చేయిస్తారో? అది మాత్రం జరగాలి. శచీదేవి నాప్రక్కన ఉండాలి అన్నాడు.

దేవర్షులు దేవతలనందరినీ సమావేశ పరిచి జరిగినదంతా చెప్పారు. అందరూ కలిసి శచీదేవి మందిరానికి వెళ్ళారు.శచీదేవి సాదరంగా వారిని ఆహ్వానించింది.కుశల ప్రశ్నల తరువాత దేవతలు తమ నోటితో చెప్పలేక, అయినా చెప్పక తప్పదు కాబట్టి విషయాన్ని వివరించారు. ఆ మాట వినగానే అవాక్కుఅయిపోయింది శచీదేవి. తనకు వచ్చిన కష్టాన్ని తలచుకొని దుఃఖించింది. దేవతలకు రాజు, స్వర్గాధిపతి ఇంద్రుడు. అంతటి వాడికి భార్యతను. అటువంటి తనను ఒక మానవుడు కోరటమా?ఏమి విధి వైపరీత్యం? ఎటువంటి స్త్రీకి ఎంతటి కష్టం?.అని పరిపరి విధాల దుఃఖించి బృహస్పతిని శరణు వేడింది. అపుడా దేవగురువు "తల్లీ నీ కొచ్చిన భయం ఏమీ లేదు. నిన్ను ఆ కాముకుడు ఏమీ చెయ్యలేడు. నీ వంక కన్నెత్తయినా చూడలేడు. అతడికి ఈ ఇంద్ర పదవి శాశ్వతంకాదు. అధర్మంచేసేవాడు ఎంత ఉన్నతస్థితిలో ఉన్నానరే పడిపోతాడు.ఉన్నతమైన స్థితిలో ఉండి నీచకార్యాలు చేసేవాడు అతినీచమైన స్థాయికి పతనం చెందుతాడు. నువ్వు భయపడకు" అని శచీదేవికి ధైర్యం చెప్పాడు.

ఈ విషయం తెలిసిన నహుషుడు మండిపడి"ఇంద్రుడి మాటకు విరుద్ధంగా బృహస్పతి నడవటమా! క్షమించరానిది.ఇంద్ర పదవి అతని సొత్తేంకాదు. అయినా తాను ఇంద్రుడుగా సింహాసనం మీద ఉన్నప్పుడు గౌతముడి భార్యఅహల్యతో కులక లేదా? నాదికాని వస్తువేదయినా నాది అన్నానా? శచీదేవి ఇంద్రుని భార్య ప్రస్తుతం నేనే ఇంద్రుణ్ణి ఐరావతము, ఉచ్చైశ్రవము నాకు దక్కినట్టే, శచీదేవి కూడా నా సొంతం కావాలి. ఇది దేవరాజు ఆజ్ఞ"అన్నాడు. అప్పుడు మహర్షులు కొంచెం ధైర్యంచేసి "రాజా నీవు దేవరాజువు. పాపపు పనులు చెయ్యటం నీకు తగునా? గతంలో దేవేంద్రుడు అహల్యమీద ఆశపడే కదా సహస్రాక్షుడైనాడు. నువ్వే ఇలాటి పని చేస్తే మిగిలిన వారుకూడా అలాగే చేయరా. నీ కోర్కె తీర్చటానికి అందమైన అప్సరాంగనలు అనేకమంది ఉన్నారు. వారితో సుఖంగా వినోదించు అయినా రాజా! స్త్రీ పురుషులు అన్యోన్య ప్రేమానురాగాలు కల వారైతేనే వారి ప్రణయం ఆనందదాయకం అవుతుంది. లేకపోతే ప్రళయాంతకం అవుతుంది. గతంలో సీతను కామించే కదా రావణబ్రహ్మ ప్రాణాలు సైతం కోల్పోయాడు. నీకు శచిదేవి మీద ప్రేమ కలిగింది. మరి ఆమెకు నీ మీద కూడా ప్రేమ కలగాలి కదా! అలాంటిది ఏమీ లేదు. నువ్వు ముల్లోకాలాలకు అధిపతివి. నిన్ను బట్టే ధర్మం చరిస్తుంది. కాని పనులు చెయ్యకు. ధర్మవిరుద్ధమైన పనులజోలికి పోకు." అన్నారు. దానికి నహుషుడు "ఓ మహర్షులారా! నాకిన్ని నీతులు చెప్పారు.మరి గతంలో ఎందుకు మాట్లాడలేదు. అహల్య విషయంలో నోరెందుకు మెదపలేదు. చంద్రుడు బృహస్పతి భార్య తారను తీసుకు పోయినప్పుడు మీరేం చేశారు? మీ ధర్మ పన్నాలు కట్టిబెట్టి శచిని నాకప్పగించండి". అన్నాడు.

ఆలోచించారు దేవతలు. బృహస్పతి సలహాపై శచిదేవి నహుషుని కొలువుకు వెళ్ళింది. ఆకాముకుడు శచిదేవిని అంతఃపురానికి రమ్మన్నాడు.దానికి శచీదేవి "రాజా! నాకుకొద్దికాలం గడువు ఇవ్వు. నాభర్త బతికి ఉన్నాడో లేదో తెలనివ్వు. తరువాత పని

అప్పుడు ఆలోచిద్దాం" అంది. సరే అన్నాడు నహుషుడు. ఇంద్రుణ్ణివెదికే పని దేవతలకప్పగించాడు.

ఇంద్రుడిస్థితి తెలిసిన దేవగురువు అతడితో రహస్యంగా అశ్వమేధయాగం చేయించి, అతని బ్రహ్మహత్యాపాతకం పోగొట్టాడు. ఇప్పుడు కళాకాంతులతో విరాజిల్లుతూ ఇంద్రుడు తన సింహాసనం మీద కూర్చోవటానికి సన్నద్ధమైనాడు.

భర్త రాక కోసం ఎదురు చూస్తున్న శచీదేవికి బృహస్పతి భువనేశ్వరీ మంత్రోపదేశంచేసి దాన్ని జపించమన్నాడు. శచీదేవి ఆ పరదేవతను ఆరాధిస్తోంది. ఒకనాడు పరదేవత శచీదేవికి సాక్షాత్కరించి "సాధ్వి నీ ఆరాధనకు మెచ్చాను. ఏంకావాలో కోరుకో! అంది 'నాపతి సుఖంగా, త్వరగా నావద్దకు వచ్చేట్లు అనుగ్రహించమని అడిగింది శచీదేవి. తథాస్తు అంది పరమేశ్వరి.

కొంతకాలం గడిచింది. శచీదేవి పరమేశ్వరి ఆరాధన చేస్తూనే ఉంది. ఒకరోజు నహుషుడు ఋషులను పిలిచి "ఎంతకాలానికి రాదేమి శచీదేవి. నన్ను మోసం చెయ్యాలని చూస్తున్నట్టు కనిపిస్తోంది. ఈ రాత్రికి ఆమెను ఎలాగైనా సరే నామందిరానికి పంపండి" అన్నాడు.ఆలోచించారు ఋషులు బృహస్పతి సలహామీద నహుషుడికి కబురు పంపింది శచీదేవి. "రాజా! నాభర్త జాడ ఇంతవరకూ తెలియలేదు, ఇక అతడు ఉన్నా లేనట్టుగానే భావించాలి. నేనన్నట్టుగా నేను ఇంద్రుని భార్యను. ప్రస్తుతం నీవే ఇంద్రుడవు, కాబట్టి నీకోరిక తప్పక తీరుస్తాను. ఈ రాత్రికి నువ్వే నా మందిరానికిరా.అయితే ఒక్క మాట ఇది మొదటి రాత్రి కాబట్టి సప్తఋషులు మోసే పల్లకి ఎక్కి నువ్వు నామందిరానికి రావలసినది".

ఈ మాటలు విన్న ఆ కామాంధుడు సరే అలాగే వస్తాను అన్నాడు. మహర్షులు, పల్లకీ మోయటమేమిటి? అని కూడా ఆలోచించలేదు.

మహర్షులను పిలిచి పల్లకీ మోయమన్నాడు. సప్తఋషులలో బాగా పొట్టివాడు అగస్త్యుడు. పల్లకి ఎక్కాడు నహుషుడు. అగస్త్యుడు పట్టిన వైపు కిందికీమీదికీ అవుతోంది. లోపల కూర్చున్న నహుషుడు మదనతాపంతో వేగిపోతున్నాడు. శచీ సమాగమం ఎప్పుడా అని ఎదురు చూస్తున్నాడు. చేతనైతే ఈ క్షణమే శచీదేవి ఒళ్ళోవాలిపోవాలని చూస్తున్నాడు.ఆలశ్యం భరించలేకుండా ఉన్నాడు. తొందరగా నడవమని ఋషులను అరుస్తూ 'సర్పసర్ప' (త్వరగా త్వరగా) అని అగస్త్యుణ్ణి కొరడాతో కొట్టాడు. వెంటనే అగస్త్య మహర్షికోపించి 'సర్పోభవ' (పాముగా మారు) అని శపించాడు.

ఈ దెబ్బకి నహుషుడి తలకెక్కిన మత్తు దిగిపోయింది. ఏం జరిగిందో తెలిసింది.వెంటనే మహర్షి కాళ్ళమీద పడి క్షమించ మన్నాడు. "ఋషిశాపానికి తిరుగులేదు. కాబట్టి భూలోకంలో కొంతకాలం పెద్ద పాముగా పడిఉండి కనిపించిన వారిని పట్టుకునిప్రశ్నలు అడుగుతూ ఉండు. నీ ప్రశ్నలకు ఎప్పుడైతే సరైన సమాధానం దురుకుతుందో అప్పుడు నీకు శాప విమోచనం కలుగుతుంది." అన్నాడు అగస్త్యుడు

నహుషుడుభూలోకంలో పెద్ద కొండచిలువగా పుట్టికొన్ని వేల సంవత్సరాలు జీవించాడు. ద్వాపరయుగంలో నహుషుని ప్రశ్నలకు ధర్మరాజు సమాధానం చెప్పగా అతడికి శాపవిమోచనం అయి స్వర్గానికి పోయాడు.

ఈ విధంగా నహుషుని వల్ల బాధింపబడిన శచీదేవి ఆపరపరమేశ్వరి దయవల్ల మళ్ళీ తన భర్తతో సుఖంగా జీవనం సాగించింది.

# 18. నిమి చక్రవర్తి

వైవస్వతమనువు కుమారుడు ఇక్ష్వాకువు. శ్రీరాముని వంశానికి ఇతడేమూలపురుషుడు. ఒకనాడు మనువు తుమ్మగా అతని ముక్కునుండి ఇక్ష్వాకువు పుట్టాడు, ఇక్ష్వాకువుకు వంద మంది కుమారులు. వారిలో నిమి, వికుక్షి, దండకుడు అనే వాళ్ళు పెద్దవాళ్ళు.

ఇక్ష్వాకు వంశస్థుడైన నిమి సూర్యవంశ స్థాపకుడు. అయోధ్యా నగరాన్ని ఏలిన మహరాజు. సద్గుణసంపన్నుడు, ఇతడు దేవీయజ్ఞంచెయ్యటం కోసం సంబారాలు అన్నీ సమకూర్చుకుని, ప్రదేశాన్ని నిర్ణయించుకుని గౌతమాది మహర్షులను ఆహ్వానించాడు. కులగురువైన వశిష్ఠమహర్షిని పెద్దగావుండి యజ్ఞనిర్వహణ చేయవలసిందిగా కోరాడు. దానికి వసిష్ఠుడు "రాజా! ఇంద్రుడు కూడా దేవీ అనుగ్రహంకోసం యజ్ఞం మొదలుపెట్టి నన్ను బ్రహ్మగా రమ్మన్నాడు నేను అంగీకరించాను అతడు నీకన్న నాకు ముందుగా చెప్పాడు కాబట్టి ముందు అతడి యజ్ఞం జరిపించి వస్తాను" అన్నాడు. దానికి నిమి కోపగించి "ఆర్యా నువు మా కులగురువువు మాక్షేమసమాచారాలు తెలుసుకుని పని చెయ్యాలి. అంతేకాని ఆశతో ఇంకోచోటికి పోరాదు." అన్నాడు. కాని వసిష్ఠుడు ఆగలేదు. ఇంద్రుడి యజ్ఞానికి వెళ్ళి పోయాడు.

ఇపుడు యజ్ఞానికి ఆధ్వర్యం వహించే వాళ్ళు ఎవరూలేరు. ఎలా? అని ఆలోచించి నిమి చక్రవర్తి గౌతమమహర్షిని యజ్ఞం జరిపించమని ప్రార్థించాడు గౌతముడు సరే అన్నాడు.

ఇంద్రుడి యజ్ఞం పూర్తయింది. వసిష్ఠుడు అయోధ్యా నగరానికి వచ్చి తనరాక రాజుకు తెలియ చేయవలసినది అని రాజమందిరానికి కాపలా ఉన్న భటుడుకి చెప్పాడు. ఆసమయంలో నిమి నిద్రపోతున్నాడు అందుకని సేవకుడు అతణ్ణి లేపలేదు రాజుకు వశిష్ఠుడు వచ్చిన విషయం తెలియదు.

వశిష్ఠుడు చాలాసేపు నిరీక్షించాడు. రాజుదగ్గరనుంచి కబురు రాలేదు. దాన్ని తిరస్కారంగా భావించాడు. ఏమీ ఈ రాజు దుర్మదం "కులగురువైన నేను లేకపోతే నాకోసం ఆగకుండా గౌతముడితో యజ్ఞం చేయిస్తాడా? నేను వచ్చిన తరువాతకూడా నన్ను లోపలికి పిలవకుండా అవమానిస్తాడా? ఏమీ ఈ రాజు కండకావరం. అని ఆలోచించి "నిమి చక్రవర్తీ! నీదేహం నాశనమయిపోతుంది." అని శాపం పెట్టాడు. ఆమాటవిని సైనికులు పరుగుపరుగున పోయి రాజుకు జరిగినది వివరించాడు. నిమి బయటకు వచ్చి "మావంశానికి గురువై ఉండి, మామేలుకోరకుండా మాకే శాపం పెడతావా? యుక్తాయుక్త విచక్షణ లేకుండా రాజుకు అందులోనూ శిష్యుడికి శాపం పెడతావా? ఆ మాత్రం నాకు చేతకాదనుకున్నావా? నీకూ అదే గతి పడుతుంది. పో" అని ప్రతి శాపం పెట్టాడు.

వెంటనే వసిష్ఠుడు తన తండ్రి అయిన బ్రహ్మదగ్గరకు వెళ్ళి జరిగిన విషయం చెప్పాడు. అంతావిని విధాత "అహంకరిస్తే ఇంతే జరుగుతుంది వెళ్ళు .మిత్రావరుణుల వల్ల మళ్ళీ పుడతావు అన్నాడు. కొంతకాలానికి ఊర్వశిని మిత్రావరుణులు మోహించటం, ఆమెవల్ల వశిష్ఠుడు మళ్ళీ పుట్టటం జరిగింది. యజ్ఞ కార్యంలో ఉన్న మునులు వసిష్ఠుని శాపం విన్నారు. రాజుకు యజ్ఞం చేస్తుండగా మధ్యలో ఆపద వచ్చింది. ఇప్పుడు యజ్ఞం ఆగిపోతుంది. అలా జరగటానికి వీలులేదు. అని తమ మంత్రశక్తితో నిమి కొనఊపిరితో ఉండేట్టు చేసి యజ్ఞం పూర్తి చేశారు.

యజ్ఞం నిర్విఘ్నంగా పూర్తయింది. దేవతలు వచ్చి రాజా! యజ్ఞం చక్కగా జరిగింది. మేము చాలా సంతసించాము. నువు మానవ దేహంలోనే ఉంటావా? లేక మాతో దేవలోకానికి వస్తావా?" అని అడిగారు. దానికి రాజు "దేవతలారా! ఈ శరీరం శాశ్వతం కాదు. ఎప్పటికైనా నశంచిపోయేదే. నాకు శాశ్వతత్త్వం కావాలి. అన్ని ప్రాణుల కళ్ళలోనూ నేను ఉండేట్టుగా వరమివ్వండి" అన్నాడు.

"పరమేశ్వరియజ్ఞం నిరాటంకంగా పూర్తి చేశావు. కనుక ఆమెను ధ్యానించు నీకోరిక తీరుతుంది." అన్నారు దేవతలు.

నిమి పరమేశ్వరిని పరిపరివిధాల ప్రార్థించాడు. ఆ దేవి సాక్షాత్కరించి రాజా! ఏవరం కావాలి? అంది.

"అమ్మా! నేను లోకంలోని సుఖాలు అన్నీ అనుభవించాను. ఇంక నాకు దేని మీదా ఆశలేదు. అందుచేత నేను శాశ్వతంగా అన్ని ప్రాణుల నేత్రాలలోనూ ఉండే టట్లుగా అనుగ్రహించవలసినది." అన్నాడు నిమి తథాస్తు అన్నది పరమేశ్వరి. నిమి దేహం పడిపోయింది. నిమికి దేహం లేకపోయినప్పటికి పరమేశ్వరి కరుణవల్ల ప్రజలకు మాత్రం దేహం ఉన్నట్టే కనిపించాడు. అప్పటినుంచే రెప్పపాటుకు నిమిషము అని పేరు వచ్చింది.

# 19. హైహయుడు

సూర్యుని యొక్క కుమారుడు రేవంతుడు. మంచి అందగాడు, వీరుడు. అశ్వ శాస్త్ర ప్రవీణుడు. అశ్వాలకు శిక్షణ ఇవ్వటంలోను, అశ్వాలను నడపటంలోను, వాటిమీద స్వారీ చెయ్యటంలోను అతడికి అతడేసాటి. ఒకనాడు అతడు ఉచ్చైశ్రవం ఎక్కి విష్ణుమూర్తిని దర్శించటానికని వైకుంఠానికి వచ్చాడు. ఉచ్చైశ్రవం అంటే ఇంద్రుడి గుర్రం కదా! దాన్ని రేవంతుడు ఎలా ఎక్కగలిగాడు? అని అనుమానం రావచ్చు. ఉచ్చైశ్రవము అంటే నిక్కిన చెవులు గల గుర్రము అని అర్థం. అయితే ఇంద్రుడి గుర్రం పేరు కూడా ఉచ్చైశ్రవమే. రేవంతుడు ఎక్కి వచ్చిన గుర్రం చాలా అందంగా ఉంది. ఐదు రంగులతో, నిక్కిన చెవులు, పొడవాటి తోక చూడగానే ఆకర్షించేటట్టుగా ఉన్నదా గుర్రం.

మేడ మీద ఉన్న లక్ష్మీదేవి ఆ గుర్రాన్ని చూసింది. గుర్రం మీదనుంచి మనసు, దృష్టి కూడా మరలలేదు. తదేక ధ్యానంతో అలాగే చూస్తోంది. ఇంతలో విష్ణువు వచ్చి ఆమెను పిలిచాడు. ఆమె పలకలేదు. ఆవిడ ధ్యాస అంతా ఆ గుర్రం మీదనే ఉంది. విష్ణువు దగ్గరకు వచ్చి లక్ష్మీదేవిని పిలిచాడు. అయినా ఆమె పలకలేదు. ఈ లోకంలో ఉంటేకదా పలకటానికి. గుర్రం ధ్యాసలో నిమగ్నురాలైపోయింది. అది చూసి విష్ణువు " ఓ చపల చిత్తులారా! గుర్రాన్ని చూసి మనసుపడ్డావా? అశ్వాన్ని చూసి అనురాగ వతివయ్యావు కాబట్టి బడబగా జన్మించు అన్నాడు". బడబ అంటే ఆడగుర్రం. ఆమాట వినగానే లక్ష్మీదేవి స్పృహలోకి వచ్చింది. "ఎంతపొరపాటు జరిగింది. విష్ణుమూర్తి వస్తే గమనించలేదా? ఆయన పిలిచినా పలకలేదా? ఎంత పొరపాటు. ఒక గుర్రాన్ని చూసి నేను మాయకు లోనుకావటమా? మాయకులోనైన నన్ను విష్ణువు శపించటమా? ఏమిటీ గ్రహపాటు. విష్ణువును విడిచి నేను భూలోకంలో గుర్రం జన్మ ఎత్తాలా? ఆయనను విడిచి నేనెలా ఉండగలను" అని విలపించి పతి పాదాలపైబడి అనుగ్రహించమని వేడుకుంది. దానికి విష్ణువు " నాశాపం తప్పదు. నాతో సమానమైనవాడు నీ కుమారుడుగా పుట్టిన తరువాత నీకు శాపవిమోచనం కలుగుతుంది" అని చెప్పాడు.

లక్ష్మీదేవి భూలోకంలో ఆడగుర్రంగా పుట్టి తమసానది, కాళిందినది మధ్య పచ్చిక బీళ్ళలో నివాసం ఏర్పరచుకుని పరమేశ్వరుణ్ణి ధ్యానిస్తూ కొన్ని వందల సంవత్సరాలు కాలం గడిపింది. ఎట్టకేలకు పశుపతి ఆమె తపస్సుకు మెచ్చి ప్రత్యక్షమై తల్లీ! నీ భర్త విష్ణువు అన్నిటా సమర్థుడు. మరి అలాటివాణ్ణి కాదని నన్ను ధ్యానిస్తున్నావు దేనికి? అన్నాడు. ఆమాటలు విన్న లక్ష్మీదేవి "స్వామీ! నాకు ఈ శాపం ఇచ్చింది నాభర్తే.

శాపవిమోచనం చెప్పమంటే తనలాటి కుమారుణ్ణి నేను కనాలట. ఆయన వైకుంఠంలో ఉన్నాడు. నేనేమో ఇక్కడ భూలోకంలో గుర్రం రూపంలో ఉన్నాను. మరినాకు పుత్రోదయం కావటం ఎలాసాధ్యం? నువ్వే ఏదో ఒకదారి చూపాలి. అయినా ఇంకోమాట. ఒకసారి నా భర్త ధ్యానముద్రలో ఉండగా "స్వామీ అందరూ పూజించేది నిన్నేకదా! మరి నువ్వు ఎవరిని ధ్యానిస్తున్నావు?" అని అడిగాను. దానికి ఆయన నేను శివుణ్ణి ధ్యానిస్తున్నాను. అతడు నన్ను ధ్యానిస్తాడు. మాఇద్దరికీ భేదం లేదు అన్నాడు. అందుకని నిన్ను ధ్యానిస్తున్నాను. స్వామీ ఈ దుర్దశనుంచి నువ్వే నన్ను రక్షించాలి అన్నది.

అప్పుడు ఆపార్వతీవల్లభుడు లక్ష్మీదేవితో "నీభర్త అశ్వరూపుడై వస్తాడు. నీకు ఒక కుమారుడుపుడతాడు. వాడు ఏకవీరుడౌతాడు. అతని కారణంగానే ఆ వంశానికి హైహయ వంశము అని పేరువస్తుంది. అతణ్ణి హైహయుడు అనికూడా పిలుస్తారు. ఆ తరువాత నువ్వు నీభర్తతో కలసి వైకుంఠంలో సుఖంగా ఉంటావు. నీకు ఈ స్థితి రావటానికి అసలు కారణం నువ్వు పరదేవతను మరిచిపోవటమే. అందుకని ఈక్షణం నుంచీ ఆదేవిని ఏకాగ్రతతో ధ్యానించు. ఆమె దయవల్ల నీకు సర్వమూ శుభంకలుగుతుంది' ' అన్నాడు. లక్ష్మీదేవి పరమేశ్వరీ ధ్యానం చెయ్యటం మొదలు పెట్టింది.

శివుడు కైలాసానికి వెళ్ళి చిత్రరూపుడు అనే సేవకుణ్ణి పిలిచి "నువ్వు వైకుంఠానికి వెళ్ళి విష్ణువుకు లక్ష్మీదేవి నీకోసం ఎదురుచూస్తున్నది,తపస్సు చేస్తున్నది,పరితపిస్తున్నది. కాళిందీ నదీ సమీపాన పచ్చిక బయళ్ళలో తపస్సు చేస్తూ ఆపరమేశ్వరీ ధ్యానం చేస్తున్నది. నువ్వు వెంటనే మగ గుర్రంగావెళ్ళి ఆమె కోర్కెతీర్చు. ఆమెకు శాపవిమోచనం చెయ్యి" అని చెప్పి రమ్మన్నాడు.

శివుని మాటలు విన్న వెంటనే విష్ణువు మగ గుర్రంగా మారి కాళిందీ నదీతీరానికి పరుగులు తీశాడు. ఆవచ్చిన వాడు విష్ణువని గ్రహించి ఆడగుర్రం దాని దగ్గరకు వెళ్ళింది. ఆరెండు గుర్రాలూ కోరిక తీరేదాక ఆప్రదేశంలో తిరిగాయి. కొంతకాలానికి గుర్రం రూపంలో ఉన్న లక్ష్మీదేవి అందమైన కొడుకును కన్నది. అప్పుడు విష్ణువు లక్ష్మిని చూసి ఇంక ఈరూపం వదిలి, వైకుంఠానికి పద అన్నాడు. పిల్లవాడిని వదిలి వెళ్ళటానికి మనస్కరించలేదు లక్ష్మీదేవికి. ఆమె భర్తతో ఈపసికందును ఇక్కడ వదిలి వెళ్ళటానికి నామనసు అంగీకరించటంలేదు అంది.

దానికి విష్ణుమూర్తి "లక్ష్మీ! మన పిల్లవాడు దిక్కులేని వాడెలా అవుతాడు. యయాతి కుమారుడు తుర్వసుడు, మంచివాడు. పుత్ర సంతతి కోసం తపస్సు చేస్తున్నాడు.

అతడు వచ్చే వరకు ఈ పిల్లవాడికి ఏ ఆపదా రాకుండా రక్షణ కల్పిస్తున్నాను" అన్నాడు.

ఆ తరువాత విష్ణుమూర్తీ, లక్ష్మీదేవీ వైకుంఠానికి వెళ్ళిపోయారు.

యయాతీ దేవయానుల పుత్రుడు తుర్వసుడు. యయాతి శుక్రుని వల్ల శాపగ్రస్తుడై, తన ముసలితనాన్ని తీసుకుని తుర్వసుని యౌవనాన్ని తనకిమ్మని అడిగాడు. అందుకు తిరస్కరించాడు తుర్వసుడు. అందుచేత అతని వంశమువారు రాజ్యార్హులు కారని శపించాడు. తుర్వసుడికి పుత్ర సంతానం లేదు. అందుకని సంతానం కోసం విష్ణువును గూర్చి తపస్సు చేశాడు. విష్ణుమూర్తి ప్రత్యక్షమై వరం కోరుకోమనగానే తుర్వసుడు పుత్రుడు కావాలి అన్నాడు. అప్పుడు విష్ణుమూర్తి "రాజా! తమసా, కాళిందీ నదీ సంగమ స్థలంలో ఒక పిల్లవాడు ఉన్నాడు. వాణ్ణి తెచ్చి పెంచుకో" అన్నాడు.

తుర్వసుడు ఆనదీతీరానికి వెళ్ళి అక్కడ ఒక పిల్లవాణ్ణి చూశాడు. అతడి ఆనందానికి హద్దులు లేవు. లక్ష్మీనారాయణలకు నమస్కరించి ఆపిల్లవాణ్ణి తీసుకుని వెళ్ళి తన భార్యకు బహూకరించాడు. రాజదంపతులు ఆపిల్లవాడికి ఏకవీరుడు అని నామకరణం చేసి అల్లారుముద్దుగా పెంచారు. అతడు వేద వేదాంగాలు, శాస్త్రాలు, కత్తి యుద్ధము, ధనుర్విద్య పూర్తిగా అభ్యసించి మహావీరుడైనాడు. అతడే హైహయుడు.

ఈ రకంగా ఆదేవి కరుణ వల్ల హైహయ వంశము ప్రారంభమైంది.

# ౨౦. హైహయ క్రౌర్యం

పూర్వంకాలంలో లక్ష్మీదేవి శాపవశాన ఆడగుర్రంగా పుట్టి తమసానదీ, కాళిందీనదీ మధ్యప్రాంతంలోని పచ్చికబయళ్ళలో నివాసముంటూ శివుణ్ణి గురించి తపస్సు చేస్తోంది. కొంతకాలానికి ఆమె తపస్సు ఫలించి విష్ణువు మగ గుర్రంగా అవతరించాడు. వీరికి ఒకపిల్లవాడు కలిగాడు. అతడి పేరు ఏకవీరుడు. అతడు ఏకావళి అనే రాకుమార్తెను వివాహమాడాడు. వారికి పుట్టినవాడే కృతవీర్యుడు. ఇతని కుమారుడు కార్తవీర్యుడు. వీరి వంశం పేరు హైహయవంశం.

కార్తవీర్యుడు వేయి చేతులకలవాడు. మంచి బలపరాక్రమాలు గలరాజు. సుగుణ సంపన్నుడు. నిష్ఠా గరిష్టుడు. ఇతడు అనేక యజ్ఞాలు, యాగాలు క్రతువులు చేసి ఋత్విక్కులకు సమృద్ధిగా ధనమిచ్చాడు. దానితో బ్రాహ్మణులు బహు సంపన్ను లైనారు. కొంతకాలానికి కార్త వీర్యుడు మరణించాడు. అతని కుమారులు పాలకులయ్యారు. ధనాగారం లోని ధనమంతా ముందే కార్తవీర్యుడు దానధర్మాలు చేశాడు. అందుచేత ధనాగారం ఖాళీగా ఉంది. కార్తవీర్యుని కుమారులు చెప్పుకోతగ్గవీరులు కాదు. అందుచేత ధనం సంపాదించేశక్తి వారికి లేదు. వారు పురోహితుల దగ్గరకు వెళ్ళి మీదగ్గర ఉన్న ధనాన్ని మాకివ్వండి అన్నారు. వారు కార్తవీర్యుడు మాకు దానంగా ఇచ్చిన సొమ్మిది. దీన్ని మీకు ఇవ్వము. అన్నారు. ధనాగారంలో ధనం లేదు. ఆ ధనమంతా బ్రాహ్మణుల దగ్గర ఉన్నది . వారివ్వనంటున్నారు. అందుకని రాకుమారులకు బ్రాహ్మణులమీద విపరీతమైన కోపం వచ్చింది. దాంతో "పనికిరాని మాటలన్నీ మాతండ్రికి చెప్పి, మాడబ్బంతా దోచుకున్నారు. యజ్ఞాలు యాగాలు అనీ ధనాగారమంతా కొల్ల గొట్టారు. మీరు పెద్ద దొంగలు." అని తిట్టి వారిని చావగొట్టి వాళ్ళ దగ్గరున్న ధనాన్ని లాక్కుపోయారు.

రాకుమారులకు భయపడి కొంతమంది ధనాన్ని గోతుల్లో పాతిపెట్టారు. ఆ విషయం తెలిసిన రాకుమారులు బ్రాహ్మణులను తీవ్రంగా హింసించి వారు దాచిన ధనాన్ని లాక్కుపోయారు. చివరి ప్రయత్నంగా విప్రులు ధనాన్ని మూటలు కట్టి నెత్తిమీద వేసుకుని హిమాలయాలకు పారిపోయారు. ఈ విషయం చారులవల్ల తెలుసుకున్న హైహయులు హిమాలయాలకు వెళ్ళి అక్కడ వారిని పట్టుకుని బాది ధనాన్ని లాక్కొచ్చారు. కనిపించిన వాళ్ళని కనిపించినట్లుగా చంపేశారు. స్త్రీలను కూడా హింసిచారు. గర్భవతులైనవారి గర్భాలు నిలువునాచీల్చేశారు.

ఈ రకంగా బ్రాహ్మణులకు కార్తవీర్యుడు ఇచ్చిన ధనం లాక్కోవటమే కాకుండా వారిని నానాహింసలకు గురి చెయ్యటము, చంపెయ్యటమూ జరుగుతోంది. దాంతో వారు తమ దుస్థితికి చాలా దుఃఖించి గంగానది వద్దున పార్వతీదేవి విగ్రహాన్ని స్థాపన చేసి ఆ పరమేశ్వరిని ప్రార్థించారు. హైహయులు ఎలాగూ తమను చంపేస్తారు. ఈరకంగా ధ్యానంలో ఉండగా చస్తే పుణ్యలోకాలయినా దక్కుతాయని వారి భావన.

వారి ప్రార్థన మన్నించి ఆపరమేశ్వరి ప్రత్యక్షమై, గర్భవతులైన స్త్రీలనుద్దేశించి మీలో ఒకరికి ఊరువుల నుంచి బిడ్డ పుడతాడు. వాడివల్ల మీ ఆపదలు గట్టెక్కుతాయి అని దీవించింది.

కొంత కాలానికి ఒక స్త్రీతొడను చీల్చుకుని పిల్లవాడు పుట్టాడు. అంతలో హైహయులు వీళ్ళిక్కడున్న విషయం తెలిసి, వాళ్ళని చంపటానికి వచ్చారు. సూర్యతేజస్సుతో ఉన్న ఆబాలుడి ముఖం చూడగానే హైహయుల కళ్ళు కనిపించకుండా పోయినాయి. ఆ శిశువు వల్లనే తమకళ్ళుపోయినాయని గ్రహించి, ఆ పిల్లవాడి తల్లి పాదాలు పట్టుకుని "అమ్మా! మీ మహిమ వల్లే మాకళ్ళు పోయినాయి. ఇంతవరకు మీగురించి తెలియక ఈ రకంగా పొరపాటు చేశాము. క్షమించండి. ఇకనుంచీ మీకు ఏరకమైన కష్టమూ కలిగించము. లాక్కున్న మీ ఆస్థిపాస్థులు మీకు ఇచ్చేస్తాము. మా కళ్ళు మాకిప్పించండి. ఈ గుడ్డి బతుకు మేం బతకలేము". ని వేడుకున్నారు. అందుకు ఆ తల్లి " రాకుమారులారా! నేను మీకేం చెయ్యలేదు. ఈబాలుడు పరమేశ్వరి వరప్రసాదంగా పుట్టాడు. వాడికి హాని తలపెట్టినందువల్లనే మీకళ్ళుపోయాయి. ఇదంతా ఆ పరమేశ్వరి లీల. కాబట్టి మీరు ఆ దేవిని ప్రార్థించండి. మీ కళ్ళు మళ్ళవస్తాయి" అన్నది.

హైహయులు ఆపరమేశ్వరిని, ఆమె అనుగ్రహం పొందిన బాలుణ్ణి పరిపరి విధాల స్తుతించగా, అంబ కరుణించి వారికి మళ్లీ చూపు ప్రసాదించింది.

# 21. ఏకావళి

విష్ణుమూర్తి, లక్ష్మీదేవి గుర్రాల రూపంలో తమసానదీ దీరంలో విహరించినప్పుడు వారి నోముల పంటగా కలిగిన వాడు ఏకవీరుడు. ఇతణ్ణి యయాతి, దేవయానిల కుమారుడైన తుర్వసుడు పెంచి పెద్ద చేసి, రాజ్యానికి పట్టాభిషేకం చేసి అడవులకు వెళ్ళిపోయాడు.

ఏకవీరుడు చక్కగా పాలనచేస్తూ ప్రజలను కన్నబిడ్డలలాగా కాపాడుతున్నాడు. ఒకరోజు మంత్రి కుమారునితో కలిసి గంగా నదీతీరానికి విహారానికి వెళ్ళాడు. అక్కడ తిరుగుతుండగా గంగానదిలో ఒకచోట నూరు రేకులు గల తామరపువ్వు కనిపించింది. దానికి దగ్గరలో ఒక సుందరాంగి గోచరించింది. ఈ జవ్వని ఒంటరిగా ఇక్కడ ఏంచేస్తోంది? అని అనుమానం వచ్చి ఆమె దగ్గరకు వెళ్ళాడు. ఆమె చాలా విచారంగా ఉన్నట్టు కనిపించింది. ఏకవీరుడు ఆమెను "సుందరాంగీ! ఎవరునువ్వు? ఇక్కడ ఒంటరిగా ఎందుకున్నావు? నీవిచారానికి కారణం ఏమిటి"? అని అడిగాడు. దానికి ఆమె ఈ దేశానికి పొరుగురాజు రభ్యుడు. అతని భార్య రుక్మరేఖ. వారికి పిల్లలు లేరు. అందుచేత సంతానం కోసం రాజు దేవీయజ్ఞం చేశాడు. అప్పుడు యజ్ఞకుండం లోనుంచి బొమ్మ లాంటి పాప ఒకతె బయటకువచ్చింది. ఆ పిల్లను దేవీ వర ప్రసాదంగా స్వీకరించి, ఏకావళి అని నామకరణం చేసి అల్లారుముద్దుగా పెంచుకున్నాడు.

నేను ఆ రాజు మంత్రికుమార్తెను. నాపేరు యకోవతి. నేను ఏకావళి ఒకే వయసువాళ్ళం. అందుచేత రాజు మా ఇద్దరినీ సమానంగా చూస్తూ ఉండేవాడు. మేముకూడా మంచి స్నేహితులం అయ్యాము.

ఏకావళికి మంచి వాసన వచ్చే పద్మాలంటే ప్రాణం. వాటికోసం ఎప్పుడూ గంగానదికి వచ్చి వాటితో ఆడుకుంటూ ఉండేది. ఈ విషయం తెలిసి రాజు కోటలోనే ఒక సరస్సు ఏర్పాటు చేసి అందులో పద్మ లతలను నాటించాడు. కూతుర్ని పిలిచి నీకు కావలసిన పద్మాలు ఇక్కడే ఉన్నాయి. గంగానది ఒడ్డుకుపోవద్దు అన్నాడు.

ఏకావళి తండ్రిమాట వినలేదు. యధాప్రకారం గంగఒడ్డుకు వెడుతూనే ఉంది. ఒక నాడు తనూ, నేను, కొంతమంది పరిచారికలు రక్షకభటులూ వెంటరాగా గంగఒడ్డుకు వచ్చాము. అందరం నదిలోని ఆ పద్మాలతో ఆటలాడు తున్నాము. ఇంతలో కాలకేతు అనే రాక్షసుడు వచ్చి ఏకావళినీ, నన్నూ తన వాహనం మీద కూచోపెట్టుకుని పారిపోయాడు. మమ్మల్ని ఒక భవనంలో ఉంచి దానికి గట్టి కాపలా కూడా ఏర్పాటు చేశాడు. ఆ పట్టణం పాతాళంలో ఉంది. ఒకనాడు రాక్షసుడు నన్ను విడిగా తీసుకువెళ్ళి "మీ స్నేహితురాలు గనుక నన్ను వివాహమాడితే సుఖపడుతుంది. విషయం ఆమెకు చెప్పి ఒప్పించు" అన్నాడు. అది జరిగేపనికాదు. పిచ్చి ఆలోచనలు మానుకుని బుద్ధిగా

మమ్మల్ని వదిలెయ్యి అన్నాను. అప్పుడు వాడే ఏకావళితో పెళ్ళి ప్రస్తావన తెచ్చాడు. దానికి ఆమె "నేను హైహయుణ్ణి ప్రేమించాను. అతడికీ నాకూ వివాహమౌతుందని పరమేశ్వరి వరమిచ్చింది. అతణ్ణితప్ప ఇంకెవర్నీ కన్నెత్తి కూడా చూడను" అంది.

ఈ మాట వినగానే నాపేరే హైహయుడు, అంతకాపలా ఉన్న భవనం నుంచి నువ్వెలారాగలిగావు? నన్ను ఆనగరానికి చేర్చు. నేను ఆరాక్షసుణ్ణి సంహరించి ఏకావళిని రక్షిస్తాను. అన్నాడు ఏకవీరుడు.

యశోవతికి చిన్నతనంలో దత్తాత్రేయుడు త్రిలోకతిలకం అనే మంత్రాన్ని ఉపదేశించాడు. ఆమంత్రప్రభావంతో ఎక్కడికైనా వెళ్ళచ్చు. దాని ప్రభావంతోనే ఇప్పుడు రాక్షసుడి భవనం నుంచి ఇక్కడికి రాగలిగింది. యశోవతి ఏకవీరుడితో రాకుమారా! రాత్రి పరమేశ్వరి దర్శనమిచ్చి తెల్లవారగానే గంగానదీతీరానికి వెళ్ళు. అక్కడకు హైహయుడు వస్తాడు. అతడి వల్ల కాలకేతుమరణిస్తాడు. ఏకవీరుడికీ, ఏకావళికీ వివాహమవుతుంది. అనిచెప్పింది. ఇప్పుడు నువ్వే ఏకవీరుడవని చెప్పావు.వెంటనే బయలుదేరు. కాలకేతుని సంహరించి ఏకావళిని రక్షించు. అని దత్తాత్రేయుడు తనకుపదేశించిన మంత్రం ఏకవీరుడికి ఉపదేశించిది. మరుక్షణంలో వారు కాలకేతు పట్టణం చేరారు.

పరమేశ్వరి దయవల్ల ఏకవీరుడికి సైన్యం సమకూరింది. ఏకవీరుడికీ, కాలకేతుకూ మధ్య భీకరమైన పోరు జరిగింది. ఆయుద్ధంలో రాక్షసుడి సేనలు హతమై పోయినాయి. ద్వంద్వయుద్ధంలో ఆ రాక్షసుడి తలతెగి అవతలపడింది. ఏకవీరుడు యశోవతి, ఏకావళి సమేతంగా గంగానదీ తీరానికి వచ్చి ఏకావళిని ఆమె తండ్రికి అప్పగించాడు.

రభ్యుడు తనకుమార్తెను ఏకవీరుడికిచ్చి వైభవంగా పెళ్ళి జరిపించాడు. వారికి కృతవీర్యుడు అనే కుమారుడు కలిగాడు. అతడి కుమారుడే కార్తవీర్యుడు.

ఈ విధంగా ఏకావళి పరమేశ్వరి కరుణవల్ల రాక్షసుడి బారినుండి బయట పడి ఏకవీరుణ్ణి వివాహమాడింది.

# 22. నారద సంతానం

ఒకప్పుడు నారదుడు సత్యలోకం నుంచి బయలు దేరి విష్ణు దర్శనం చేసుకోవాలనే సంకల్పంతో వైకుంఠం చేరాడు. అక్కడ పీతాంబరాలు, శంఖుచక్రగదా పద్మాలు ధరించి, రకరకాల ఆభరణాలతో ఆదిశేషుని మీద శ్రీమహావిష్ణువు శయనించి ఉన్నాడు. శ్రీదేవి అతడి పాదాలు వత్తుతున్నది. నీలమేఘశ్యాముణ్ణి సమీపించాడు నారదుడు. నారదుణ్ణి చూడగానే చప్పున లేచి లోపలికి వెళ్ళిపోయింది లక్ష్మీదేవి.

నారదుడు సన్యాసి. అందులోనూ మహర్షిను మాయను జయించినవాడని ప్రతీతి. మరి అతణ్ణి చూసి లక్ష్మీలోపలికి వెళ్ళిపోయిందెందుకని? అదే మాటను విష్ణుమూర్తిని అడిగాడు నారదుడు. దానికి శ్రీ మహావిష్ణువు "నారదా పతివ్రత అయిన ఇల్లాలు పరునిముందు ఉండదు. అది గృహిణి ధర్మం. ప్రపంచంలో ఎంతటి వివేకవంతులైనా మాయకు లోబడి ఉండేవారే. సామాన్య మానవులైనా, మునులైనా, ఋషులైనా, దేవతలైనా చివరకు హరిహరబ్రహ్మాదులైనా సరే మాయకు లోబడి ఉండవలసినదే. ఆపరమేశ్వరి యొక్క ప్రతిరూపం మాయ. ఆవిడకు ఈజగత్తు సర్వమూ అధీనమయి ఉంటుంది. పండితులూ,పామరులూ,యోగులూ అందరూ దానికి బద్ధులే. మాయ ఈరకంగా ఉంటుందని చెప్పలేము. అన్ని రూపాలూ దానివే" అన్నాడు. ఆ మాటలు విన్న నారదుడు సంసారబంధంలో చిక్కిన నీబోటివారికి తప్పదు. కానీ సన్యాసిని పైగా మహర్షిని అయిన నాకుకూడా మాయతప్పదా? అన్నాడు.

విష్ణుమూర్తి చిన్నగానవ్వి కొంచెంసేపాగి 'నిజమే నారదా! నీబోటి సన్యాసిని మాయ ఏంచెయ్యలేదు. నీవు మాయకు అతీతుడవు కదా!అన్నాడు. నారదుడు నిజమే అన్నట్టుగా నవ్వేశాడు. అంతలో గరుడ వాహనం వచ్చింది. విష్ణుమూర్తి దానిమీదకెక్కి రా నారదా! అన్నాడు. ఇద్దరూ ఎక్కినతరువాత గాలిలోకి లేచాడు గరుడుడు.

అడవులు, కొండలు, నదులు దాటుకుంటూ చాలాదూరం వెళ్ళి ఒకవనంలో ఆగింది గరుడ వాహనం. దానిమీదనుంచి ఇద్దరూ దిగాక విష్ణువు అన్నాడు. "చూడు నారదా! ఈ పట్టణం ఎంతఅందంగా ఉన్నదో! మనం ఇంతవరకూ ఎప్పుడూ చూడలేదు. అంత రమణీయంగా ఉంది. ఈ వనం కూడా చాలా చక్కగా ఉన్నది. చల్లని గాలి వీస్తోంది. గలగలాపారే ఈసెలయేరు. నారదా ముందుగా ఈ సెలయేట్లో స్నానం చేసి, సేద తీర్చుకుని, ఇక్కడి ఫలాలు ఆరగించి ఆ తరువాత ఆ పట్టణంలోకి వెడదాం. ముందుగా నువ్వు స్నానం చేసిరా ఆతరువాత నేను చేస్తాను" అన్నాడు.

ఆ మాటలు విన్న నారదుడు ఆ పరిసరాల అందచందాలకు ముగ్ధుడౌతూ సరే అని తన వీణ, లేడిచర్మము, రుద్రాక్షలు ఒకచెట్టుక్రింద పెట్టి ఆచారప్రకారం కాళ్ళు చేతులూ కడుక్కుని ఆచమనం చేసి నీటిలోకి దిగి ఒక మునుగు మునిగాడు. పైకి లేచేసరికి ఏముంది? ఒక స్త్రీ అయిపోయాడు. ఒక్కసారి ఒళ్ళంతా చూసుకున్నాడు. నిజమే తాను స్త్రీయే. ఒడ్డున చెట్టు కింద తన కృష్ణాజినము. రుద్రాక్షలు,వీణ లేవు విష్ణుమూర్తి గరుడ వాహనం కూడా లేవు. అంతా వింతగా ఉంది. ఇప్పుడేంచెయ్యాలి? కాలం గడుస్తున్న కొద్దీ తాను నారదుణ్ణనే విషయం గుర్తుండటంలేదు. సెలయేట్లోంచి బయటకు వచ్చాడు. ఒక చెట్టు క్రింద కూర్చున్నా పాత జ్ఞాపకాలు పూర్తిగా పోయినాయి. ఇప్పుడు తానొక స్త్రీ. అందమైన అతివ. అంతే ఏమీ తెలియటంలేదు.

తాళధ్వజుడనే మహారాజు సపరివారంగా అటు వైపు వెడుతూ చెట్టుక్రింద ఒంటరిగా కూర్చున్న స్త్రీ ని చూసి, ఆమె అపురూప సౌందర్యానికి ముగ్ధుడై, ఆమెను సమీపించి "లలనా! ఎవ్వరు నువ్వు? నా కోసం దేవలోకం నుంచి దిగివచ్చిన దేవకన్యవా?గంధర్వకాంతవా? లేక అప్సరాంగనవా? నన్ను వివాహమాడు. సుఖించు. జీవితాంతం నీ అడుగులకు మడుగులొత్తుతాను. నన్ను కటాక్షించు" అన్నాడు. దానికి ఆ స్త్రీ మీకెలా మంచిదనిపిస్తే అలా చేయండి అన్నది.

అన్నదేతడవుగా తాళధ్వజుడు ఆస్త్రీని తన నగరానికి తీసుకుపోయి వివాహమాడాడు. వారి జీవితం సుఖశాంతులతో, ఆనందంగా గడచి పోతోంది. వారికి పదిమంది కుమారులు కలిగారు. వాళ్ళకి పెళ్ళి చేశారు. కొడుకులు, కోడళ్ళు, మనమలు అబ్బో !ఇల్లంతా ఒకటే సందడి.

ఇలా ఉండగా ఒకనాడు దూరదేశపు రాజు ససైన్యంగా వచ్చి తాళధ్వజుడి మీద యుద్ధం ప్రకటించాడు. తాళధ్వజుడు, అతని కుమారులు, అందరూ యుద్ధానికి వెళ్ళారు. పోరు ఘోరంగా సాగింది. ఆ యుద్ధంలో తాళ ధ్వజుడుని కుమారులు, మనుమలు అందరూ మరణించారు. తాళధ్వజుడు మాత్రం ప్రాణాలరచేత పట్టుకుని పారిపోయాడు.

కొడుకులు, మనుమలు అంతా మరణించారన్న వార్త విని తాళధ్వజుని భార్య గుండెలవిసేలా విలపించింది. ఆ బాధను తట్టుకోలేక నేలమీదపడి పొర్లిపొర్లి ఏడుస్తోంది.

అంతలో ఒక ముసలి బ్రాహ్మణుడు వచ్చి "అమ్మా! ఎందుకు ఏడుస్తావు. పుట్టిన ప్రతివాడు మరణించక తప్పదు. మరణించిన ప్రతివాడూ మళ్ళీ పుట్టకా తప్పదు.

అంతా మాయ. ఎవరి కాలం పూర్తయితే వారు వెళ్ళిపోతారు. నువు ఎక్కడినుంచి వచ్చావో నీకు తెలుసా? ఎంతమంది ఈ ఇంటికి వచ్చారు? ఎంతమంది వెళ్ళారు? చావుపుట్టుకలు దైవాధీనాలు. ఈ జగత్తు అంతా మిథ్య. ఏడవకు. పోయిన వాళ్ళకు కర్మలు చేయించాలి కదా! వెళ్ళి ఆసెలయేట్లో స్నానం చేసిరా "అన్నాడు.

తాళధ్వజుని భార్యమంత్రం వేసినట్టుగా ఆబ్రాహ్మణుడి వెంట వెళ్ళి నీటిలో మునిగి పైకి లేచేటప్పటికి ఏముంది? ఎదురుగా చెట్టుకింద విష్ణుమూర్తి ప్రక్కన తన కృష్ణాజనం, వీణ, రుద్రాక్షలు. ఇప్పుడు జరిగినదంతా విష్ణుమాయ అనుకున్నాడు నారదుడు. నీళ్ళలోంచి పైకి లేస్తుండగా పిలిచాడు విష్ణువు ఎంతసేపు నారదా! త్వరగారా!

బయటకు వచ్చిన నారదుడు కృష్ణాజినం, రుద్రాక్షలు, వీణ తీసుకుంటుండగా తాళధ్వజుడు వచ్చి విష్ణువును చూసి "స్వామీ, నన్ను కరుణించు, నాభార్య అంటే నాకుప్రాణం.ఆమెకు నేనన్నా అంతే. మేం ఒకరినొకరు విడిచి బ్రతకలేము. నాభార్యని మునీశ్వరుడుగా చేసి తీసుకెళ్ళిపోవటం నీకు ధర్మమా! రక్షించు ప్రభూ! కటాక్షించు. నాభార్యను నాకు ఇచ్చెయ్యి" అన్నాడు.

అప్పుడు విష్ణువునారదుడి వైపు తిరిగి ఇతడెవరు నారదా! నిన్ను పట్టుకుని తన భార్య అంటాడు. అనేసరికి నారదుడు "తాతా క్షమించు. నేను సన్యాసిననీ మాయను జయించాననీ అహంకరించాను. మాయ పరమేశ్వరి స్వరూపము. ఆమెకు అందరూ అధీనులే. పరమేశ్వరి పట్ల అజాగ్రత్తగా మాటాడినందుకు తగినశాస్తి జరిగింది."అన్నాడు. పరాత్పరిస్వరూపమే మాయ .మాయను ఎవరూ జయించలేరు.

# 23. సుకన్య

మరీచి బ్రహ్మమానసపుత్రుడు. ఇతడికి కర్దముని పుత్రిక అయిన కళ అను కన్యతో వివాహమయింది. ఇతడి కుమారుడు కశ్యపుడు. కశ్యపుడు పుత్రసంతానం కోసం మద్యపానం చేశాడు. అందుకని దక్షప్రజాపతి ఇతణ్ణి శపించాడు. దానికి పరమేష్టి కోపించి దక్షుని కుమార్తెలను కశ్యపునికి ఇచ్చి వివాహం చెయ్యమన్నాడు. అప్పుడు దక్షప్రజాపతి తన కుమార్తెలయిన

| | |
|---|---|
| 1. దితి | 7. అదితి |
| 2. దనువు | 8. కాల |
| 3. అనాయువు | 9. సింహిక |
| 4. క్రోధ | 10. పృధ |
| 5. విశ్వ | 11. వినత |
| 6. కపిల | 12. కద్రువ |

అనేవారిని కశ్యపునికి ఇచ్చి వివాహంచేశాడు. వీరివలన దేవతలు, రాక్షసులు., యక్షులు, కిన్నెరలు, కింపురుషులు, సిద్ధులు, సాధ్యులు, నాగులు, మానవులు, పశువులు, పక్షులు మొదలైన వివిధజాతులు సృష్టింపబడ్డాయి. ఈరకంగా కశ్యపుడివల్ల ఏర్పడింది కాబట్టి ఈసృష్టికి కాశ్యపి అని పేరు వచ్చింది. దేవతలలో పేరు ప్రఖ్యాతున్నవాడు వివస్వంతుడు. అతడే సూర్యుడు. ఇతని భార్య సంజ్ఞాదేవి. వివస్వంతుని కుమారుడు వైవస్వతుడు. అతని పేరు శ్రాద్ధదేవుడు. ఇతడు మనువులలో ఏడవవాడు. ఇతని కాలంలో ఓజస్వి అనే వాడు ఇంద్రుడుగా ఉన్నాడు. ఆకాలంలో
1.అత్రి 2.వసిష్ఠుడు 3.కాశ్యపుడు 4.గౌతముడు 5. భరద్వాజుడు 6.విశ్వామిత్రుడు 7.జమదగ్నిఅనేవారు సప్తఋషులు. శ్రాద్ధదేవుడికి శ్రద్ధాదేవి అనే స్త్రీతో వివాహం జరిగింది. ఆమెవలన

| | |
|---|---|
| 1.ఇక్ష్వాకువు | 6.వృషధ్రుడు |
| 2.నాభాగుడు | 7.వసుమంతుడు |
| 3.దృష్టుడు | 8.అరిష్వంతుడు |
| 4.సంయాతి | 9. పృషపదుడు |
| 5.కరుషుడు | |

అను కుమారులు పుట్టారు. వీరిలో పెద్దవాడు ఇక్ష్వాకువు. అతని పేరుతోనే ఆవంశానికి ఇక్ష్వాకువంశము అనిపేరు వచ్చింది. ఇతడికి వందమందిసంతానం. వీరిలో మొదటివాడు వికుక్షి. అతని కుమారుడు శర్యాతి. ఈరకంగా సూర్యవశం అభివృద్ధి చెందింది.

శర్యాతికి గుణవతి యందు అనర్తనుడు అనే కుమారుడు, సుకన్య అనే కుమార్తె పుట్టారు. సుకన్య చాలా అందగత్తె. గుణవంతురాలు. శర్యాతి బార్యలందరూ ఆ బాలికను అల్లారు ముద్దుగా, తమ సొంతకూతురు లాగానే పెంచుకోసాగారు. కాలక్రమేణా సుకన్య పెరిగి పెద్దదయింది. అమె చదువు, సంగీతము, నాట్యము వంటికళలందు కూడా ప్రావీణ్యం సంపాదించింది.

బ్రహ్మమానస పుత్రుడు భృగువు. ఇతని భార్య పులోమ' . వీరికుమారుడు చ్యవనుడు. ఒకనాడు పులోముడు అనే రాక్షసుడు పంది రూపంలోవచ్చి భృగుపత్నిని ఎత్తుకు పోయాడు. అప్పుడు ఆమె గర్భవతి. ఆ గర్భంలో బాలకుడైన చ్యవనుడు బైటకు జారి రాక్షసుడి వంక తీవ్రంగా చూశాడు. ఆ చూపులవేడికి పులోముడు బూడిద అయిపోయాడు.

చ్యవనుడు పరమేశ్వరి భక్తుడు. సర్వకాల సర్వావస్థలలోను పరమేశ్వరీ ధ్యానంతోనే కాలం గడుపుతుండేవాడు. ఆ బాలకుడు పెద్దవాడై పరమేశ్వరిని గురించి ఘోరతపస్సు చేశాడు. శర్యాతి పట్టణానికి దగ్గరలోనే ఒక అడవి, దానిలో పెద్దచెరువు ఉన్నాయి. ఆ పరిసర ప్రాంతమంతా పూలు, పళ్ళు కాచే చెట్లతో చూడటానికి ఎంతో ఆహ్లాదంగా ఉంటుంది. నీడనిచ్చేపెద్దపెద్ద చెట్లు అక్కడ అనేకం ఉన్నాయి. అనేక రకాల చిన్న, పెద్ద జంతువులు తిరుగుతున్నాయి. అటువంటి ప్రదేశంలో ఒక చెట్టుకింద చ్యవనుడు ఆ జగజ్జనని గురించి తపస్సుచేస్తున్నాడు. చాలా కాలంగా అతడు నిశ్చలంగా అక్కడ ఉండటంచేత అతని చుట్టూ మట్టిపుట్టలు పెరిగాయి. ఆపుట్టలలో పాములుకూడా తిరుగుతున్నాయి. చ్యవనుడు ఇవేవీ పట్టించుకోలేదు. పరమేశ్వరి గురించి తీవ్రంగా తపస్సు చేస్తున్నాడు.

శర్యాతి ఒకనాడు భార్యాపిల్లలతో ఆవనానికి విహారానికి వచ్చాడు. రాకుమార్తె సుకన్య అక్కడ పూలు ఏరుకుంటూ ఆపుట్టదగ్గరకు వెళ్ళింది. అది ఆబాలికకు వింతగా కనిపించి మరీ దగ్గరగా వెళ్ళింది. ఆ పుట్టలో మిణుకుమిణుకు మని మెరుస్తూ రెండు మెరుగులు కనిపించాయి. అవి కదలటం లేదు. ఏమిటో తెలియలేదు. సుకన్య చిన్నగా ప్రక్కనేఉన్న కర్రపుల్లని తీసిమెరుస్తున్న వాటిని ఒక్కపోటు పొడిచింది. వెంటనే కెవ్వుమని కేక వినిపించింది పుట్టలోంచి. ఆ మెరుస్తున్నవి చ్యవనుడి కళ్ళు. ఆ కళ్ళనే సుకన్య పుల్లతో పొడిచింది. ఆబాధకి చ్యవనుడు పెద్దగా కేక పెట్టాడు. ఆ అరుపువిని భయపడిన సుకన్య ఏమీ ఎరగనట్టుగా పరుగెత్తుకుంటూ వచ్చి చెలులతో కలిసిపోయింది.

శర్యాతి తన రాణులతో కులాసాగా గడుపుతూ ఒక చెట్టుక్రింద విశ్రమించాడు. ఇంతలో సేవకులు వచ్చి ప్రభూ! మన పరివారం అంతా మలమూత్రాలు బంధింపబడి బాధపడుతున్నారు "అని విన్నవించారు. రాజుచుట్టూఉన్నఅంతఃపుర జనం కూడా అదే బాధను వ్యక్తంచేశారు. ఏంచెయ్యాలో తోచలేదు రాజుకు. సపరివారంగా బయలుదేరి

ఉన్నపళంగా రాజ్యానికి వచ్చేసి మంత్రులను పిలిచి జరిగిన విషయం వివరించి ఇలా జరగటానికి కారణం ఏమిటో విచారించమన్నాడు. ఇంతలో సుకన్య వచ్చి జరిగినదంతా తండ్రికి వివరించి దానివల్లనే ఈ అనర్థం జరిగిందేమోనని విచారం వెలిబుచ్చింది. వెంటనే శర్యాతి మంత్రులను, సేనలును వెంటపెట్టుకుని ఆపుట్టదగ్గరకు వెళ్ళి,దానికి ప్రదక్షిణంచేసి, సాగిలపడి నమస్కారం చేశాడు. ఆతరువాత మంత్రులసలహాపై అతి జాగ్రత్తగా పుట్టను త్రవ్వించాడు. అప్పుడు ఆపుట్టలోనించి మెల్లమెల్లగా ఎముకల గూడుమీద చర్మంకప్పబడి ఉన్న ఒక మానవదేహం పద్మాసనంలో కూచుని కనిపించింది. జుట్టు అంతా జడలు కట్టి ఉంది. అఖండమైన తపస్సువల్ల అతని ముఖం బ్రహ్మతేజస్సుతో ప్రకాశిస్తోంది. కాని అతడి పెద్ద పెద్దకనులు పుల్లతో పొడవడంవల్ల రక్తంకారుతున్నాయి.

అదిచూసిన శర్యాతి చాలా బాధపడుతూ "మునీంద్రా నాకూతురు చాలా పెద్దతప్పుచేసింది. మమ్మల్ని క్షమించు" అన్నాడు. దానికి ఆతపసి "రాజా! జరిగిందేదో జరిగిపోయింది. అంతా విధిలిఖితం. నాకేం కోపంలేదు. కాని అసలే పెద్దవాణ్ణి. అందులో కళ్ళు కూడా లేవు. ఏంచేస్తాను. అన్నాడు.అందుకు శర్యాతి మంచి నమ్మకమైన సేవకులను పంపుతానన్నాడు. దానికి చ్యవనుడు అలా కాదు. అందరకీ మేలు జరగాలంటే ఒకటే మార్గం. నీ కుమార్తెను నాకిచ్చి వివాహంచెయ్యి" అన్నాడు.

ఆమాటకు శర్యాతి గుండె ఆగినంతపనైంది. అసలే తాపసి. ఉండటానికి ఇల్లులేదు. కట్టటానికి బట్టలేదు. తినటానికి పట్టెడు తిండైనాలేదు. ముసలివాడు. అందునా గ్రుడ్డివాడు. తన కూతురు అసమానసౌందర్యరాశి. గుణవంతురాలు. విద్యావంతురాలు. అల్లారుముద్దుగా పెరిగింది. ఇతనితో వివాహంచేస్తే ఆపిల్ల జీవితం ఏమౌతుంది? అని ఆలోచిస్తూ లోలోపలే కుమిలిపోతూ తనపట్టణానికి వెళ్ళిపోయి మంత్రులతో ఆలోచించాడు. ఏంచెయ్యటానికీ పాలుపోవటంలేదు. సుకన్యను ఇచ్చి వివాహంచెయ్యమంటాడు చ్యవనుడు. అది ఏమాత్రం ఇష్టంలేదు రాజుకు, అంతఃపురంలో ఉన్న సుకన్యకు విషయం తెలిసి తండ్రిదగ్గరకు వచ్చి' జనకా! తప్పు నావల్ల జరిగింది. నావల్లే సరికావాలి. అందుకని ఆమునీశ్వరుడికి నన్నిచ్చి వివాహం చెయ్యి మీరంతా సుఖంగా ఉంటారు''అంది. ఆమాటలకు తండ్రిగాని, మంత్రులుగాని ఏమాత్రం అంగీకరించలేదు. అప్పుడా బాలిక తండ్రీ! అందచందాలు, వయస్సు, వైభవమూ ఏవీ శాశ్వతంకాదు. వయసుతోపాటే అందచందాలూ పోతాయి. ఇక వైభవమంటావా! అది పరమేశ్వరి అనుగ్రహం. బళ్ళు ఓడలు, ఓడలు బళ్ళు కావచ్చు. ఎవరి ముఖాన ఏంరాసుంటే అదే జరుగుతుంది. నా నుదుటన ఏరాత రాసుందో?. కాబట్టి ఏం ఆలోచించక నన్ను ఆమునీశ్వరుడికి సమర్పించు''అంది. చేసేది లేక శర్యాతి చ్యవనుడి వద్దకు వెళ్ళి అతడికి తన కుమార్తెనిచ్చి వివాహం చేశాడు. సుకన్య ఆభరణాలు, పీతాంబరాలు విసర్జించి నారచీరెలు ధరించి మునిపత్ని లానే తయారయింది.

సుకన్య పేరుకు తగ్గట్టుగానే మంచి నడవడితో మసలుతోంది. ఉదయాన్నే కాలకృత్యాలు, స్నానం పూర్తిచేయించి సంధ్య, అగ్ని కార్యము నిర్వర్తింపచేసి, సేకరించిన అడవి బియ్యం దంచి అన్నం వండి భర్తకు పెట్టి తాను తిని, మిగిలిన సమయంలో అతనికి సేవలు చేస్తుండేది. పర్ణశాలకు వచ్చే అతిథులకు సత్కారాలు చేస్తుండేది.

ఒకనాడు ఆశ్రమం దగ్గరలో ఉన్న చెరువులో స్నానం చేసి తిరిగివస్తున్న సుకన్యను అశ్వనీ దేవతలు చూసి ఆమె సౌందర్యానికి ముగ్ధులై, వివరాలు తెలుసుకుని ఆమెతో ఓబాలామణీ! మేము వైద్యులం. ఎలాటి రోగాన్నైనా క్షణంలో తగ్గించగలం. నీభర్తకు కళ్ళు తెప్పించి సుందరాకారుడిగా, యౌవనవంతుడుగా చేస్తాం, ఆతరువాత నువు మాముగ్గురిలో ఒకరిని వరించాలి"అన్నారు. తన భర్త సుందరాకారుడు, యౌవనవంతుడు అవటం బాగానేఉంది. కాని ఈషరతు ఇబ్బందికరంగా ఉంది. ఏంచెయ్యాలో తోచలేదు. ఆశ్రమానికి పోయి భర్తతో విషయం చెప్పింది. ఆలోచించాడు. వారు దేవతలు. వారి మాటకాదనకూడదు. అందుకని వారిని ఆశ్రమానికి తీసుకురా! అన్నాడు చ్యవనుడు.

సుకన్య అశ్వనీదేవతల దగ్గరకు వెళ్ళి ఆశ్రమానికి రమ్మని ఆహ్వానించి తన భర్తను యౌవనవంతుని చెయ్యమంది. దానికి అశ్వనీ దేవతలు సుందరీ! నీభర్తమాతో బాటుగా ఆచెరువులో దిగి స్నానం చేస్తే అతడికి రూపము, యౌవ్వనము, కళ్ళుకూడా వస్తాయి'' అన్నారు. భర్తమాటమీద సుకన్య చ్యవనుణ్ణి చెరువు దగ్గరకు తీసుకువెళ్ళింది. అశ్వనీ దేవతలు చ్యవనుడి రెండుచేతులూ పట్టుకుని అతనితో పాటు తాముకూడా చెరువులో మునిగారు. ముగ్గురూ ఒక్కసారిగా పైకిలేచారు.

ఆశ్చర్యం ముగ్గురిదీ ఒకే రూపం, ఒకే కంఠస్వరం. ఒకేపోలిక. ఒకేవయస్సు. వాళ్ళని చూసిన సుకన్యకు ఆనందాశ్చర్యాలతో నోటమాట రాలేదు. అప్పుడు వారిలో ఒకడు సుకన్యా! ఇప్పుడు నువ్వు మాముగ్గిరిలో ఎవరిని వరించినా మాకు సంతోషమే" అన్నాడు. ముగ్గురూ ఒకలాగే ఉన్నారు. అందులో తన భర్త ఎవరో ఎలా తెలుస్తుంది? ఒకవేళ తను అనుకున్న వ్యక్తి తన భర్తకాకపోతే అంతకన్నా నీచం ఇంకేమయినా ఉందా? ఇహపరలోకాలలో చోటుకూడా ఉండదు. ఈరకంగా ఆలోచించి ఇంకవేరే దిక్కులేదని నిర్ణయించుకుని ఆపరమేశ్వరిని పరిపరి విధాల ప్రార్థించింది.

ఆతల్లి కరుణించి సుకన్యకు తనభర్తను గుర్తించే శక్తి ప్రసాదించింది. సుకన్య తన భర్తను గుర్తించగానే వారు ఆమె పాతివ్రత్యాన్ని, పరదేవతమీద ఆమెకున్న అచంచలమైన భక్తివిశ్వాసాలను కొనియాడారు.

ఈవిధంగా రాకుమారియైన సుకన్య బాల్యచాపల్యంతో చేసిన పొరపాటును పరమేశ్వరి దయవల్ల దిద్దుకుని ఆమె కరుణకు పాత్రురాలై సుఖంగా సంసారం చేసింది.

# 24. అశ్వినులు - హవిర్భాగము

అదితి కశ్యపుల కుమారుడు సూర్యుడు. రథమెక్కిమేరుపర్వతము చుట్టూ తిరుగుతూ ఉంటాడు. ఇతని గమనం వల్లనే పగలు రాత్రి ఏర్పడతాయి. ఇతని సారధి అనూరుడు. విశ్వకర్మ కుమార్తె సంజ్ఞాదేవి ఇతని భార్య. సూర్యుని తేజస్సు భరించలేక అతని భార్య సంజ్ఞాదేవి ఆడగుఱ్ఱము రూపంలో ఉత్తర దిక్కున ఉన్న కొండలలోకి వెళ్ళి తపస్సు చేసుకోవటం ప్రారంభించింది. ఆవిషయం తెలిసి సూర్యుడు కూడా గుఱ్ఱం రూపంలో అక్కడికి వెళ్ళాడు. అప్పుడు వారికి నాసత్యుడు, దస్రుడు అని ఇద్దరు కుమారులు కలిగారు. వారే అశ్వనీదేవతలు అని ప్రసిద్ధిచెందారు. వీళ్ళు వైద్యవిద్యలో అసమానులు. ఒకసారి యుద్ధంలో ఖేలుడు అనేవాడికి కాలువిరిగిపోతే ఇనుపకాలు పెట్టారు. వీరు వనమూలికలు మొదలైన ధాతువులు వండటము, బంగారము, వెండి మొదలైన లోహాలను పుటంపెట్టటము చేస్తుండేవారు. అందుచేత వీరు సహపంక్తికి పనికిరారని ఇంద్రుడు వీళ్ళని యజ్ఞాలలో వెలివేశాడు. వీరికి హవిర్భాగం లేకుండా చేశాడు.

శర్యాతి కుమార్తె సుకన్య. ఒకనాడు అడవిలో తిరుగుతూ ఒకపుట్టలోమెరుస్తూ కనిపించిన వింత వస్తువులను చూసింది. ఆ అడవిలో చ్యవనుడు పరమేశ్వరిని గురించి తపస్సు చేస్తున్నాడు. అతడి చుట్టూ పుట్టలు పెరిగిపోయాయి. ఆపుట్టలో మెరుస్తున్న చ్యవనుడి కళ్ళను సుకన్య పుల్లతో పొడిచింది. దాంతో చ్యవనుడు గ్రుడ్డివాడైపోయాడు. ఫలితంగా సుకన్యా, చ్యవనుల వివాహం జరిగింది. గ్రుడ్డివాడైన చ్యవనుడు అశ్వనీదేవతల మహిమవల్ల యవ్వనము, అందచందాలు, దృష్టిపొంది వారితో

"దివ్యపురుషులారా! ఆపరమేశ్వరి దయవల్ల మీరు నాకు మిత్రులయినారు. గ్రుడ్డివాడిని ముసలివాడిని. నా భార్యను ఏరకంగానూ సుఖపెట్టలేని వాణ్ణి. అటువంటి నన్ను రూపసిగా మార్చారు.యవ్వనాన్ని దృష్టిని నాకు ప్రసాదించారు. మీ ఋణం ఏవిధంగా తీర్చుకోగలను? అయినా చెప్పండి. యధాశక్తి మీకు ప్రత్యుపకారం చేస్తాను' ' అన్నాడు. దానికి వారు "మునీశ్వరా! మాతండ్రి సూర్యదేవుడు. అతని దయవల్ల మాకుఅన్నీ ఒనగూడాయి. కాని ఒక్కకోరిక. మేరుపర్వతం దగ్గర ఇంద్రుడు యజ్ఞం చేశాడు. యజ్ఞంలో హవిర్భాగము దేవతలకు చెందుతుంది. మేము దేవతలమే అయినప్పటికీ వైద్యులం కాబట్టి మాఇద్దరికీ తప్ప అందరికీ హవిర్భాగం ఇచ్చాడు. మాకు

యజ్ఞంలో హవిర్భాగము ఉండరాదు అని శాశించాడు. కాబట్టి నీకు సాధ్యమయితే మాకు యజ్ఞంతో హవిర్భాగాన్ని ఇప్పించు" అన్నారు.

దానికి చ్యవనుడు ఏమాత్రం ఆలోచించకుండా 'నిక్షేపంగా మీకు ఆ అర్హత కలిగిస్తాను. నాకు ఇంత ఉపకారం చేసిన మీకు ఈమాత్రం చెయ్యకపోతే నాతపస్సు ఎందుకు? మా మామగారితో యజ్ఞం చేయించి మీకు హవిర్భాగం ఇప్పిస్తాను. దేవతలందరితో పాటుగా మీకుకూడా గౌరవం దక్కుతుంది" అని వాగ్దానం చేశాడు.

సుకన్యాచ్యవనులు సుఖంగా కాపురంచేస్తున్నారు. కొంత కాలానికి శర్యాతి కూతురుకాపురం ఏరకంగా ఉందో చూసి వద్దామని బయలుదేరి వెళ్ళాడు. ఆశ్రమం దగ్గరకు వెళ్ళేసరికి ఆప్రాంగణంలో తిరుగాడుతూ అందమైన యువకుడు కనిపించాడు. ముసలివాడు గ్రుడ్డివాడు అయిన ముని కనిపించలేదు. దాంతో శర్యాతి మనసు పరిపరివాధాల పోయింది. ముసలివాడైన మునీశ్వరుని సంహరించి, ఎవరితోనో కలసి కుమార్తె కాపరం చేస్తున్నది అనుకున్నాడు. అంతలోనే అల్లంత దూరంలో తండ్రిని చూసి, ఎదురేగి సాదరంగా ఆహ్వానించి అశ్వనీదేవతలు రావటము, మునికి యవ్వనము, కళ్ళు తెప్పించటము అన్నీ వివరంగా చెప్పింది సుకన్య. విషయం పూర్తిగా తెలుసుకున్న శర్యాతి ఇదంతా ఆపరమేశ్వరి కటాక్షం వల్లనే జరిగింది అని ఆదేవిని స్తుతించాడు. తరువాత చ్యవనుడిని కలసి అతని యోగక్షేమాలు తెలుసుకుని, సంతోషంతో తన నగరానికి వెళ్ళిపోయాడు.

ఒకనాడు శర్యాతి యజ్ఞ చెయ్యటానికి తలపెట్టాడు. ఆయజ్ఞనికి చ్యవనుడే అధ్వర్యుడు. యజ్ఞం ప్రారంభమైంది. ఇంద్రాది దేవతలందరూ హవిర్భాగం కోసం యజ్ఞానికి వచ్చారు. ఇంతలో అశ్వనీదేవతలు కూడా వచ్చి అధ్వర్యుడైన చ్యవనుడి పక్కనే కూర్చున్నారు. అది చూసిన దేవతలలో కలకలం పుట్టింది. హవిర్భాగానికి అర్హత లేని అశ్వనీదేవతలు యజ్ఞానికి ఎందుకు వచ్చారు? వచ్చి ఆధ్వర్యుడి ప్రక్కనే కూచున్నారేమిటి? అనేవి వారిముందున్నప్రశ్నలు. కాని సమయం వచ్చినప్పుడు మాట్లాడచ్చులే అని ఎవరికి వారు ఊరుకున్నారు.

హవిర్భాగానికి సమయం రానేవచ్చింది. చ్యవనుడు ఇంద్రాది దేవతలను ఒక్కొక్కరినే పిలిచి వారి వారి భాగాలు అందించి తరువాత అశ్వనీ దేవతలను పిలిచాడు. వెంటనే ఇంద్రుడు "అశ్వనీ దేవతలు వైద్యులు. వైద్యవృత్తి చేసేవారు హవిర్భాగానికి అనర్హులు. ఇదిదేవతల నిర్ణయం"అన్నాడు.

“దేవతల నిర్ణయాన్ని నేను తలదాలుస్తున్నాను. కాని నాకు కంటిచూపు, యవ్వనము, ఇచ్చి నాసంసార జీవితం సుఖమయం చేసిన అశ్వనీ దేవతలకు హవిర్భాగం ఇస్తానని మాట ఇచ్చాను. అందుకని నన్ను క్షమించండి”అన్నాడు చ్యవనుడు. ఆమాటవినేప్పటికి ఇంద్రుడికి తీవ్రమైన కోపం వచ్చింది. దాంతో “నేను దేవతల రాజైన ఇంద్రుణ్ణి చెబుతున్నాను. నామాటకాదని అశ్వనీదేవతలకు గనక హవిర్భాగం ఇచ్చావో వృత్రుడికి పట్టిన గతే నీకూ పడుతుంది” అన్నాడు.

ఇంద్రుడు తనమాట వినకపోతే చంపేస్తానని హెచ్చరిక చేసేటప్పటికి చ్యవనుడి కోపం తారాస్థాయికి చేరుకుంది. అయినప్పటికీ నిగ్రహించుకుని దేవేంద్రా బృహస్పతి శిష్యుడవు. దేవరాజువు. నీకిది తగదు అన్నాడు. వినిపించుకోలేదు ఇంద్రుడు. దాంతో “అశ్వనీ దేవతలకు హవిర్భాగం ఇస్తున్నాను. నీచేతనైంది చేసుకో”అని వారికి హవిర్భాగాన్ని ఇవ్వచోయాడు. అంతే కోటి సూర్యుల తేజస్సుతో ప్రకాశిస్తున్న వజ్రయుధాన్ని చ్యవనుడి మీదికి విసిరాడు ఇంద్రుడు.

చ్యవనుడు తన తపశ్శక్తితో వజ్రాయుధాన్ని కాంతిహీనంచేసి ఇంద్రుడు పైకిత్తిన చెయ్యి అలానే ఉండిపోయేటట్టు చేశాడు. ఆతరువాత హోమగుండంలోంచి చ్యవనుడి తపశ్శక్తి వలన కొండంత శరీరం,పెద్ద పెద్ద కోరలు,పెద్దనాలుక, కలిగి నల్లని శరీరంతో, ఎర్రని కనులతో ఒకరాక్షసుడు పుట్టి ఇంద్రుడి వజ్రాయుధాన్ని నోటితో పట్టుకుని అతడి మీదికి ఉరికాడు. ఇదిచూసిన దేవతలు ఎక్కడి వారక్కడ పారిపోయారు.

భయంతో వణికి పోయాడు ఇంద్రుడు. ఏంచెయ్యటానికి పాలుపోలేదు. ఈరాక్షసుణ్ణి ఎదిరించటం దేవతల వల్లకాదని తెలిపోయింది. అందుకని బృహస్పతి సలహామీద తనను రక్షించమని చ్యవనుణ్ణే ప్రార్థించాడు. అప్పుడు చ్యవనుడు పరమేశ్వరి దయవల్ల రాక్షసుణ్ణి ఆపి ఇంద్రుణ్ణి బంధవిముక్తుణ్ణి చేశాడు. ఇంద్రుడు తన అహంకారం నశించిందనటానికి సూచనగా అశ్వనీదేవతలు యజ్ఞంలో హవిర్భాగానికి అర్హులు అని ప్రకటించాడు.

ఈరకంగా ఇంద్రుడి అహంకారం వల్ల యజ్ఞంలో హవిర్భాగం పోగొట్టుకున్న అశ్వనీ దేవతలు పరమేశ్వరి కృపవల్ల తిరిగి దాన్ని పొందగలిగారు. పరమేశ్వరి కృపవల్ల తిరిగిదాన్ని పొందగలిగారు.

# 25. రేవతి

సూర్యవంశపురాజు శర్యాతి. అతనికి అనవర్తుడు అనేకుమారుడు, సుకన్య అనే కుమార్తెపుట్టారు. అనవర్తుని కుమారుడు రేవతుడు. ఇతనికి రేవతి అనే కుమార్తె! నూర్గురు కుమారులు కలిగారు

రేవతి సర్వశుభలక్షణాలు కలిగి అందచందాలలో దేవతా స్త్రీలను సైతం తలదన్నేటట్లుగా ఉంది. పూవుకు తావి అబ్బినట్లుగా రేవతికి అందచందాల తో బాటుగా విద్య, సంగీతము, నాట్యము మొదలైన కళలు కూడా కరతలామలకమైనాయి. రేవతికి యుక్తవయస్సురాగానే వివాహం చెయ్యాలని సంకల్పించాడు మహారాజు. తనకు తెలిసిన చోటల్లా విచారించాడు కుమార్తెకు సరిజోడు దొరుకుతుందేమో అని. కాని ఎక్కడా దొరక లేదు. ఏంచెయ్యటానికి తోచ లేదు. పరమేశ్వరిని గురించి ప్రార్థించాడు. ఆమె ప్రత్యక్షమై రేవతికి సలక్షణమైన భర్త లభిస్తాడని చెప్పింది. కాని ఎక్కడ దొరుకుతాడో చెప్పలేదు. సరే చెయ్య గలిగింది ఏమీ లేదు కాబట్టి అల్లుడు ఎక్కడ దొరుకుతాడో చెప్పమని ఆ సృష్టికర్తనే అడుగు దామని నిశ్చయించుకుని కుమార్తెను తీసుకుని సత్యలోకానికి బయలు దేరాడు.

సత్యలోకం చేరిన రేవతుడు బ్రహ్మసభలో ప్రవేశించి సృష్టి కర్తకు నమస్కరించి "విధాతా! ఇది నాకూతురు రేవతి. దీనికి పెండ్లి చెయ్యాలి. నాకు తెలిసిన చోటల్లా గాలించాను. తగిన వరుడు దొరకలేదు. పరమేశ్వరి సర్వ లక్షణ సమన్వితుడు అల్లుడుగా దొరుకుతాడని దీవించింది. కాని ఎక్కడ దొరుకు తాడో చెప్పలేదు. అందుచేతఏమీ తోచక నీదర్శనం కోసం వచ్చాను." అన్నాడు. దానికి బ్రహ్మ ఒక్క క్షణం ఆలోచించి, "రాజా! ఇప్పుడు భూలోకంలో 27వ మహాయుగంలో ద్వాపరయుగం నడుస్తున్నది. నువు అక్కడనుంచి ఇక్కడికి వచ్చేలోపల ఇంతకాలంగడిచిపోయింది. నీకు తెలిసిన రాజులు, రాకుమారులు అందరూ మరణించారు. నీరాజ్యాన్ని దొంగలు దోచుకున్నారు.

యాదవ వంశస్థుడైన ఉగ్రసేనుడికి క్షేత్రజ్ఞుడైన కుమారుడు కంసుడు. ఒకనాడు ఉగ్రసేనుడి భార్య యమునా తీరానికి వెళ్ళింది. అక్కడ కాలనేమి అనే పేరుకల రాక్షసుడు తన మాయతో ఉగ్రసేనుడి రూపం ధరించి ఆమెతో రమించాడు. ఆ విషయం తెలిసిన ఆమె నీ అంశతో పుట్టిన కుమారుడు హరి వంశంలో పుట్టిన వారి చేతులో మరణిస్తాడని శపించింది. కాలనేమి యొక్క అంశతో పుట్టిన వాడే కంసుడు. అందుకనే అతడికి రాక్షస లక్షణాలు వచ్చినాయి. వాడు పరమదుర్మార్గుడైనాడు. తండ్రిని చెరసాలలో బంధించి తాను రాజైనాడు. ఇతడు జరాసంధుని కుమార్తెలయిన అస్తి, ప్రాప్తి అను వారిని వివాహమాడాడు. ఈ రకంగా భూలోకంలో మళ్ళీదుష్టసంతతి పెరిగిపోయింది. భూభారం కూడా అధిక మయింది.

దేవామీఢుడు అనే రాజుకు మారిష అనే భార్యవల్ల కలిగినవాడు వసుదేవుడు. ఇతడు కంసుని చెల్లలయిన దేవకిని వివాహం చేసుకున్నాడు. రోహిణి, కౌసల్య, పౌరవి మొదలైన వారు కూడా ఇతని భార్యలు. దేవకి వివాహ సమయంలో ఆమె అష్టమగర్భాన పుట్టినవాడి చేతిలో కంసుడు మరణిస్తాడని అశరీరవాణి చెప్పింది. అదివిని దేవకీ వసుదేవులను కంసుడు చెరసాలలో పడేశాడు.

బ్రహ్మమానసపుత్రుడు మరీచి. ప్రథమ యుగంలో 'వర్ణ' అనే స్త్రీ ఇతని భార్య. వీరికి ఆరుగురు కుమారులు కలిగారు. ఒకనాడు బ్రహ్మ సరస్వతితో ఉండగా చూచి వీరు నవ్వి ఎగతాళి చేశారు. దానికి కోపించిన బ్రహ్మ వీరిని రాక్షసుల గర్భాన జన్మించమని శపించాడు. వారు హిరణ్యాకశ్యపునకు పుత్రులుగా పుట్టారు. తరువాత వారే దేవకీ గర్భాన పుట్టిన మొదటి ఆరుగురు కుమారులు. వసుదేవుడికి దేవకి యందు

| | |
|---|---|
| 1.కీర్తిమంతుడు | 5.సమదనుడు |
| 2.సుషేణుడు | 6.భద్రుడు |
| 3.భద్రసేనుడు | 7.సంకర్షణుడు |
| 4.ఋజువు | 8.కృష్ణుడు |

అనే పుత్రులు, రోహిణివల్ల బలరాముడు పుట్టారు. దేవకీ పుత్రులను ఏడుగురినీ, పుట్టగానే కంసుడు చంపేశాడు.

బలరామకృష్ణులు పెద్దవారై కంసుణ్ణిచంపి ఉగ్రసేనుణ్ణిరాజును చేశారు. కృష్ణుడు తన అల్లుడైన కంసుణ్ణి చంపాడని విని జరాసంధుడు తనస్నేహితుడైన కాలయవనుని కృష్ణుడి మీదకి యుద్ధానికి పంపాడు.

గర్గుడు యాదవుల పురోహితుడు. ఒకనాడు యాదవులు ఇతణ్ణి నువు స్త్రీవా, పురుషుడవా అని హేళన చేశారు. దానికి గర్గుడు కోపించి యాదవులను నాశనం చెయ్యగల కుమారుడు కావాలని శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. యవనుడు అనే రాజు ఈవిషయం తెలిసి గర్గుణ్ణి తీసుకువెళ్ళి తన ఆవులమందలో దాచాడు. ఒక అప్సరస గర్గుణ్ణి చూసి మోహించి అతని వల్ల ఒక కుమారుణ్ణి కన్నది. వాడే కాలయవనుడు.ఇతణ్ణి యవనుడే పెంచాడు.

కాలయవనుడు మహాబలాఢ్యుడు. ఇతడు ద్వారకానగరం మీద పడి అనేకసార్లు ఆనగరాన్ని ధ్వంసంచేశాడు. చివరకు కృష్ణుడు మాయోపాయంతో ఇతణ్ణి సంహరించాడు.

ఇప్పుడు కృష్ణుని పర్యవేక్షణలో ద్వారకావాసులు సుఖంగా ఉన్నారు. అతని అన్న బలరాముడు నీకుమార్తెకు తగిన వరుడు. కాబట్టి రేవతి, బలరాముల వివాహం చెయ్యి. ఇది పరమేశ్వరి సంకల్పం అన్నాడు.

బ్రహ్మదేవుని ఆజ్ఞప్రకారం రేవతుడు రేవతి బలరాముల వివాహం జరిపించి తాను వాన ప్రస్థానికి వెళ్ళిపోయాడు.

ఈ రకంగా పరమేశ్వరి సంకల్పం వల్ల రేవతి బలరాముల వివాహం జరిగింది.

# 26. ఇంద్రవాహనుడు

వైవస్వతమనువు కుమారుడు ఇక్ష్వాకువు. ఒకనాడు మనువు తుమ్మగా అతడి ముక్కునుంచి ఇక్ష్వాకువు పుట్టాడు. ఇతడు సూర్యవంశానికి మూలపురుషుడు. గొప్పవాడు. దానధర్మాలలో ఇతడికి ఇతడేసాటి. ఇతనికి సంతానం లేదు. నారదుని ఉపదేశం మీద అడవికి వెళ్ళి కఠోరమైన నియమాలతో ఆపరదేవతను ఆరాధించాడు. దేవి అనుగ్రహంవల్ల నూరుగురు పిల్లలకి తండ్రిఅయ్యాడు. వారిలో పెద్దవాడు వికుక్షి. ఇక్ష్వాకువు సరయూనదీ తీరాన అయోధ్యానగరాన్ని రాజధానిగా చేసుకుని రాజ్యపాలన చేశాడు. తనకుమారులలో యాభైమందిని ఉత్తరదేశంలోను, నలభైఎనిమిది మందిని దక్షిణదేశంలోను వివిధ దేశాలకు అధిపతులుగాచేసి వికుక్షితో పాటు ఇంకొకణ్ణి తన సహాయం కోసం దగ్గర ఉంచుకున్నాడు.

ఒకనాడు ఇక్ష్వాకువు శ్రాద్ధము కోసం మృగమాంసం తెమ్మని వికుక్షిని అడవికి పంపాడు. వికుక్షి అడవిలో కుందేళ్ళను, అడవిపందులను, లేళ్ళను వేటాడి అలసిపోయి ఒకచెట్టుక్రింద విశ్రాంతి తీసుకుంటున్నాడు. అప్పుడు అతడికి బాగా ఆకలి వేసి, కుందేలు మాంసం కొంతతిని మిగిలిన మాంసాన్ని తీసుకువెళ్ళి తండ్రికి ఇచ్చాడు.

సూర్యవంశానికి గురువు వసిష్ఠుడు. ఆయనే శ్రార్ధకర్మ చేయిస్తున్నాడు. ఆయన త్రికాలవేత్త.. మాంసం చూసి ఇది ఎంగిలి మాంసం అన్నాడు. ఇక్ష్వాకువు కోపించి ఏమైందని అడగగా వికుక్షి జరిగిన విషయం చెప్పాడు. వెంటనే ఇక్ష్వాకువు వికుకక్షికి రాజ్య బహిష్కారం విధించాడు. వికుక్షి అడవికి వెళ్ళిపోయాడు. ఆనాటినుంచి అతను శశాదుడుగా పిలవబడ్డాడు.

కొంతకాలానికి ఇక్ష్వాకువు మరణించాడు. ఈవార్త తెలిసి శశాదుడు అయోధ్యకు వచ్చి రాజై ప్రజారంజకంగా పాలించాడు. ఇతని కుమారుడు కకుత్సుడు.

ఒకసారి దేవదానవులకు భయంకరమైన పోరుజరిగింది. దానిలో దేవతలు ఎప్పటిలాగే బాగా దెబ్బలుతిని వైకుంఠానికి పోయి విష్ణువుకు తమగోడు వివరించుకున్నారు. అంతా విని శ్రీహరి దేవతలతో "మానవలోకంలో సరయూనదీ తీరాన అయోధ్యానగరాన్ని కకుత్సుడనే రాజు పాలిస్తున్నాడు. అతడు పరమేశ్వరి భక్తుడు. అతడొక్కడే ఈరాక్షసులను సంహరించగలడు. కాబట్టి అతన్ని గనక శరణువేడితే మీకష్టాలు గట్టెక్కుతాయి" అన్నాడు.

హరి చెప్పినట్టుగానే దేవతలు కకుత్సుని శరణుకోరారు. దానికి "నేను రాక్షసులతో యుద్ధంచేసి మిమ్మల్ని రక్షిస్తాను. కాని నాకు ఇంద్రుడు వాహనం కావాలి"అన్నాడు కకుత్సుడు. దీనికి మొదట ఇంద్రుడు ఒప్పుకోలేదు. కాని చివరకు తప్పలేదు.. సురాధిపతి పెద్ద ఎద్దుగా మారాడు. కకుత్సుడు ఆఎద్దుమీద ఎక్కి పరమేశ్వరిని తలచుకుని ఆదేవి కరుణ వల్ల రాక్షసులను జయించి దేవతలను రక్షించాడు. ఈవిధంగా ఇంద్రుని వాహనంగా పొందాడు కాబట్టి కకుత్సుడు ఇంద్రవాహనుడు అని పిలవబడ్డాడు.

పరమేశ్వరి కృపవల్ల ఇంద్రవాహనుడుగా పేరుపొందిన కకుత్సుడు అనేక సంవత్సరాలు ప్రజారంజకంగా పాలించాడు.

# 27. సత్యవ్రతుడు

పూర్వకాలంలో కోసలదేశంలో దేవదత్తుడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు అతడు చాలా పండితుడు, భగవదారాధనాపరుడు. అతడికి చాలా కాలం సంతానం లేదు. పండితులతో ఆలోచించి పుత్రసంతానం కోసం తమసా నదీతీరాన యజ్ఞం చేయటంప్రారంభించాడు. ఆయజ్ఞానికి వేదవేదాంగవేత్త అయిన సుహోత్రుడు అనేవాడు బ్రహ్మ యాజ్ఞవల్క్యుడు అధ్వర్యుడు, దేవగురువైన బృహస్పతిహోత. గోబిలుడు అనే పండితుడు ఉద్గాత. అన్నిటా సమర్థులైన బ్రాహ్మణోత్తములు ఋత్విక్కులు. ఉద్గాతఅంటే యజ్ఞ సమయంలో సామగీతాలను గానంచేసేవాడు. గోబిలుడు సామవేదాన్నిచక్కని స్వరంతో గానం చేస్తున్నాడు. ఆగానానికి దేవతలు ముగ్ధులై అతణ్ణిబహుధాప్రశంసిస్తున్నారు.ఈవిధంగా సామగానం చేస్తుండగా ఒకనాడు అతడికి ఊపిరి పట్టి స్వరం తప్పింది. దాంతో దేవదత్తుడు కోపించి "ఓరీమూర్ఖుడా! పుత్రసంతానం కావాలని నేను యజ్ఞం చేస్తుంటే నువ్వు తప్పుస్వరం పలికి యజ్ఞము యొక్క పవిత్రత పోగొట్టావు. నాకోరిక సఫలీకృతం కాకుండా చేస్తున్నావుకదా?" అని తిట్టాడు. ఆమాటలకు గోబిలుడు మండిపడి "ఇంతవరకు నేను ఒక్క తప్పుకూడా లేకుండా, దేవతలు సైతం మెచ్చుకునే విధంగా సామగానం చేశాను. ఊపిరి పీల్చటమనేది ప్రాణులకు ముఖ్యమైనది. ఉఛ్వాస నిశ్వాసాలలో తేడా వచ్చి ఒక్క తప్పు దొర్లింది. అంతమాత్రానికే నన్ను మూర్ఖుడు అంటావా? నీకు మూర్ఖుడైన కొడుకేపుడతాడు" అని శపించాడు.

ఆమాటవిన్న దేవదత్తుడు తన తొందరపాటు చర్యకు చాలా విచారించి గోబిలునితో 'చాలా పొరపాటు జరిగిపోయింది. మంచి పుత్రుడు కలగడేమోననే వ్యాకులతతో ఈవిధంగా మిమ్మల్ని నిందించాను. చదువురాని కొడుకు ఉండే కన్నా అసలు లేకుండటమే మంచిదికదా? చదువు లేని వాడికి మన్నన మర్యాద లుండవు. అ[illegible] ద్విపాద పశువు. వాడికన్న చతుష్పాదజంతువేమిన్న, కర్మదూరుడు, విద్యాశూన్యుడు అయిన బ్రాహ్మణుడు ఏ రాజ్యంలో ఉంటాడో, అలాటి చోట పండితులు ఉండకూడదని శాస్త్రాలు చెబుతున్నాయి.మూర్ఖుడూ, విద్యాహీనుడు అయిన బ్రాహ్మణుడికి ఏవస్తువూ దానం కూడా ఇవ్వరాదు. ఒకవేళ ఇవ్వవలసివస్తే పట్టెడు అన్నంవరకే పెట్టిపంపించాలి. పితృకార్యాలలోకూడా విద్యాహీనుణ్ణి భోక్తగా పిలవకూడదు. ఇన్ని రకాలగా అయోగ్యుడయిన పుత్రుడు నాకెందుకు. అటువంటి కుమారుడుకి తండ్రి అయ్యే కన్నా ప్రాణత్యాగమే సుఖము. కాబట్టి పండితోత్తమా నేను ఈయజ్ఞశాలలోనే ప్రాణత్యాగం చేస్తాను" అన్నాడు.

ఈమాటలు విన్న గోబిలుడి మనసు కరిగి పోయింది. దేవదత్తుడు తొందర పడటంలో అర్థం ఉంది. కాని తను తొందరపడకుండా ఉండవలసింది. పొరపాటు జరిగిపోయింది. అని చింతించి 'దేవదత్తా! నీకుమారుడు నిరక్షరకుక్షి అయినా కొంత కాలానికి ఆ పరమేశ్వరి మహిమవల్ల మహాకవి అవుతాడు' అని శాపవిమోచనం కలిగించాడు.

యజ్ఞం పూర్తయింది. దేవదత్తుని భార్య రోహిణి అచిరకాలం లోనే గర్భవతి అయి పండంటి తనయుణ్ణి ప్రసవించింది. దేవదత్తుడు కుమారుడుకి ఉతథ్యుడు అని

నామకరణం చేసి యథావిధిగా ఉపనయనం అయిన తరువాత వేదం నేర్పాలని సంకల్పించాడు. ఉతద్యుడికి నోరు తిరగలేదు. మాట పలకలేదు. గోబిలడి శాపం వల్ల జడుడయిపోయాడు. అతణ్ణి చుట్టుపక్కల వారు హేళన చేయటం మొదలు పెట్టారు. కొడుకుని చూసి తండ్రి కూడా దిగులు పడటం ప్రారంభించాడు. ఈ పరిస్థితిలో ఇంటిదగ్గర ఉండటం మనస్కరించలేదు ఉతద్యుడికి. అడవికి వెళ్ళి తపస్సు చేసుకోవాలనుకున్నాడు. అనుకున్నదే తడవుగా ఎవరికీ చెప్పకుండా ఇంట్లోంచి వెళ్ళిపోయాడు. అలా బయలు దేరిన ఉతథ్యుడు గంగాతీరంచేరి చిన్న పర్ణశాల నిర్మించుకున్నాడు. తపస్సు చెయ్యాలని కోరిక. కాని ఏం చెయ్యాలో తెలియదు. ఎలా చెయ్యాలో అంతకన్నా తెలియదు. ఉదయాన్నే లేవటం, గంగలో స్నానం చేసి రావటం కళ్ళు మూసుకుని గంటలతరబడి కూచోటం ఆకలయినప్పుడు దొరికిన కాయో, పండో తిని కాసిని గంగాజలం త్రాగటం. ఇదీ వాడి దినచర్య. కొంతకాలానికి సత్యం తప్ప ఏమీ మాట్లాడను అని తీర్మానించుకున్నాడు. అందుచేత అందరూ అతణ్ణి సత్యవ్రతుడు అని పిలవటం మొదలు పెట్టారు.

అతడి వల్ల ఎవరికీ అపకారమూలేదు ఉపకారమూలేదు. అతడు పర్ణశాలలో కూచుని 'అందమూ, చందము,ధనము, పదవి ఎన్ని ఉన్నా చదువు లేకపోతే నిష్ప్రయోజనం కదా! గతజన్మలో ఎవరికీ విద్యాదానం చేసి ఉండను. చదువు సంస్కారాలనేవి పూర్వజన్మవాసనను బట్టి వస్తాయి. నా వయసు వారందరూ శాస్త్ర పండితులయినారు. నాకు మాత్రం చదువురాలేదు. ఇదికేవలం నాప్రారబ్ధం. ఇది తప్పించటం ఆపరమేశ్వరునికి కూడా సాధ్యం కాదుకదా!" అని చింతుస్తుండేవాడు. ఈరకంగా అతడికి పధ్నాలుగు సంవత్సరాలు నిండినాయి.

ఒకనాడు ఒకవేటగాడు ఆహారం నిమిత్తం అడవిలో తిరుగతూ ఒకపందిని బాణంతో కొట్టాడు. ఆదెబ్బకి అది చావకుండా సత్యవ్రతుడున్న పర్ణశాల ముందునుంచి అరుచుకుంటూ పోయింది. ఆపంది చేసిన ధ్వని ఐం అనే వాగ్బీజంగా వినిపించింది సత్యవ్రతుడికి. దానినే మంత్రంలాగా జపించటం మొదలు పెట్టాడు. ఇంతలో పందిని కొట్టిన వేటకాడు పరుగెత్తుకుంటూవచ్చి, పంది కనపడక అది ఏదిక్కుగా వెళ్ళిందో చెప్పమని సర్యవ్రతుణ్ణి అడిగాడు. ఆ సమయంలో సత్యవ్రతుడు వాగ్బీజాన్ని జపిస్తున్నాడు. త్రిలోక సంచారి అయిన పరమేశ్వరి అటుగాపోతూ జపం చేస్తున్న సత్యవ్రతుణ్ణి అనుగ్రహించి మహాకవి కమ్మని ఆశీర్వదించింది. అప్పుడు ఆబాలుడు ఆబోయవాణ్ణి చూసి

యా పశ్యతి న సా బ్రూతే యా బ్రూతే సా నపశ్యతి
అహో!వ్యాధ! స్వకార్యార్థిన్! కిపృచ్ఛసి పునః పునః॥

ఓకిరాతుడా! నీ పని కావాలనే కోరికతో నన్ను అడుగుతున్నావు. చూచేది చెప్పలేదు. చెప్పేది చూడలేదు. అంటే కంటి లక్షణం చూడటం కాని అదిమాట్లాడలేదు. నోరు మాట్లాడుతుంది కాని చూడలేదు. కాబట్టి నన్ను ఏంచెప్పమన్నావు? అన్నాడు దానితో ఆబోయవాడు మారుమాట లేకుండా వెళ్ళిపోయాడు.

సత్యవ్రతుడు మహాకవి అయినాడు. పరమేశ్వరి కరుణవల్ల గొప్ప పండితుడు, కవి అయి ప్రజల మన్ననలు పొందిన సత్యవ్రతుణ్ణి చూసి తల్లితండ్రులు కూడా సంతసించారు.

# 28. త్రిశంకుడు

ఇక్ష్వాకు వంశంలో గొప్ప పేరు ప్రఖ్యాతులు పొందిన మహారాజు మాంధాత. ఇతడు గొప్ప పరమేశ్వరి భక్తుడు. దేశంలోని వివిధప్రదేశాలలో నూటఎనిమిది దేవీ ఆలయాలు కట్టించాడు. మాంధాత కుమారుడు పురుకుత్సుడు. అతని కొడుకు అనరణ్యుడు. ఇతని మునిమనుమడు త్రిదస్యుడు. ఇతని కుమారుడు అరుణుడు. అరుణుడి కుమారుడు సత్యవ్రతుడు.

సత్యవ్రతుడికి మంచి గుణాలకన్నా చెడ్డగుణాలే ఎక్కువ. ఒకనాడు ఒక బ్రాహ్మణుని ఇంట వివాహం జరుగుతుండగా సత్యవ్రతుడు వెళ్ళి బలవంతంగా పెండ్లి కుమార్తెను ఎత్తుకుపోయాడు. ఈవిషయం తెలిసి అరుణుడు 'సూర్యవంశానికి మచ్చతెచ్చే పని చేశావు కాబట్టి అడవులలోనే బతుకు' అని రాజ్యబహిష్కారం విధించాడు. ఈశిక్షకు కులగురువైన వసిష్టుడు రాజును ప్రోత్సహించాడని అతడి మీద కక్షపెంచుకున్నాడు సత్యవ్రతుడు.

ఆరోజుల్లో ఒకసారి పన్నెండు సంవత్సరాలు దేశంలో వర్షాలు కురవలేదు. అప్పుడు అరుణుడు పుత్రసంతతి కావాలని అడవులకుపోయి తపస్సు చేస్తున్నాడు. వసిష్టుడే అయోధ్యలో ఉండి రాజ్యపాలనా వ్యవహారాలు చూస్తున్నాడు. విశ్వామిత్రుడుకూడా భార్యా పిల్లలను వదలి తపస్సు చేసుకోటానికి అడవులకు పోయాడు.

వర్షాలు లేక పంటలు పండలేదు. దేశంలో కరువుతాండవిస్తోంది. విశ్వామిత్రుని భార్యకు తన ముగ్గురు కుమారులను పెంచటం కష్టంగాఉంది. కాబట్టి ఆముగ్గురిలో ఒకడిని బజారులో అమ్మి వచ్చిన దానితో మిగిలిన ఇద్దరినీ పోషించవచ్చునని, రెండవ కొడుకుని అమ్మటానికి తీసుకొని పోతోంది. త్రోవలో సత్యవ్రతుడు ఎదురయి, విషయం తెలుసుకుని, వారికి ప్రతిరోజూ ఆహారం ఏర్పాటుచేస్తాను వెళ్ళమన్నాడు. చెప్పిన ప్రకారమే ప్రతిరోజు వారి ఇంటిముంగిట్లో ఏదోఒక ఆహారం పెట్టివెడుతున్నాడు.

ఒకరోజు సత్యవ్రతుడికి ఏఆహారందొరకలేదు. అయోధ్యా నగరం పొలిమేరలో ఒక ఆవు కనిపించింది. అది వసిష్ఠుడిది. ఆసంగతి తెలిసి అతడిమీదున్న కోపంతో ఆ ఆవును చంపేశాడు. జ్ఞానదృష్టితో ఈవిషయం తెలుసుకున్న వసిష్ఠుడు "ఈదుష్టుడు ఇప్పటికి చాలా పాపాలు చేశాడు. బ్రాహ్మణ కన్యను వివాహమంటపంలోంచి ఎత్తుకుపోయాడు. తండ్రిమాటకు ఎదురు చెప్పాడు. ఆవులను చంపాడు. ఇంక ఉపేక్షించకూడదు'' అని ఆలోచించి "ఈమూడు రకాల తప్పులు చేశావు. కాబట్టి ఇక నుంచి త్రిశంకువుగా పిలవబడుతూ పిశాచ రూపం పొందు"అని శపించాడు.

త్రిశంకువు పిశాచరూపంలో తిరుగుతుండగా ఒకమునీశ్వరుడు ఇతన్నికనికరించి పరదేవతా మంత్రాన్ని ఉపదేశించి "ఈమంత్రాన్నిశ్రద్ధగా చెయ్యి. ఆజగజ్జనని కరుణిస్తుంది' 'అని చెప్పాడు.

త్రిశంకుడు చాలా కాలం పరమేశ్వరి జపంచేసి, హోమం చేసే సంకల్పంతో కొందరు మునులను ఆశ్రయించాడు. వారు పాపాత్ముడైన ఇతడికి మహామంత్రాలు జపించే అర్హతే లేదన్నారు.

చేసేది లేక త్రిశంకుడు ప్రాణత్యాగం చెయ్యటానికి సిద్ధపడి చితి పేర్చి, నిప్పు అంటించి ఆపరమేశ్వరిని ప్రార్థించాడు. అప్పుడు దేవి ప్రత్యక్షమై "నీ తండ్రి రేపు నీకు రాజ్యాభిషేకం చేస్తాడు. వేచి ఉండు"అంది.

అరుణుడికి ఆజగజ్జనని కలలో కనిపించి "నీ కుమారుడికి రాజ్యాభిషేకంచేసి నీవు అడవులకు వెళ్ళు"అని చెప్పింది. దాంతో మంత్రులను అడవులకు పంపి త్రిశంకువును రప్పించి, అయోధ్యా నగరానికి పట్టాభిషక్తుని గావించి తాను అడవులకు వెళ్ళిపోయాడు అరుణుడు.

ఈవిధంగా శాపగ్రస్థుడైన త్రిశంకుడు పరమేశ్వరి కృపవల్ల అయోధ్యా నగరానికి రాజైనాడు. ఇతని కుమారుడే హరిశ్చంద్రుడు.

రాజ్యపాలన చేస్తుండగా త్రిశంకుడికి బొందితో స్వర్గానికి వెళ్ళాలనే విచిత్రమైన కోరిక వచ్చింది. వెళ్ళి కులగురువైన వసిష్ఠుడిని అడిగాడు. "ఈశరీరంతో స్వర్గానికి వెళ్ళటం జరిగేదికాదు.అయినా స్వర్గనివిసానికి సాధనమైన యజ్ఞం చెయ్యి"అన్నాడు. 'అది నువ్వే చేయించు. లేకపోతే ఇంకెవరితోనైనా చేయించుకుంటాను' అన్నాడు త్రిశంకుడు. గురుధిక్కారం చేసినందుకు వసిష్ఠుడు కోపించి ఛండాలుడవు కమ్మని శపించాడు. గురుశాపం తగిలిన మరుక్షణంలోనే త్రిశంకుడికి ఛండాలరూపం వచ్చేసింది. అతడురాజ్యం వదిలి గంగానదీ తీరానికి చేరి ఆపరమేశ్వరిని ప్రార్థిస్తూ కాలం గడుపుతున్నాడు.

కొంత కాలానికి విశ్వామిత్రుడు తపస్సు చాలించి ఇంటికి తిరిగి వచ్చి,తను ఇంట్లో లేనప్పుడు, కరువుకాటకాలు వచ్చినసమయంలో తనకుటుంబాన్ని పోషించిన త్రిశంకుడికి ఉపకారం చేద్దామనే ఉద్దేశ్యంతో బయలు దేరి త్రిశంకుణ్ణి కలిశాడు.

త్రిశంకుడివల్ల జరిగిందంతావిని అతడితో యజ్ఞంచేయించటానికి పూనుకున్నాడు విశ్వామిత్రుడు. ఆయజ్ఞానికి మునులు ఎవ్వరూరాలేదు. అప్పుడు ఇంతకాలము తను జపం చేసిన గాయత్రీమంత్రఫలాన్ని త్రిశంకువుకు ధారపోసి బొందితో స్వర్గానికి పంపాడు.

త్రిశంకుడి సశరీరుడై స్వర్గానికి రావటంచూసిన దేవతలు అతణ్ణి అక్కడ నుంచి తోసేశారు. క్రింది పడిపోతున్న త్రిశంకుణ్ణి మధ్యలోనే ఆపి అక్కడ అతడికోసం ఇంకొక స్వర్గం సృష్టించటం ప్రారంభించాడు విశ్వామిత్రుడు. అది చూసిన ఇంద్రుడు సృష్టికి విరుద్ధ మైన పనిచెయ్యవద్దని ప్రార్థించి విశ్వామిత్రుని కోరిక మీద త్రిశంకునికి దివ్య రూపమిచ్చి స్వర్గానికి తీసుకుపోయాడు.

ఈ రకంగా శాపగ్రస్తుడైన త్రిశంకుడు ఆపరమేశ్వరి కరుణవల్ల, విశ్వామిత్రుడు ధారపోసిన గాయత్రీ మంత్రజప ఫలంవల్ల స్వర్గానికి చేరాడు.

# 29. నరమేధం

ఇక్ష్వాకువుతో పాటే ఆవంశం కూడా ప్రారంభమైంది. ఆవంశంలో మాంధాత, పురుకుత్సుడు, అనరణ్యుడు మొదలైన మహారాజులున్నారు. వారిలో అరుణుడి కుమారుడు సత్యవ్రతుడు. అతడి పేరే త్రిశంకుడు. త్రిశంకుని కుమారుడు హరిశ్చంద్రుడు.

హరిశ్చంద్రుడు వీరుడు పరాక్రమ వంతుడు. ఎంతకాలానికీ అతడికి సంతానం కలగలేదు. దానికి రాజు చాలా దుఃఖించి చివరకు వసిష్ఠమహర్షి సలహామీద గంగానది వద్దున ఆశ్రమం ఏర్పాటు చేసుకుని వరుణ దేవుని గూర్చి తపస్సు చేశాడు. అతడి తపస్సుకు మెచ్చి వరుణుడు ప్రత్యక్షమై ఏవరం కావాలో కోరుకోమన్నాడు. మంచి కుమారుడు కావాలన్నడు హరిశ్చంద్రుడు. సరే అలాగే అన్నాడు వరుణుడు. కాని ఒక్క షరతు పెట్టాడు. ఆపిల్లవాణ్ణి పశువుగా సంకల్పించి నాపేర నరమేధం చెయ్యాలి అన్నాడు. అసలు పిల్లలు లేని దాని కన్నా ఇది నయం కదా అనే ఉద్దేశ్యంతో సరే అన్నాడు హరిశ్చంద్రుడు.

హరిశ్చంద్రుని భార్య గర్భవతియై కొంతకాలానికి పండంటి కొడుకును కన్నది. వెంటనే వరుణుడు వచ్చి నరమేధం చెయ్యమన్నాడు. కొడుకుని చంపటానికి మనస్సు ఒప్పలేదు రాజుకు. నెలపురుడు వెళ్ళనియ్యమన్నాడు. నెలతరువాత వచ్చాడు వరుణుడు. ఈసారి పిల్లవాడికి దంతాలు రానియ్యమన్నాడు. ఈరకంగా ఒకసారి పుట్టు వెంట్రుకలు, ఒకసారి ఉపనయనము అంటూ ఏవోసాకులు చెప్పాడు.

ఉపనయనం అయిన తరువాత వచ్చాడు వరుణుడు ఇదిగో రేపో మాపో నరమేధం చేస్తానన్నాడు హరిశ్చంద్రుడు ఆసంగతి కుమారుడైన రోహితుడికి వివరించాడు. ఆరోజు రాత్రి రోహితుడు ఎవ్వరికీ చెప్పకుండా అరణ్యానికి పారిపోయాడు.

మరునాడు వరుడు వచ్చి విషయం తెలుసుకుని రాజా! నీకుమారుణ్ణి సంహరించవలసి వస్తుందని నువ్వే ఈపని చేయించావు. ఆడిన మాట తప్పావు. కాబట్టి జలోదరంతో బాధపడు అన్నాడు. అంతే ఆరో.జునుంచి హరిశ్చంద్రుడు జలోదరంతో పీడింపబడుతున్నాడు.

అరణ్యంలో తిరుగుతున్న రోహితుడికి తండ్రి జబ్బు గురించి తెలిసి తండ్రి దగ్గరకు బయల్దేరాడు. కాని త్రోవలో ఏవో మాయమాటలు చెప్పి ఇంద్రుడు రోహితుణ్ణిఆపేశాడు ఎంతకాలమయినా హరిశ్చంద్రుడి రోగం కుదరలేదు. కులగురువైన వసిష్ఠమహర్షిని పిలిచి సలహా అడిగాడు. ఎక్కడైనా సరే ఒక బాలుణ్ణి కొని నరమేధం నిర్వహించటం శాస్త్ర సమ్మతము అన్నాడు వసిష్ఠుడు. సేవకులను నాలుగు దిక్కులకు పంపాడు హరిశ్చంద్రుడు.

రాజ్యమంతా తిరుగుతుండగా ఒకచోట అజీగర్తుడు అనే పేదబ్రాహ్మణుడు

కనిపించాడు. అతడికి ముగ్గురు కొడుకులు 1. శునఃపుచ్ఛుడు2. శునఃశ్శేపుడు
3. శునోలాంగూలుడు
అతడు పిల్లవాణ్ణి అమ్ముతానన్నాడు.

వీరిలో పెద్దవాడు కర్మాధికారి కాబట్టి తండ్రి ఒప్పుకోడు. ఆఖరువాడు తల్లికి ఇష్టుడు. ఇక మిగిలినది రెండవవాడైన శునఃశ్శేపుడు రాజభటుల దగ్గర తగినంత దనం తీసుకుని పిల్లవాణ్ణి ఇచ్చాడు ఆజీగర్తుడు.

రాజు యజ్ఞం ఆరంభించాడు. శునఃశ్శేపుణ్ణి యూపస్థంభానికి కట్టి పడేశారు. అప్పుడు వాడికి విషయం తెలిసింది. చిన్నపిల్లవాడు చచ్చిపోతాననే భయంతో పెద్దగా ఏడవటం మొదలుపెట్టాడు. అదిచూసి రాజుకూడా విచారించాడు. కాని చెయ్యకలిగింది ఏముంది? యజ్ఞశాలలోని పండితులు కూడా బాలుని స్థితికి జాలిపడ్డారు. యజ్ఞం సమాప్తి కావచ్చింది. పిల్లవాణ్ణి చంపెయ్యాలి. ఆపని చేయటానికి మునులు ఎవరూ ముందుకురాలేదు.శునఃశ్శేపుడి తండ్రి అయిన ఆజీగర్తుడే ముందుకు వచ్చి ఇందాక ఇచ్చినదాని కన్నా ఎక్కువ ధనమిస్తే పిల్లవాణ్ణి చంపుతానన్నాడు. యాగశాలలోని పండితులంతా ఆజీగర్తుణ్ణి నిందించారు. అయినా అతడు వెనకాడలేదు. రాజు అతనికి సరిపోయినంత ధనం తెమ్మన్నాడు ఇప్పించాడు.

ఇంతలో అనుకోకుండా అక్కడికి విశ్వామిత్రమహర్షి వచ్చి జరిగిందంతా తెలుసుకుని ఆపిల్లవాణ్ణి వదలి వేయమన్నాడు. వీలుకాదన్నాడు రాజు. విశ్వామిత్రుడు పరిపరివిధాలుగా చెప్పి చూశాడు. ఉపయోగం లేకపోయింది.

అప్పుడు బాలుడుకి వరుణమంత్రోపదేశం చేసి, జపం చెయ్యమన్నాడు. తానుకుడా పరమేశ్వరిని ధ్యానించటం మెదలుపెట్టాడు విశ్వామిత్రుడు.

శునఃశ్శేపుని తపస్సుకు మెచ్చి వరుణుడు ప్రత్యక్షమై యజ్ఞఫలం నాకుదక్కింది. యజ్ఞం ఆపుచేయించమన్నాడు. శునఃశ్శేపుని కట్లు స్వయంగా వరుణుడే తీసివేశాడు. అప్పుడు శునశ్శేపుడు. పండితులారా? నాతండ్రి ఎవరో చెబితే వారితో పోతాను అన్నాడు

ఇప్పుడు ధర్మ మీమాంశ వచ్చింది.

1. కన్నతండ్రి అజీగర్తుడే అయినా డబ్బుకోసం పిల్లవాణ్ణి అమ్మేశాడు కాబట్టి వాణ్ణి తండ్రిగా అంగీకరించవలసిన పనిలేదు,

2. హరిశ్చంద్రుడు తన యాగానికి పశువుగా కొన్నాడు కాబట్టి అతడు తండ్రికాదన్నారు.

చివరకు వసిష్ఠుడు లేచి అన్నదాత, భయత్రాత, విద్యదాత, ధనదాత తండ్రులుగా చెప్పబడతారు. ఇప్పుడు విశ్వామిత్రుడే శునఃశ్శేపుడికి తండ్రి అన్నాడు. విశ్వామిత్రుడు ఆపిల్లవాణ్ణి వెంటపెట్టుకుని తీసుకువెళ్ళిపోయాడు.

ఈరకంగా దేవి కరుణ వల్ల నరమేధం ఆగిపోయి రోహితుడు, శునఃశ్శేపుడు కూడా బ్రతికి బయటపడ్డారు.

# 30. శతాక్షి

జయవిజయులు వైకుంఠంలో శ్రీహరికి ద్వారపాలకులు. శాపవశాన వీరిద్దరూ దితికి హిరణ్యాక్ష, హిరణ్యకశ్యపులుగా జన్మించారు. వీరిలో హిరణ్యాక్షుని వంశీయుడు రురుడు. ఇతడి కొడుకు దుర్గముడు. మహాబలశాలి అయిన రాక్షసుడు.

దేవతలకు, రాక్షసులకు యుద్ధం జరిగినప్పుడల్లా ముందుగా రాక్షసులే విజయం సాధించినా చివరకు ఏదో ఒక ఉపాయంతో దేవతలు గెలుస్తున్నారు. లోకంలో వేదాలని అనుసరించి యజ్ఞ యాగాదులు జరుగుతున్నాయి. వాటిలో దేవతలకిచ్చే హవిర్భాగంవల్లనే వారిబలం పెరుగుతోంది. కాబట్టి వేదాలు గనక లేకుండా చేస్తే, వాటి బలము వల్ల బతుకుతున్న దేవతలు బలహీనులౌతారు. అప్పుడు వాళ్ళని నాశనం చెయ్యటం తేలిక, ఈ రకంగా ఆలోచించి హిమాలయాలకు పోయి వెయ్యి సంవత్సరాలు బ్రహ్మను గూర్చి ఘోరతపస్సు చేశాడు. అతడి తపస్సుకు మెచ్చి విధాత ఏవరం కావాలో కోరుకో అన్నాడు. అప్పుడు దుర్గముడు సృష్టికర్తకు నమస్కరించి "దేవా! దేవతలకు, బ్రాహ్మణులకు అధీనమైఉన్న వేదాలు, మంత్రాలు నాకు వశంకావాలి" అన్నాడు. 'సరే' అలాగే అన్నాడు. బ్రహ్మ.

వేదాలు, మంత్రాలు దుర్గముడి వశం అయిపోయినాయి. భూలోకంలో బ్రాహ్మణులు జపతపాదులు మానివేశారు. యజ్ఞయాగాదులు చెయ్యటం లేదు. హవిర్భాగాలు లేనందువల్ల దేవతలశక్తి క్షీణించింది. ఉన్నట్టుండి దుర్గముడు అమరావతి మీదకి దండయాత్ర చేశాడు. ఆరాక్షసుడి దెబ్బకు తట్టుకోలేక దేవతలు పారిపోయి కొండగుహలలో తలదాచుకుని ఆపరమేశ్వరుని ధ్యానించటం మొదలు పెట్టారు.

యజ్ఞయాగాదులు లేకపోటం వల్ల ధర్మం నశించి పోయింది. అదర్మం పెచ్చుమీరిపోయింది భూమ్మీద వర్షాలు కురవటం లేదు. పంటలు పండటంలేదు. నేలబీటలు వారిపోయింది. తాగటానికి గుక్కెడు నీళ్ళు లేవు. తినటానికి పట్టెడన్నం లేదు. కరువు తాండవిస్తోంది. ఎక్కడి ప్రాణులు అక్కడే ఆకలి బాధకు తాళలేక మరణిస్తున్నాయి.

అటువంటి పరిస్థితిలో కొంతమంది బ్రాహ్మణులు హిమాలయప్రాంతాలకు పోయి నిరాహారులై, కఠోరమైన నియమ నిష్టలతో పరమేశ్వరిని ప్రార్థించ సాగారు.

ప్రసీదత్వం మహేశాని। ప్రసీద జగదంబికే!
అనంతకోటి బ్రహ్మాండనాయికే! తే నమోనమః॥
నమఃకూటస్థరూపాయై చిద్రూపాయై నమోనమః॥
నమో వేదాంత వేద్యాయై భువనేశ్యై నమోనమః॥

తల్లీ ప్రసన్నురాలివై మమ్మల్ని కాపాడు. అనంతకోటి బ్రహ్మాండనాయకీ, కూటస్థరూపా,

చిద్రూపా! వేదాంత వేద్యా, భువనేశ్వరీ! నీకు నమస్కారంతల్లీ! వారి ప్రార్థనకు సంతుష్టఅయిన పరమేశ్వరి శరీర మంతా కళ్ళుకాగా వారికి దర్శన మిచ్చింది.

నీలాంజన సమప్రఖ్యం నీలపద్మాయ తేక్షణం।
సుకర్కశ సమోత్తుంగ వృత్త పీనఘనస్తనం॥
బాణ ముష్ఠించ కమలం పుష్పపల్లవ మూలకాన్।
శాకాదీన్ఫల సంయుక్తా ననంత రస సంయుతాన్॥
క్షుత్తృడ్జరా పహస్త స్తై ర్బిభ్రతీచ మహాధనుః।
సర్వసౌందర్యసారం తద్రూపం లావణ్యాశోభితం॥
కోటి సూర్య ప్రతీకాశం కరుణారస సాగరం।
దర్శయిత్వా జగద్ధాత్రీ సానంత నయనోద్భవా॥
యోచయామాసలోకేషు వారిధారాస్సహస్రశః।
నవరాత్రం మహావృష్టి రభూన్నేత్రోర్భవైర్జలైః।

తొలకరి మబ్బువంటి ఛాయతో కఠిన స్తనయుగ్మము, నూరుకనులు, కోటి సూర్యులదివ్యతేజస్సు, లోకోత్తరమైన సౌందర్యము, చేతులయందు మధురమైన రుచిగలవి, ఆకలి దప్పులను తీర్చేవి ముసలితనము రాకుండాచేసే అన్నము, కూరలు, పండ్లుధరించిమిగిలలినచేతులయందు బాణములు, ధనున్సు, కలిగి ఆదేవిదర్శనమిచ్చింది. భక్తజనుల బాధలు చూడగానే ఆమె కనుల వెంబడి నీరుకారింది. ఆ విధంగా ఏక ధాటిగా తొమ్మిది రాత్రులు కారిన కన్నీటి వలన ఓషధులన్నీ తలలెత్తాయి. తటాకాలు నిండాయి. నదులు పొంగి ప్రవహించాయి. జగత్తంతా చల్లబడింది. అప్పుడు వారంతా ఆపరమేశ్వరిని ఈ విధంగా స్తుతించారు.

నమో వేదాంత వేద్యేతే నమో బ్రహ్మస్వరూపిణి।
స్వమాయ యా సర్వ జగద్విధాత్ర్యైతే నమోనమః॥
భక్త కల్పద్రుమే దేవి భక్తార్థం దేహధారిణి।
నిత్యతృప్తే నిరుపమే భువనేశ్వరి తేనమః॥

తల్లీ ! వేదాంతవేద్యవు. బ్రహ్మస్వరూపిణివి. జగస్సృష్టికర్తవు. దివ్యశక్తి సంపన్నురాలవు. నీకునమస్కారము. భక్తులకోసం ఎప్పుడూ ఏదో ఒకరూపంలో అవతరిస్తూ ఉంటావు.

అస్మచ్ఛాన్త్యర్థ మతులం లోచ నానాం సహస్రకం।
త్వయా య తో ధృతం దేవి। శతాక్షీ త్వం తతోభవ॥

ఇప్పుడు ఆపదలు బాపి మాకు సుఖశంతులు కలిగించటానికి లెక్కలేనన్ని కనులతో దర్శనమిచ్చావు. కాబట్టి ఇకనుండిశతాక్షి అనే పేరుతో పిలవబడతావు.

తల్లీ! ఆకలిదప్పికలతో మేము నీరసించి పోయి నిన్ను స్తుతించలేకపోయాము. మమ్మల్ని కరుణించి వేదాలుకూడా మాకు అందేలా చెయ్యవలసింది".

ఆమాటలు విన్న పరమేశ్వరి తను తెచ్చిన కూరలు,ఆహారపదార్ధాలు వారందరికీ పంచి వారి ఆకలి తీర్చింది. ఇందువల్లనే ఆపరమేశ్వరి శాకంబరి" అని పిలవబడింది.

ఛారులవల్ల ఈవిషయం తెలుసుకున్న దుర్గముడు సేనాసమేతుడై హిమాలయ ప్రాంతానికి చేరి అక్కడ ఆపరమేశ్వరి చుట్టూ ఉన్న దేవతలనూ బ్రాహ్మణులనూ బాణాలతో కొట్టి బాధించసాగాడు. ఆదెబ్బలకు తాళలేక వారు "అమ్మా దుర్గముడు మమ్మల్ని చంపేస్తున్నాడు. రక్షించు"అని దేవికి మొరపెట్టుకున్నారు.

పరమేశ్వరి వారికి అభయమిచ్చి దుర్గముడు విడిచిన ఏఆయుధము వారికి తగలకుండా వారికి రక్షణగా ఒకచక్రం ఏర్పాటు చేసింది. ఆరాక్షసుడికీ, దేవికీ భీకరమైన యుద్ధం జరిగింది. ఆయుద్ధంలో పరమేశ్వరి శరీరంనుంచి

కాళికా తారిణీ బాలా త్రిపురా భైరవీ రమా।
బగలాచైవ మాతంగీ తథా త్రిపురసుందరీ॥
కామాక్షీ తులజాదేవీ జంభినీ మోహినీతథా।
ఛిన్నమస్తా గుహ్యకాళీ దశసాహస్ర బాహుకా॥
ద్వాత్రింశచ్ఛక్తయశ్చాన్యా శ్చతుష్షష్టిమితాఃపరాః।
అసంఖ్యాతా స్తతో దేవ్యస్సముద్భూతాస్తు సాయుధాః॥

| | |
|---|---|
| కాళిక | భైరవి |
| తారిణి | రమ |
| బాల | మాతంగి |
| త్రిపుర | జంభిని |
| బగళ | కామాక్షి |
| త్రిపురసుందరి | గుహ్యకాళి |
| మోహిని | ఛిన్నమస్త |

మొదలైన ముప్పైరెండు శక్తులు, వాటితో బాటుగా చతుష్షష్టిశక్తులు దివ్యమైన ఆయుధాలతో పుట్టి దివ్యాస్త్రాలు ప్రయోగిస్తూ, వీణ, వేణువు,మృదంగము, మొదలైన వాద్యాలు వాయిస్తూ, విలయ తాండవం చేస్తూ దుర్గముడి సైన్యాన్ని నాశనం చేశాయి. ఈరకంగా పోరు పదిరోజులు సాగింది. పదకొండవ రోజున పదునైన బాణాలతో పరమేశ్వరి ఆరాక్షసుణ్ణి చంపివేసింది. దుర్గముడి శరీరం నుంచి దివ్యతేజస్సు వచ్చి పరమేశ్వరిలో లీనమైంది. ఈరకంగా దుర్గముడు రాక్షసుడైకూడా పరమేశ్వరి కృపకు పాత్రుడైనాడు.

ఈరకంగా శక్తి హీనులైన హరిహరులను ఆపరమేశ్వరి మళ్ళీ శక్తివంతులను చేసింది.

# 31.శక్తిహీనులు

పూర్వకాలంలో హాలాహలులు అనే దానవులు బ్రహ్మను గూర్చి అనేక సంవత్సరాలు తపస్సు చేసి గొప్ప వరాలు పొందారు. ఆ విధంగా వచ్చిన వరబలంతో గర్వించి ముల్లోకాలను జయించారు.ఇక వైకుంఠాన్ని,కైలాసాన్ని ఆక్రమించాలని సంకల్పించి ఒక్కసారి గా హరిహరులతో యుద్ధానికి తలపడ్డారు. దేవదానవులకు కొన్నివేల సంవత్సరాలు యుద్ధంజరిగింది.ఆయుద్ధంలో చివరకు హరిహరులు హాలాహలులను హతమార్చారు. తరువాత తమభార్యల దగ్గరకు వెళ్ళి తాము ఏరకంగా యుద్ధంచేసిందీ, ఆ దానవులను ఏవిధంగా చంపిందీ, చెప్పితమ విజయగాధను వివరించారు. ఆవిజయానికి కారణంతామేనని, అంతా తమవల్లనే జరిగింది అన్నట్లుగా వర్ణించారు.

దానికి లక్ష్మీ పార్వతులు పకపకానవ్వి "మాశక్తి వల్లనే మీరు దానవ సంహారం చేశారుగానీ స్వతహాగా మీకు ఆశక్తి లేదు." అన్నారు. మాయచే ఆవరింపబడిన హరిహరులు వారిమాటలకు కోపించి, భార్యలను అవమానించారు. దాంతో లక్ష్మీపార్వతులు కోపించి అదృశ్యులైపోయారు. మరుక్షణంలోనే వైకుంఠము, కైలాసము కళావిహీనమైపోయాయి. హరిహరులు శక్తి హీనులైపోయారు. వాళ్ళకి కాళ్ళు చేతులు పనిచెయ్యటం మానేశాయి. సృష్టి అయితే జరుగుతోంది.. కానీ స్థితి లయాలు మాత్రం ఆగిపోయాయి. ఈ విపరీత పరిస్థితి ఎందుకు వచ్చిందో అర్ధం కాలేదు బ్రహ్మదేవుడికి. పరాశక్తిని మనసారాధ్యానించాడు సృష్టికర్త. దేవి దయవల్ల విషయం అర్ధమయింది. జరిగిందానికి చాలా బాధపడ్డాడు. తానే సృష్టి స్థితి లయాలు మొత్తం చూడవలసి వచ్చింది. పని ఎక్కువ కావటంతో ఉక్కిరి బిక్కిరైపోతోంది. దాంతో తన మానసపుత్రులను ప్రజాపతులను పిలిపించి జరిగిన విషయం వివరించి, "మీరు వెళ్ళి పరమేశ్వరిని ప్రసన్నురాలిని చేసుకుని హరిహరులకు శక్తులు తిరిగి వచ్చేటట్లుగా వరాలు పొందిరండి" అన్నాడు.

బ్రహ్మమాట ప్రకారము వారంతా హిమాలయాలకు వెళ్ళి పరమేశ్వరి యొక్క మాయాబీజాన్ని జపిస్తూ లక్ష సంవత్సరాలు తపస్సు చేశారు. పరమేశ్వరి వారి భక్తికి, నిష్ఠకి మెచ్చి ప్రత్యక్షమై ఏంవరం కావాలో కోరు కోమంది. హరిహరుల శక్తులు వారికి మళ్ళీ ఇప్పించమని కోరారు బ్రహ్మమానసపుత్రులు దానికి పరమేశ్వరి

"నా అంశలయిన లక్ష్మీ పార్వతులను హరిహరులు అవమానించారు. అందుకే వారు నాదగ్గరకు వచ్చేశారు. కాబట్టి హరిహరులు అశక్తులైపోయారు. లక్ష్మీ పార్వతులు నా అంశలు, వారి నెప్పుడూ అవమానించద్దు. మీకోరిక తీరుస్తున్నాను హరిహరుల శక్తులు వారికిస్తున్నాను వెళ్ళండి" అంది.

అంతలో దక్షుడు " అమ్మా!నువు కోరుకోమన్నావుకాబట్టి కోరుకుంటున్నాను. నాకు నీ అంశతో సంతతికలగాలి." అన్నాడు. దానికి పరమేశ్వరి నా అంశతో గౌరి నీకుమార్తెగా జన్మిస్తుంది. లక్ష్మీ దేవి పాలకడలిలో జన్మిస్తుంది. నీ కుమార్తెను శివుడికి, లక్ష్మి విష్ణువుకు భార్యలవుతారు." అని చెప్పి అంతర్ధానమైంది.

ఈరకంగా శక్తిహీనులైన హరిహరులను పరమేశ్వరిమళ్ళీ శక్తివంతులుగా చేసింది.

# 32. దేవీ స్థానాలు

దక్షుని కోరిక మీద పరమేశ్వరి అంశగా అతడికి దాక్షాయణి జన్మించింది. దేవి చెప్పినట్టుగానే ఆమె ఈశ్వరుడికి భార్య అయింది.

ఒకసారి దక్షుడు కూతుర్నీ అల్లుణ్ణీ ద్వేషించి యజ్ఞం ఒకటి చేశాడు. యజ్ఞ సమయంలో జరిగిన అవమానం భరించలేక సతీదేవి యోగాగ్నిలో దగ్ధమైపోయింది. ఆవిషయం తెలిసిన శివుడు వీరభద్రుణ్ణి సృష్టించాడు. వీరభద్రుడు దక్షయజ్ఞాన్ని నాశనం చేసి అతడి తలనరికేశాడు.

తరువాత యజ్ఞశాలలో పడిఉన్న సతిదేహాన్ని బుజాన వేసుకుని శివుడు శోకమూర్తియై తిరగసాగాడు. అది చూసి దేవతలు విచారించి శివుణ్ణి ఏవిధంగా అయినా సరే మామూలుగా చెయ్యమని విష్ణువును కోరారు. అప్పుడు హరి శివునికి కనిపించకుండా అతడివెనకే నడుస్తూ వీలైనప్పుడల్లా శివుని భుజాన వేలాడుతున్న పతికళేబరము యొక్క అవయవాలు తెగి పడేటట్టుగా బాణాలతో కొట్టసాగాడు. ఈరకంగా సతి అవయవాలు పడిన స్థానాల్లో శంకరుడు అనేక రూపాలు ధరించి నివసించసాగాడు. ఆప్రదేశాలకే దేవీస్థానాలు అని పేరు. అక్కడ పరమేశ్వరి స్వరూపం స్థాపించబడింది. దేశంలోని వివిధ ప్రాంతలలోని దేవీస్థానాలు అక్కడ పరమేశ్వరి పేరు ఈ విధంగా ఉన్నాయి.

| | | | |
|---|---|---|---|
| 1. | వారణాసి (ముఖంపడినచోటు) | - | విశాలాక్షి |
| 2. | నైమిశము | - | లింగధారిణి |
| 3. | ప్రయాగ | - | లలిత |
| 4. | గంధమాదనము | - | కాముకి |
| 5. | దక్షణమానసము | - | కుముద |
| 6. | ఉత్తర మానసము | - | విశ్వకామ |
| 7. | గోమంతము | - | గోమతి |
| 8. | మందరము | - | కామచారిణి |
| 9. | చైత్రరధము | - | మదోత్కట |
| 10. | హస్తినాపురము | - | జయంతి |
| 11. | కన్యాకుబ్జము | - | గౌరి |
| 12. | మలయపర్వతము | - | రంభ |
| 13. | ఏకామ్రపీఠము | - | కీర్తిమతి |
| 14. | విశ్వము | - | విశ్వేశ్వరి |
| 15. | పుష్కరము | - | పురుహూత |

| | | | |
|---|---|---|---|
| 16. | కేదారము | - | సన్మార్గదాయిని |
| 17. | హిమగిరి పుష్ఠము | - | మంద |
| 18. | గోకర్ణము | - | భద్రకర్ణిక |
| 19. | స్థానేశ్వరము | - | భవాని |
| 20. | శ్రీశైలము | - | మాధవి |
| 21. | భద్రేశ్వరము | - | భద్ర |
| 22. | వరాహగిరి | - | జయ |
| 23. | కమలాలయము | - | కమల |
| 24. | రుద్రకోటము | - | రుద్రాణి |
| 25. | కాలంజరము | - | కాళి |
| 26. | సాలగ్రామము | - | మహాదేవి |
| 27. | శివలింగము | - | జలప్రియ |
| 28. | మహాలింగము | - | కపిల |
| 29. | మాకోటము | - | మకుటేశ్వరి |
| 30. | మాయాపురి | - | కుమారి |
| 31. | సంతానము | - | అంబిక |
| 32. | గయ | - | మంగళ |
| 33. | పురుషోత్తమము | - | విమల |
| 34. | సహస్రాక్షము | - | ఉత్పలాక్షి |
| 35. | హిరణ్యాక్షము | - | మహోత్పల |
| 36. | విపాశ | - | అమోఘాక్షి |
| 37. | పుండ్రవర్ధనము | - | పాటల |
| 38. | సుపార్శ్వము | - | నారాయణి |
| 39. | త్రికూటము | - | రుద్రసుందరి |
| 40. | విపులము | - | విపుల |
| 41. | సహ్యాపర్వతము | - | ఏకవీర |
| 42. | హరిశ్చంద్రము | - | చంద్రిక |
| 43. | రామతీర్థము | - | రమణ |
| 44. | యమున | - | మృగావతి |
| 45. | కోటతీర్థము | - | కోటవి |
| 46. | మాధవవనము | - | సుగంధి |
| 47. | గోదావరి | - | త్రిసంధ్య |

| | | | |
|---|---|---|---|
| 48. | గంగాద్వారము | - | రతీప్రియ |
| 49. | శివకుండము | - | శుభానంద |
| 50. | దేవికాతటము | - | నందిని |
| 51. | ద్వారవతి | - | రుక్మిణి |
| 52. | బృందావనము | - | రాధ |
| 53. | మధుర | - | దేవకి |
| 54. | పాతాళము | - | పరమేశ్వరి |
| 55. | చిత్రకూటము | - | సీత |
| 56. | వింధ్యగిరి | - | వింధ్యవాసిని |
| 57. | కరవీరము | - | మహాలక్ష్మి |
| 58. | వినాయకము | - | ఉమా |
| 59. | వైద్యనాథము | - | ఆరోగ్య |
| 60. | మహాకాళము | - | మహేశ్వరి |
| 61. | ఉష్ణతీర్థము | - | అభయ |
| 62. | మాడవ్యము | - | మాండవి |
| 63. | మహేశ్వరీపురి | - | స్వాహా |
| 64. | భగలండము | - | ప్రచండ |
| 65. | అమరటంకము | - | చండిక |
| 66. | సోమేశ్వరము | - | వరారోహ |
| 67. | ప్రహభాసము | - | పుష్కరావతి |
| 68. | సరస్వతి | - | దేవమాత |
| 69. | సముద్రతీరము | - | పారావార |
| 70. | మహాలయము | - | మహభాగ |
| 71. | పమోక్ష | - | పింగళేశ్వరి |
| 72. | కృతశౌచము | - | సింహిక |
| 73. | కార్తికము | - | అతిశాంకరి |
| 74. | ఉత్పలావర్తము | - | లోల |
| 75. | శ్రోణసంగమము | - | సుభద్ర |
| 76. | సిద్ధవనము | - | మాత |
| 77. | భరతాశ్రమము | - | అనంగ |
| 78. | జాలంధరము | - | విశ్వముఖి |
| 79. | కిష్కింధాచలము | - | తార |
| 80. | దారువనము | - | పుష్టి |
| 81. | కాశ్మీరము | - | మేధ |
| 82. | హిమగిరి | - | భీమ |

| | | | |
|---|---|---|---|
| 83. | విశ్వేశ్వరము | - | తుష్టి |
| 84. | కపాలమోచనము | - | శుద్ధి |
| 85. | కయావరోహణము | - | మాత |
| 86. | శంఖోద్ధారము | - | ధర |
| 87. | పిండారకము | - | ధృతి |
| 88. | చంద్రభాగ | - | కళ |
| 89. | అచ్ఛోదము | - | శిఖధారిణి |
| 90. | వీణ | - | అమృత |
| 91. | బదరి | - | ఉరసి |
| 92. | ఉత్తర కురుక్షేత్రము | - | ఓషధి |
| 93. | కుశద్వీపము | - | యశోదక |
| 94. | హేమకూటము | - | మన్మథ |
| 95. | కుముదము | - | సత్యవాదిని |
| 96. | అశ్వత్థము | - | వందనీయ |
| 97. | కుబేరాగారము | - | నిధి |
| 98. | వేదవనము | - | గాయత్రి |
| 99. | శివసన్నిధి | - | పార్వతి |
| 100. | దేవలోకము | - | ఇంద్రాణి |
| 101. | బ్రహ్మముఖము | - | సరస్వతి |
| 102. | సూర్యబింబము | - | ప్రభ |
| 103. | మాతలయందు | - | వైష్ణవి |
| 104. | సతులయందు | - | అరుంధతి |
| 105. | భామలలో | - | తిలోత్తమ |
| 106. | చిత్తమున | - | బ్రహ్మకళ |
| 107. | సర్వదేహములయందు | - | శక్తి |

ఈశక్తి పీఠాలు మొత్తం ఎనిమిది వందలున్నాయి. సతీదేవి అవయవాలకు మారురూపాలుగా ఏర్పరచిన ఈపీఠాలకు వెళ్ళి అక్కడ దేవిని అర్చించినవారు చరితార్థులౌతారు. ఈపీఠాలలో బ్రాహ్మణ సమారాధన, సువాసినీపూజ, చేసినవారు ఐహిక, ఆముష్మికాలను సాధిస్తారు.

ఆ అవయవాలలో ఆమె ఉంటుంది కాబట్టి ఇక్కడ దేవీ పూజ చేసేవారిని ఆమె కరుణిస్తుంది. ఈప్రదేశాలలో మంత్రాలు త్వరగాసిద్ధిస్తాయి. ఇక్కడ మాయాబీజముచేస్తే అనతి కాలంలోనే సిద్ధిస్తుంది.

# 33. పార్వతి

దక్షయజ్ఞంలో సతీదేవి ప్రాణత్యాగం చేసిన తరువాత, శివుడు భార్యావియోగంతో తిరిగినచోట తిరక్కుండా దేశమంతా పిచ్చిపట్టిన వాడల్లే తిరుగుతున్నాడు. లోకాలను రక్షించే శివుడికి ఈదశ పట్టేసరికి లోకాలన్నీ నిర్జీవము అయిపోయినాయి. ప్రజలంతా వ్యాధిగ్రస్తులయ్యారు. వర్షాలు కురవటం మానేశాయి. పంటలు పండటం లేదు. కరువు తాండవిస్తోంది.

దితి కశ్యపుల కుమారుడు వజ్రాంగుడు. మరుత్తులు పుట్టిన తరువాత ఇతడు పుట్టాడు. దేవతలను బాధించటమే ఇతడి ధ్యేయం. ఇతడి భార్య వరాంగి. వీరి కుమారుడు తారకాసురుడు. ఇతడు బ్రహ్మను గూర్చి మహోగ్రమైన తపస్సు చేశాడు. బ్రహ్మ ప్రత్యక్షమై ఏవరం కావాలో కోరుకోమన్నాడు. తనతో సమానమైన బలం కలవాళ్ళు బ్రహ్మసృష్టిలో పుట్టకుండా వరం కావాలన్నాడు తారకాసురుడు. ఈరకంగా బ్రహ్మనుంచి అసమానమైన వరాన్ని పొంది లోకాలను బాధించటం మొదలు పెట్టాడు. దేవతలంతా బ్రహ్మదేవుని దగ్గరకు పోయి మొరపెట్టుకున్నారు. తారకుణ్ణి అపటం ఈసృష్టిలో ఎవరి వల్లాకాదు. శివుడి కుమారుడు కుమారస్వామి ఒక్కడే అతణ్ణి సంహరించగలడు" అన్నాడు బ్రహ్మ.

సతీ వియోగంతో బాధపడుతూ మతి స్థిమితం లేకుండ దేశాల వెంబడి తిరుగుతున్న శివుడికి కుమారుడెట్లా కలుగుతాడు అని ఆలోచించి విష్ణుమూర్తి సలహాపై ఆపరమేశ్వరిని ప్రార్థించటం మొదలు పెట్టారుదేవతలు. ఈరకంగా చాలా కాలం జరిగిన తరువాత చైత్ర శుద్ధనవమి శుక్రవారం నాడు మెరుపు మెరిసినట్టుగా ఒక దివ్యమైన తేజస్సు దేవతలకు కనిపించింది. కోట్లకొలది సూర్యుల వెలుగుతో ప్రకాశిస్తున్న ఆవెలుగు స్త్రీ పురుష నపుంసకత్వానికి అతీతమైంది. ఆతేజస్సుకు నాలుగు వేపులా నాలుగు వేదాలు నడుస్తున్నాయి. అదిచూడగానే దేవతలకు కళ్ళు చెదిరి పోయినాయి. కనిపించటం కష్టమైపోయింది.

అంతలో ఆతేజస్సు ఒక స్త్రీ రూపం దాల్చింది. ఈమె అపురూప సౌందర్యవతి. అటువంటి మూర్తిని ఇంతవరకు వారు ఎప్పుడూ చూసి ఉండలేదు. అమె ముఖపద్మం ముందు చంద్రుడు వెలవెలపోతున్నాడు. పసిడి మువ్వల వడ్డాణము, చిరుగజ్జెల అందెలు చిన్నగా సన్నగా ధ్వని చేస్తున్నాయి. మణులు తాపడం చేసిన తాటంకాలు. ముత్యాలు పొదిగిన నత్తు, ఉంగరాల ముంగురులు ముఖపద్మం మీద తుమ్మెదలలాగా

కదుల్తున్నాయి. సుదీర్ఘమైన కనుబొమ్మలు,మీనాక్షములు, సంపెంగపువ్వవంటి ముక్కు, దొండపండులాటి పెదవులు, దానిమ్మ గింజలవంటి పలువరుస, నవరత్నఖచిత కిరీటము ఇత్యాది అలంకారాలతో విరాజిల్లుతున్న ఆదివ్య సుందరమూర్తే పరమేశ్వరి.

దేవతలు ఆదేవిని వివిధ రకాలుగా స్తోత్రం చేశారు. శ్రీ సూక్త విధానంగా స్తుతించారు. అప్పుడు ఆదేవి దేవతలారా! మీకార్యములు పూర్తి చేసేందుకు నేనున్నాను గదా! మరి మీరెందుకు విచారిస్తున్నారు? భక్తాభీష్ట ఫలప్రదాయినిని నేను. మీకు ఏకష్టం వచ్చిందో చెప్పండి''అన్నది.

దానికి దేవలతలు తల్లీ ముల్లోకాలలోనూ నీకు తెలియని విషయం ఏదీ లేదు. తారకాసురుడు వరబలమత్తుడై లోకాలను బాధిస్తున్నాడు. వాడు శివుని కుమారుని వల్లనే మరణిస్తాడట. శివుడి పరిస్థితిచూస్తే అలా ఉంది. మరి మాకష్టాలు ఏవిధంగా తీరతాయి.' 'అన్నారు. అప్పుడు దేవి భయపడకండి. నాఅంశతో హిమవంతుడికి కుమార్తె పుడుతుంది. ఆబిడ్డకు, శివుడికి వివాహం చెయ్యండి. తారకుడు సంహరింపబడతాడు''అని చెప్పి అంతర్ధానమైంది.

కాలక్రమేణా హిమవంతుడికికుమార్తె పుట్టింది.పర్వతరాజు కుమార్తె కాబట్టి పార్వతి అని పిలువబడింది. పార్వతీ పరమేశ్వరుల వివాహం జరిగింది. వారి కుమారుడే కుమారస్వామి. దేవతల సేనాని. అతడే తారకాసురుణ్ణి సంహరించాడు.

ఈరకంగా పరమేశ్వరి కరుణవల్ల విరాగి అయిన శివుడు సంసారి కావటం, తారకాసుర సంహారం జరిగాయి.



# 34. విరాట్స్వరూపం

'ఏకమేవా ద్వితీయం బ్రహ్మ' అద్వితీయము. అంతా తానే అయి ప్రకాశించే పరమేశ్వరియే పరబ్రహ్మ స్వరూపము. ఆమె ఏకాకి తనతో సమానమైన వాళ్ళు కాని, తనకన్నా ఎక్కువైన వాళ్ళు కాని లేనటువంటిది. ఆ బ్రహ్మ తేజస్సు యొక్క సహజశక్తి మాయ. ఈ మాయ పరబ్రహ్మ స్వరూపాన్ని అంటిపెట్టుకునే ఉంటుంది. అగ్నికి వేడిలాగా, సూర్యుడికి కాంతి లాగా పరబ్రహ్మకు మాయ ఉంటుంది. ఈ మాయవల్లనే జగత్తు సృష్టించబడుతోంది. మాయ జీవుణ్ణి ఆవరించి అజ్ఞానాన్ని పెంపొందింప చేస్తుంది. దాంతో జీవుడికి వ్యామోహం పెరుగుతుంది. ఈ అవిద్యనుంచి జీవుణ్ణి కాపాడి అతడికి ముక్తికలిగించటమే సృష్టి లక్షణం. మాయను తపము, తమము. జడము, అని వివిధ పేర్లతో పిలుస్తారు. దీనికే అవిద్య అని కూడా పేరు. అవిద్య ఆత్మను ఆవరించి ఉంటుంది. అది తొలిగిపోతే ఆత్మ సాక్షాత్కారం అవుతుంది.

పరబ్రహ్మ స్వరూపమే ఆ పరమేశ్వరి. ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తుల స్వరూపము ఆమె. హ్రీంకార మంత్రముచే జపించతగినది. ఆమె. అందుకనే ఆమెను 'హ్రీంకార మంత్ర సర్వస్వా' అంటారు.సృష్టికి ముందు ఆకాశము పుట్టింది.

| | | |
|---|---|---|
| ఆకాశంనుంచి | - | వాయువు |
| వాయువునుంచి | - | అగ్ని |
| అగ్నినుంచి | - | నీరు |
| నీటి నుంచి | - | భూమి పుట్టాయి |

వీటినే పంచభూతాలంటారు. వాటి లక్షణాలను గుణాలను తన్మాత్రలు అంటారు.

| **పంచభూతాలు** | - | **తన్మాత్రలు** |
|---|---|---|
| 1.ఆకాశము | - | శబ్దము |
| 2.వాయువు | - | స్పర్శ |
| 3.అగ్ని | - | రూపము |
| 4.జలము | - | రసము |
| 5.భూమి | - | గంధము |

పంచభూతాలవల్లే సృష్టి ఆరంభమైంది. వీటినుంచి లింగదేహం పుట్టింది. దాని రూపం వాయువు. దేహము మూడు రకాలుగా ఉంటుంది.

| | | |
|---|---|---|
| 1. స్థూలదేహము | - | కంటికి కనిపంచేది |
| 2.సూక్ష్మదేహము | - | ఆత్మ |
| 3. కారణదేహము | - | వ్యక్తంకానిది. |

జగత్తు అంతా.దీనిలో బీజరూపంలో ఉంటుంది. లింగదేహానికి ఇదే కారణం.

పంచభూతాలు పంచకీ కరణ విధానంలో పుట్టాయి. అది ఎలాగంటే ఈభూతాలను ఒక్కొక్క దానినీ రెండు భాగాలుగా చేసి, ఒకభాగంలో ఆయొక్క భూతమునుంచి, రెండవభాగాన్ని మళ్ళీ నాలుగుభాగాలుగా చేసి వాటిలో మిగిలిన నాలుగు భూతాలు ప్రవేశించాయి. ఉదాహరణకి ఆకాశాన్ని రెండు భాగాలుగా చేశామనుకోండి. మొదటి దాంట్లో ఆకాశతత్త్వము ఉంటుంది. రెండవభాగాన్ని నాలుగు ముక్కలుగా చేస్తే వాటిలో వాయువు, అగ్ని, జలము, భూమి యొక్క తత్త్వాలు ఉంటాయి. దీన్ని పంచకీ కరణము అంటారు. ఈపంచకీకరణవల్ల ఏర్పడ్డ పంచభూతాలు ఒక్కక్కటి ఒక్కొక్క అవయవంగా ఏర్పడతాయి. వీటివల్లే స్థూల దేహం ఏర్పడుతుంది.

పంచభూతాల అంశల వల్ల జ్ఞానేంద్రియాలు పుట్టాయి. అదే అంతఃకరణ.వృత్తి భేదం వల్ల అంతకరణ నాలుగు భాగాలయింది. అవి.

1. మనస్సు - సంకల్ప వికల్పాలుకలది
2. బుద్ధి - నిశ్చయార్థము కలది
3. చిత్తము - నిత్యాను సంధాన పరమైనది
4. అహంకారము - అహంభావముతో నిండినది.

శరీరానికి రాజంసవల్ల కర్మేంద్రియాలు ఏర్పడ్డాయి. అవి పనిచేయటానికి కారణము ప్రాణము. అది అయిదు విధాలుగా ఉంటుంది.

1. ప్రాణము - హృదయమునందు
2. అపానము - గుదమునందు
3. వ్యానము - శరీరమంతటా
4. ఉదానము - కంఠమందు
5. సమానము - నాభియందు ఉంటాయి.

ఈ రకంగా జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, ప్రాణము, బుద్ధి, మనస్సు కలిసి లింగ దేహము ఏర్పడింది.

మాయ రెండు రకాలు

1. శుద్ధ సత్వము - మాయ
2. గుణాలతో కలిసినది - అవిద్య

మాయలో ఈశ్వరతత్త్వము ప్రతిబింబిస్తుంది. అవిద్యలో జీవుడు ప్రతిబింబిస్తాడు. అవిద్య కారణంగా ఈ ఇద్దరికీ ఇంతకుముందు చెప్పిన మూడు రకాల దేహాల మీద గల అభిమానంతో మూడు పేర్లు పెట్ట బడినాయి.

1.స్థూల దేహాభిమాని - జీవుడు
2.సూక్ష్మ దేహాభిమాని - విశ్వుడు
3.కారణ దేహిభిమాని - ప్రాజ్ఞుడు

జీవుడు వ్యష్టి దేహాన్ని, ఈశ్వరుడు సమిష్టి దేహాన్ని అభిమానిస్తారు. పరబ్రహ్మ ప్రేరణ వల్లనే ఈశ్వరుడు ఈసృష్టి చేస్తున్నాడు. చరాచర జగత్తంతా శక్తి చేత నిర్మించబడింది. ఆమే మాయ. తత్వదృష్టి కలవారికి జగత్తంతా పరబ్రహ్మమయంగానేకనిపిస్తుంది. ఉపాధి భేదం వల్ల కుండకూ, ఆకాశానికీ భేదం కనిపించినట్టుగానే మాయవల్ల పరబ్రహ్మలో భేదం కనిపిస్తుంది. సూర్యుడు ఉత్తములకు, నీచులకు కూడా కాంతినిస్తాడు. అయినా ఆయనకు ఏదోషము అంటదు. అలాగే పరబ్రహ్మకు కూడా దోషంలేదు.

ఆపరమేశ్వరియే ఈశ్వరుడు. సూత్రము మూలవిరాట్టు. త్రిమూర్తులు, వారి భార్యలు ఆమెయే. సూర్య చంద్రులు, నక్షత్రాలు ఆమే. ఆమె సర్వవ్యాపి. దొంగలలో, వ్యాధులలో, ఛండాలురిలో కూడా ఆమె ఉంటుంది. అష్టదిక్కులు, భూమ్యాకాశాలు, సప్తసముద్రాలు, నదీనదాలు, ఎడారులు, అడవులు, కొండలు, లోయలు, అన్నీ ఆమె స్వరూపమే. లోకంలోని ఉత్తములు, అధములు, పశువులు, పక్షులు, దుష్కర్మలు, సత్కర్మలు ఆమే.

ఈసృష్టి అంతా పరమేశ్వరిమయం. ఆమెయే జగత్తు. ఈజగత్తే ఆమె. ఆపరమేశ్వరి నిరాకార, నిర్గుణ స్వరూప. అయినప్పటికీ భక్తులకోరికలు మన్నించటానికి ఒకరూపం ధరించింది. ఆపరమేశ్వరి యొక్క విరాట్స్వరూపం ఏరకంగా ఉంటుంది అంటే

| | | |
|---|---|---|
| సత్యలోకం | - | శిరస్సు |
| సూర్యచంద్రులు | - | కనులు |
| దిక్కులు | - | చెవులు |
| వేదాలు | - | వాక్కు |
| వాయువు | - | ప్రాణం |
| ప్రపంచం | - | హృదయం |
| భూమి | - | కటి |
| ఆకాశం | - | నాభి |
| నక్షత్రగణం | - | రొమ్ము |
| మహర్లోకం | - | కంఠం |
| జనోలోకం | - | ముఖం |
| తపోలోకం | - | నుదురు |
| ఇంద్రాదులు | - | బాహువులు |
| అశ్వినులు | - | నాసికారంధ్రాలు. |
| గంధం | - | నాసిక |

| | | |
|---|---|---|
| రాత్రిపగలు | - | కనురెప్పలు |
| బ్రహ్మస్థానం | - | కనుబొమ్మలు. |
| జలం | - | దవడలు |
| రసం | - | నాలుక |
| యముడు | - | దంష్ట్రలు |
| స్నేహం | - | దంతాలు |
| నవ్వు | - | మాయ |
| కడకంటిచూపు | - | సృష్టి |
| లజ్జ | - | పైపెదవి |
| లోభము | - | క్రిందపెదవి |
| సముద్రాలు | - | కడుపు |
| ధర్మము | - | వీపు |
| కొండలు | - | ఎముకలు |
| నదులు | - | నాడులు |
| చెట్లు | - | కేశములు |
| చంద్రుడు | - | మనస్సు |
| రుద్రుడు | - | అంతఃకరణ |
| మేఘాలు | - | రోమాలు |
| విజ్ఞాన శక్తి | - | విష్ణువు. |

అనేక బాహువులు, వెయ్యితలలు, నానారకాల ఆయుధాలు, ధరించి కోట్లకొలది సూర్యుల కాంతితో ప్రకాశిస్తూ ఉంటుంది ఆపరమేశ్వరి. అదే విరాట్స్వరూపం.

అటువంటి పరమేశ్వరిని ధ్యానించినట్లైతే మనోవాంఛితాలు ఈడేరతాయి ఇహపరాలు సిద్ధిస్తాయి..



# 35 ప్రియవ్రతుడు

మనువులలో మొదటివాడు స్వాయంభవ మనువు.అతని భార్య శతరూప. ప్రజాపతి సలహామీద పరమేశ్వరని గురించి ఘోరమైన తపస్సు చేసి ఆమె కరుణవల్ల తను కూడా సృష్టి కర్త అయ్యేటట్లుగా వరంపొంది తండ్రి దగ్గరకువచ్చి ఏకాంత ప్రదేశం చూపిస్తే అక్కడ కూచుని సృష్టి చేస్తాను అన్నాడు. బ్రహ్మ తన కుమారుడు పరమేశ్వరినుంచి వరం పొందాడని ఆనందించాడు కాని అతను ఉండటానికి ఎక్కడా చోటులేదు. ఏంచెయ్యటానికి మార్గంతోచలేదు. అందుచేత తన తండ్రి అయిన విష్ణువును ప్రార్థించాడు.

దితి కశ్యపుల కుమారుడు హిరణ్యాక్షుడు. వైశ్వానరుని కుమార్తె ఉపదానవి ఇతని భార్య. ఇతడు దేవతలతో యుద్ధం చేసి వాళ్ళని ఓడించి, భూమిని చాపలా చుట్టి సముద్రంలో పడేశాడు.

బ్రహ్మవిష్ణువును ప్రార్థిస్తుండగా అతడి ముక్కు కొననుంచి అంగుళం పరిమాణం గల పంది ఒకటి వచ్చి అందరూ చూస్తుండగానే అది కొండంత ఎదిగిపోయింది. ఆవరాహము అమితోత్సాహముతో సముద్రంలోకి నీటిని అల్లకల్లోలం చేస్తూ లోపలికి పోయి హిరణ్యాక్షుణ్ణి చంపి, తన కోరల మీద భూమిని ఉంచి పైకిలేపింది. అదే ఆదివరాహము.

ఈరకంగా భూమి బయటకు రాగానే తండ్రి ఆజ్ఞతో స్వాయంభవుడు సృష్టి కార్యక్రమము ప్రారంభించాడు. ఇతడికి ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అని ఇద్దరు కుమారులు,ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనిముగ్గురు కుమార్తెలు కలిగారు.

ఆకూతిని - ఋచికి

దేవహూతిని - కర్దముడికి

ప్రసూతిని - దక్షునకు ఇచ్చి వివాహం చేశాడు. ఆకూతికి ఆదిపురుషుడైన యజ్ఞుడు, దేవహూతికి సాంఖ్యాచార్యుడైన కపిలుడు, ప్రసూతికి చాలా మంది కుమార్తెలు పుట్టారు. దక్షుని కుమార్తెలైన దితి, అదితి మొదలైనవారివల్లనే దేవతలు, రాక్షసులు, చెట్లు, చేమలు, జంతువులు, పశువులు, పక్షులు పుట్టాయి.

స్వాయంభవు పెద్దకుమారుడు ప్రియవ్రతుడు, బుద్ధిమంతుడు, బలవంతుడు, విశ్వకర్మకుమార్తె బర్హిష్మతి ఇతనిభార్య.

ప్రియవ్రతుడు రాజ్యంచేస్తున్నకాలంలో ఒకసారి సూర్యోదయ,సూర్యాస్తమయాలు ఆగిపోయినాయి. జగత్తును చిమ్మచీకట్లు ఆవరించినాయి. ఇలాజరిగినందుకు ప్రియవ్రతుడు విచారించి పరమేశ్వరిని ప్రార్థించి ఆమె సలహాపై తనయోగబలంతో ఈచీకట్లను మటుమాయంచెయ్యదలచుకుని సూర్యసమానమైన తనరథాన్ని భూమిమీద నడిపించాడు.

ఈవిధంగా ప్రియవ్రతుడి రథంఏడుసార్లు రాపాడటంవల్ల భూమి ఏడు ముక్కలయిపోయింది. అవే ఏడు ఖండాలు. వాటినే సప్తద్వీపాలు అన్నారు.

1. జంబూద్వీపము 5. శాకద్వీపము
2. ప్లక్షద్వీపము 6. శాల్మలీద్వీపము
3. కుశద్వీపము 7. పుష్కరద్వీపము
4. క్రౌంచద్వీపము

ఈద్వీపాలమధ్యనుంచి సముద్రం పొంగి వచ్చి ఏడు సముద్రాలుగా కనిపించింది. అవే సప్తసముద్రాలు.

1.లవణసముద్రము 5. క్షీరసముద్రము
2.ఇక్షుసముద్రము 6. సురసముద్రము
3.సర్పిసముద్రము 7.జలసముద్రము
4.దధిసముద్రము

లవణసముద్రంతో కలిసి ఉన్న జంబూద్వీపానికి తన పెద్దకుమారుడైన అగ్నీధ్రుడిని రాజుగా చేశాడు. మిగిలిన కుమారులను మిగిలిన ద్వీపాలకు రాజులను చేసి, కుమార్తెను శుక్రునకిచ్చి వివాహంచేశాడు. ఈమెకూతురే దేవయాని.

ఈరకంగా సప్తద్వీపాలను, సప్తసముద్రాలను సృష్టించినప్రియవ్రతుడు తనకుమారులను రాజులుగా చేసి వానప్రస్థానికేగి ఆపరమేశ్వరిని ధ్యానించి చివరకు సాయుజ్యంపొందాడు.

---

# 36 పరమేశ్వరి పూజ

పరమేశ్వరి ఉండే స్థానాలలో పద్దెనిమిది స్థానాలు ప్రసిద్ధికెక్కినవి. వీటినే అష్టాదశ పీఠాలు శక్తిపీఠాలు అంటారు.

లంకాయాం శాంకరీ దేవీ । కామాక్షీ కంచి కాపురీ ।
ప్రద్యుమ్నే సింహళాదేవీ । చాముండే క్రమపట్టణే ॥
అలంపురీ జోగులాంబా । శ్రీశైలే భ్రమరాంబికా ।
కొల్హా పుర్యాం మహాలక్ష్మీ । ముహుర్యా మేకవీరికా ॥
ఉజ్జయిన్యాం మహాకాళీ । పీఠాయాం పురుహూతికా ।
ఓఢ్యాణే గిరిజాదేవీ । మాణిక్యా చిత్రకూటకే ॥
హరిక్షేత్రే కామరూపా । ప్రయాగే మాధవేశ్వరీ ।
జ్వాల్యాయాం వైష్ణవీ దేవీ । గయాయాం సర్వమంగళా ॥
వారణాస్యాం విశాలాక్షీ । కాశ్మీరేచ సరస్వతి ।
ఏతానిశక్తి నామాని సాయంప్రాతస్మరేన్నరః ॥
సప్తజన్మకృతం పాపం । స్మరణేన వినస్యతి ।

అష్టాదశశక్తి పీఠాలు

| దేశముపేరు. | ప్రాంతము | శక్తిపేరు |
|---|---|---|
| 1.శ్రీలంక | సింహళము | శాంకరీదురి |
| 2.కంచి | తమిళనాడు. | కామాక్షి |
| 3.ప్రద్యుమ్న | బెంగాల్: | సింహళలేక శృంఖల |
| 4.క్రమపట్టణము | కర్నాటక | చాముండా |
| 5.అలంపురీ | ఆంధ్రప్రదేశ్ | జోగులాంబా |
| 6.శ్రీశైలము | ఆంధ్రప్రదేశ్ | భ్రమరాంబిక |
| 7.కొల్హాపూర్ | మహారాష్ట్ర | మహాలక్ష్మి |
| 8మాహురీ | గుజరాత్: | ఏకవీర |
| 9.ఉజ్జయినీ | మధ్యప్రదేశ్ | మహాకాళి |
| 10.పీఠికాపురి | బీహారు | పురుహూతిక |
| 11.ఓఢ్యాణము | ఒరిస్సా | గిరిజ |
| 12చిత్రకూటము | ఉత్తరప్రదేశ్: | మాణిక్యాంబ |

| | | |
|---|---|---|
| 13.హరక్షేత్రము | ఉత్తరప్రదేశ్ | కామరూప |
| 14.ప్రయాగ | ఉత్తరప్రదేశ్ | మాధవేశ్వరి |
| 15 జ్వాలా | పంజాబ్ | వైష్ణవి |
| 16.గయ | ఉత్తరప్రదేశ్ | మంగళగౌరి |
| 17.వారణాశి | ఉత్తరప్రదేశ్ | విశాలాక్షి |
| 18. కాశ్మీరు | కాశ్మీరు | సరస్వతి |

ఈక్షేత్రాలు దర్శించి అక్కడి దేవతలను ఆరాధిస్తే పుణ్యలోకాలు లభిస్తాయి. ఇక్కడ జపంచేస్తే మంత్రం త్వరగా సిద్ధిస్తుంది . ఈక్షేత్రాలలో తపస్సుచేసే వారన్నా, దైవాన్ని ఆరాధించే వారన్నా పరమేశ్వరికి మహాఇప్రీతి.

ఇక వ్రతాలలోకి వస్తే అనంత తృతీయావ్రతం, రసకల్యాణీ వ్రతం, శుక్రవారవత్రం, కృష్ణచతుర్దశీవ్రతం,సోమవారవ్రతం, మంగళవారవ్రతం, అనేవి ప్రధానమైన వ్రతాలు.

నవరాత్రి పూజలు రెండూ చాలా పవిత్రమైనవి, ముఖ్యమైనవి. అవి

1. వసంతనవరాత్రులు 2. శరన్నవరాత్రులు

1.వసంతనవరాత్రులు : చైత్ర శుద్ధపాడ్యమి నుంచి మొదలు పెట్టినవమి వరకూ చేసేవి. దీనినే చాలా మంది శ్రీరామనవమి పేరుతో చేస్తారు.

2. శరన్నవరాత్రులు :ఆశ్వయుజశుద్ధ పాడ్యమి నుంచి మొదలు పెట్టి నవమివరకూ చేసేవి. వీటినే దేవీనవరాత్రులు అంటారు. ఈపూజలు శ్రద్ధాభక్తులతో చేసేవారు పాపాలనుండి విముక్తులై సాయుజ్యం పొందుతారు.

ఇలాగే డోలోత్సవము, శయనోత్సవము,రథోత్సవము,జాగరణోత్సవము, మొదలైనవి చాలా ముఖ్యమైనవి. ఈ ఉత్సవాలలో కన్యలను, సుమంగళులను పూజించాలి, అన్నదానం కూడా చెయ్యాలి.

దేవీపూజ రెండు విధాలు. 1. బాహ్యపూజ 2. అంత :పూజ. బాహ్యపూజ వైదికము, తాంత్రికము అని రెండు రకాలు.

వేదాన్ని అనుసరించి చేసేది వైదికము. తంత్రాలలో చెప్పిన పద్ధతిప్రకారంచేసేది తాంత్రికము. వేదాలలో చెప్పిన ప్రకారం దైవాన్ని అర్చిస్తే పుణ్యలోకాలు వస్తాయి. కర్మపరిపక్వం చెందినవాడికి ముక్తి మార్గం లభిస్తుంది. తాంత్రిక పూజలు చేసేవారికి ఐహికఫలాలు మాత్రమే దక్కుతాయి.

అంత : పూజకేవలం జ్ఞానమయము. ముక్తి ప్రదము. వైదికులు బ్రహ్మావాదులు అంత : పూజను మాత్రమే చెయ్యాలి.

ఈరకంగా పరమేశ్వరిని అర్చిస్తే వారి కర్మల ననుసరించి పుణ్యలోకాలు, ముక్తి లభిస్తాయి.

# 37 మధూక పూజ

సంసారంసారహీనం. సాధకులు ఆపరమేశ్వరి పాదపద్మాలు గనక సేవిస్తే వారిపాపాలు, సర్వ దుఃఖాలూ పోయి శాశ్వతమైన సుఖం కలుగుతుంది.

సంవత్సరం పొడవునా దేవిని పూజించేవాడే సర్వపాపాలనుంచి విముక్తుడై ఆపరమేశ్వరిలో ఐక్యమవుతాడు. నవరాత్రులలో దేవిని పూజించేవాడు అభీష్టఫలం పొందుతాడు. దేవిని యధావిధిగా .పూజించి

| | | |
|---|---|---|
| పాడ్యమినాడు | - | నేయి |
| విదియనాడు | - | చక్కెర |
| తదియనాడు | - | పాలు |
| చవితినాడు | - | అప్పాలు |
| పంచమినాడు | - | అరటిపళ్ళు |
| షష్టినాడు | - | తేనె |
| సప్తమినాడు | - | బెల్లం |
| అష్టమినాడు | - | కొబ్బరికాయ |
| నవమినాడు | - | పేలాలు |
| దశమినాడు | - | నల్లనువ్వులు |
| ఏకాదశినాడు | - | పెరుగు |
| ద్వాదశినాడు | - | అటుకులు |
| త్రయోదశినాడు | - | శనగలు |
| చతుర్దశినాడు | - | వరిపిండి |
| పౌర్ణమినాడు | - | పాయసం |

నివేదనచేసి యోగ్యుడైన బ్రాహ్మణుడికి దానము ఇస్తే సిరిసంపదలు, ఆయురారోగ్యాలు, విద్య, బుద్ధి, ఆత్మజ్ఞానం  పొందుతారు. వారి పితృ దేవతలు ఉత్తమలోకాలు పొందుతారు.

పౌర్ణమినాడు హోమంచేసి పైన చెప్పిన పదార్థాలన్నీ దేవికి నివేదించి సద్బ్రాహ్మణుడికి దానంచెయ్యాలి.

చైత్రశుద్ధ తదియనాడు ఇప్పచెట్టును దేవతా మూర్తిగా భావించి శ్రద్ధాభక్తులతో పూజించి పంచ భక్ష్యాలను నివేదన చేస్తే కోరిన కోరికలు తీరతాయి. మధూక వృక్షము అంటే ఇప్పచెట్టు.  ఇప్పచెట్టు క్రింద దేవివిగ్రహాన్ని ఉంచి పూజిస్తే అన్ని కోర్కెలు తీరతాయి. ఈరకంగా

| | | |
|---|---|---|
| వైశాఖమాసమందు | - | బెల్లం |
| జ్యేష్ఠమాసమందు | - | తేనె |
| ఆషాఢమాసమందు | - | వెన్న |
| శ్రావణమాసమందు | - | పెరుగు |
| భాద్రపదమాసమందు | - | పంచదార |
| ఆశ్వయుజమాసమందు | - | పాయసం |
| కార్తీకమాసమందు | - | పాలు |
| మార్గశిరమాసమందు | - | ఫేణి |
| పుష్యమాసమందు | - | దధికూర్చిక (పెరుగుతో చేసిన భక్ష్యము) |
| మాఘమాసమందు | - | ఆవునెయ్యి |
| ఫాల్గుణమాసమందు | - | కొబ్బరికాయ |

ఇవిపరమేశ్వరికి ఇష్టమైన నైవేద్యాలు. ఇప్పచెట్టుకింద దేవి విగ్రహాన్ని ప్రతిష్ఠించి గాని, ఇప్పకొమ్మతెచ్చి దేవి మందిరం పైన కట్టి, దానిక్రింద దేవిప్రతిమను పెట్టిగాని పూజించాలి. ఈవిధంగా పరమేశ్వరిని పూజించి పైన చెప్పినట్లుగా ఆయా నెలలలో ఆయా వస్తువులను దేవికినివేదన చెయ్యాలి.

ప్రతిమాసంలోనూ పరమేశ్వరి ఒక్కొక్కపేరుతో పిలువబడుతుంది.

**మంగళా వైష్ణవీ మాయా కాళరాత్రి ర్దురత్యయా**
**మహామాయా మాతంగీ చ కాళీ కమలవాసినీ**
**శివా సహస్రచరణా సర్వమంగళ రూపణీ ॥**

ఈరకంగా ఆపరమేశ్వరిని చిత్తసుద్ధితో పూజించినట్లైతే బ్రాహ్మణుడు వేదవేదాంగ విశారదుడౌతాడు. క్షత్రియుడు విజయంసాధిస్తాడు. వైశ్యుడు సంపన్నుడు అవుతాడు. ఇతరకులాలవారు సుఖమయజీవితం పొందుతారు. మనోవ్యాధులు, శరీరవ్యాధులు, శత్రుబాధలు, పోతాయి. పితృదేవతలకు కూడా ఉత్తమగతులు కలుగుతాయి.

# 38. పంచశక్తులు

చరాచరమైన జగత్తును సృష్టించటం కోసం పరమేశ్వరి ఐదు రూపాలు పొందింది. అవే పంచశక్తులు. అవి

| | |
|---|---|
| 1.దుర్గ | 4. సావిత్రి |
| 2. లక్ష్మి | 5. రాధ |
| 3. పార్వతి | |

ప్రకృతి యెక్క లక్షణాలు వివరించలేము.

'ప్ర' అంటే - ప్రకృష్టము

కృ అంటే - సృష్టి అని అర్థం.

సృష్టిలో సర్వోత్కృష్టురాలైనది దేవి. ఆమే పరమేశ్వరి.

ప్ర - సత్వగుణాత్మకము

కృ - రజోగుణాత్మకము

తి - తమోగుణాత్మికము

కాబట్టి పరమేశ్వరి త్రిగుణాత్మిక

ప్ర - ప్రధమవాచకము

కృతి - సృష్టివాచకము

సృష్టికి మూలమైన దేవి ప్రకృతి అయింది. పరమేశ్వరుడు పురుషుడు. అతని ప్రతిబింబము ప్రకృతి. సూర్యునికి వేడి, అగ్నికి ఉన్నట్లే పురుషుణ్ణి కలిసే ప్రకృతి ఉంటుంది. అదే మాయ. మాయను భేదించగలిగితే పరబ్రహ్మ సాక్షాత్కారమౌతుంది.

ఆ పరబ్రహ్మస్వరూపమే జగత్తును సృష్టించాలనే సంకల్పంతో ఐదు శక్తులుగా మారింది.

1. దుర్గ :- ఆమె యొక్కరూపాలే శివప్రియ, విష్ణుమాయ, నారాయణీ, తేజోమయి, అశ్రితరక్ష పరాయణ, భ్రాంతి, నిద్ర, బుద్ధి మొదలైనవి.

2. మహాలక్ష్మి :- ఈమె సర్వసంపద్రూపిణి, సర్వమంగళ, ప్రియంవద, శోభనాంగి, పతివ్రత, కామక్రోధలోభమోహాలను దగ్గరకు రానీయనిది, భక్తానుగ్రహకారిణి,

3. పార్వతి :- ఈమె తెల్లని శరీరంతో, బుద్ధికీ, తేజస్సుకూ, శాస్త్రాలకూ, మంత్రతంత్రాలకు తల్లి. తేజోరూపిణి, ఆనందప్రదాయిని. ఈమెయే బ్రహ్మవిద్య. జపతపాలను ఫలింపచేసే దివ్యశక్తి. వాక్కు, బుద్ధి, కవిత, బోధ,ప్రతిభ అన్నీ తనే. ఈమే సరస్వతి. వీణా పుస్తక పాణి.

4. సావిత్రి :- శుద్ధస్ఫటిక స్వరూపిణి. తేజోమయి,తానే బ్రహ్మవిద్య. ద్విజుల పాలిట కల్పవల్లి. తనను ఆరాధించే వారిని కాపాడే దేవత గాయత్రి

5. రాధ :- ప్రాణాలను రక్షించే దివ్యశక్తి. భక్తులకు ధనధాన్యాలు ప్రసాదించే వరప్రదాయని. నిర్గుణ, నిరహంకార, గోలోకవాసిని. రాసక్రీడలో కృష్ణునకు దర్శనమిచ్చిన దేవి, రాసమండల సంభూత. రాసకేళీవినోద, సౌందర్యరాశి.

ఇదేవిధంగా మూలప్రకృతి అంశలై అనేకమంది స్త్రీమూర్తులున్నారు. వారిలో ముఖ్యులు

1. గంగ :- విష్ణుపాదములందు పుట్టినది. ఆవిడను తాకినంత మాత్రంచేతనే మానవుల పాపాలు పటాపంచలైపోతాయి. శివుని శిరస్సునందుంటుంది

2. తులసి :- విష్ణువు యొక్క భార్య. అతనికి నిత్యాలంకారం. సర్వదుఃఖ వినాసిని, పాపాలనూ, మానసిక తాపాలనూ పోగొట్టే దివ్యశక్తి.

3. నాగేశ్వరి :- కశ్యపుని కుమార్తె. అనంతుని చెల్లెలు. నాగమాత. జరాత్కరుని భార్య. ఆస్తికుని తల్లి

4. షష్ఠీదేవి :- పరదేవత యొక్క షష్టాంశ. అరిష్టనేమి కుమార్తె. పురిటింట్లో ఈదేవిని పూజిస్తే తల్లీ బిడ్డలకు క్షేమం.

5. మంగళచండ్రిక :- పరమేశ్వరి ముఖం నుంచి ఉద్భవించింది. మంగళవారంనాడు పూజిస్తే స్త్రీలకు సుమంగళీత్వం. ఇష్టకామ్యార్థసిద్ధి కలుగుతాయి.

6. దుర్గ :- దేవి ప్రధానాంశవల్ల పుట్టినది. శుంభనిశుంభులను సంహరించింది. భక్తాభీష్ట ఫలప్రదాయిని.

7. వసుంధర :- ఈమే భూమాత. సర్వాధార, సర్వసంపత్ప్రదాత్రి

8. స్వాహా :- అగ్నిదేవుని భార్య. దేవతలకు హవిర్భాగం అందించే దేవి.

9. స్వధ :- పితృదేవతలకు ఇచ్చే తర్పణాలు వారికి అందించేదేవి

10. దక్షిణాదేవి :- యజ్ఞపురుషుని ఇల్లాలు. దక్షణలేని కర్మలు ఫలవంతముకావు.

11. స్వస్తి :- వాయుదేవుని భార్య. ఈమెను విడిచి చేసేదానాలు ఫలించవు.

12. పుష్టి :- గణపతి భార్య

13. తుష్టి :- అనంతుని భార్య. తుష్టిలేకపోలే జగత్తుకే నష్టం

14. ధృతి :- కపిలుని భార్య. లోకాలకు ధైర్యరూపం

15. సత్యపత్నిసతి :- అందరికీ చుట్టరికం కలిపేది.

16. సంపత్తి :- ఈశ్వరుని ఇల్లాలు. ఈమె దయఉంటే లోకంలో పేదరికం ఉండదు.

17. మిధ్య :- అధర్మని అర్ధాంగి. ఈమె చెలికాడు కపటుడు.కలికాలంలో అందరూ ఈమెను పూజిస్తారు.ఈమె

| | | |
|---|---|---|
| కృతయుగంలో | - | మిధ్య, అధర్మం లేవు |
| త్రేతాయుగంలో | - | సూక్ష్మరూపి |
| ద్వాపరయుగంలో | - | అర్ధదేహి |
| కలియుగంలో | - | పూర్ణ స్వరూపిణి |

వీరే కాకుండా లజ్జ,శాంతి,బుద్ధి, మేధ,కాంతి,నిద్ర,పగలు,రాత్రి,సంధ్య,ఆకలిదప్పికలు,జరా మరణాలు,ఇంకా అనేకమైన రూపాలు ఆపరాత్పరి అంశ కలిగి ఈజగత్తును పాలిస్తున్నాయి.

# 39 సరస్వతి

పరమేశ్వరి జగాలను సృష్టించే నిమిత్తం దుర్గ, లక్ష్మి, పార్వతి, సావిత్రి, రాధ అనే పేర్లతో ఐదు భాగాలుగా అయింది. వారిలో సావిత్రియే సరస్వతి. సరస్వతిని గురించి అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. ఆమెను బ్రహ్మదేవుడు సృష్టించి, ఆయనే వివాహమాడాడు వీరు ఆది దంపతులు. సరస్వతి సంగీత సాహిత్యాలకు అధిదేవత. ఈమె వీణాపాణి. ఆవీణ పేరే కచ్ఛపి.

రాధముఖం నుంచి పుట్టిన సరస్వతి చాలా అందగత్తె. ఈమె కృష్ణుణ్ణి ప్రేమించగా కృష్ణుడు "నీకు తగినవాడను నేనుకాదు నాఅంశతో ఉన్నవాడు విష్ణుమూర్తి. అతన్ని వివాహంచేసుకో అంటాడు. ఆప్రకారమే సరస్వతి విష్ణువుకు భార్యఅయింది. ఒకనాడు లక్ష్మి సరస్వతులకు తగవువచ్చి, సరస్వతిని భూలోకంలో నదిగా పుట్టమని అక్ష్మీదేవి శపిస్తుంది. అప్పటినుంచీ సరస్వతీదేవి నదిగా మారిపోయింది. ఏమైతేనేం సరస్తతీదేవి చదువుల తల్లి.

శరన్నవరాత్రులలో ఏడవరోజు మూలా నక్షత్రం. ఆరోజు సరస్వతీ దేవి అలంకారం వేస్తారు పరమేశ్వరికి. జ్ఞానాధిష్ఠానదేవి సరస్వతి.ఇచ్ఛాశక్తిగా ఉండే ఈదేవికి బృహస్పతి, బ్రహ్మణసృతి, వాచస్పతి, వాక్పతి అనికూడాపేర్లు. ఈమె వాహనం హంస. ఈమె చేతులందు పుస్తకము, అక్షమాల, రెండుచేతులయందు వీణ ఉంటుంది.

| | | |
|---|---|---|
| పుస్తకము | - | వేదవేదాంగాలకు |
| అక్షమాల | - | శాస్త్రాలకు |
| వీణ | - | సంగీతానికి |
| వీణా తంత్రులు | - | ఇడాపింగళనాడులకు ప్రతీకలు |

కాశ్మీరపీఠం ఈదేవినిలయం. శరీరంనిండా గంధం పూసుకుని తెల్లని వస్త్రాన్ని ధరించి, తెల్లని పద్మంమీద కూర్చుని ఉంటుంది. అజ్ఞానాన్ని తొలగించి బుద్ధిని ప్రసాదిస్తుంది ఈదేవి. శుంభనిశుంభులను సంహరించింది ఈమే అని సప్తశతిలో చెప్పబడింది. అటువంటి సరస్వతిని లోకాలన్నీ పూజిస్తాయి.

**ఆరూఢా శ్వేతహంసే భ్రమతి చ గగనే దక్షిణే చాక్ష సూత్రం**
**వామేహస్తే చ దివ్యాంబరకనకమయం పుస్తకం జ్ఞానగమ్యా!**
**సావీణాం వాదయన్తీ స్వకరకరజపైః శాస్త్రవిజ్ఞాన శబ్దైః**
**క్రీడన్తీ దివ్యరూపా కరకమలధరా భారతీ సుప్రసన్నా॥**

శ్వేత పద్మాసనా దేవీ శ్వేతగన్ధానులేపనా
అర్చితా మునిభిః సర్వైః ఋషిభిః స్తూయతే సదా.

ఏవం ధ్యాత్వా సదా దేవీం వాంఛితం లభతే నరః

శుక్లాం బ్రహ్మవిసారద్వ్యాపిపరమా మాద్యాం జగద్వ్యాపినీం
వీణా పుస్తకధారిణీ మభయదాం జాడ్యాన్ధకారాపహామ్!
హస్తే స్ఫాటిక మాలికాం విదధతీం పద్మాసనే సంస్థితాం
వన్దే తాం పరమేశ్వరీం భగవతీం బుద్ధిప్రదాం శారదామ్॥

యా కున్దేన్దు తుషారహారధవళా యా శుభ్రవస్త్రావృతా
యా వీణా వరదండమండితకరా యా శ్వేత పద్మాసనా!
యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభిర్దేవైః సదావన్దితా
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యాపహా॥

మాఘశుద్ధ పంచమి విద్యారంభ దినం. ఆరోజున ఉదయాన్నే లేచి నిత్య కార్యక్రమాలు పూర్తిచేసి సంప్రదాయానుసారం కలశస్థాపన చేసి దానిముందు పుస్తకము, బంగారు నాణెము ఉంచి సరస్వతీ దేవిని షోడశోపచారవిధిని పూజించాలి. పూజానంతరము పాలు, పెరుగు, పిండివంటలు, తెల్లబెల్లం, పాయసం, చెరుకుపానకం, అప్పాలు, కొబ్బరి, అరటి పండ్లు నివేదన చేసి తెల్లనిపూలు, గంధం, సమర్పించాలి.

ఈ విధంగా పూజిస్తే సరస్వతీ దేవి ప్రసన్నురాలౌతుంది. విద్యార్థులకు మంచి చదువు, జ్ఞానము వస్తాయి. సరస్వతీ కవచం గనక జపిస్తే మానవుడు మహా మేధా సంపన్ను డౌతాడు. దీన్ని బ్రహ్మ భృగువుకు చెప్పాడు. దీనివల్లే వాల్మీకి కవి అయినాడు. బృహస్పతి దేవగురువైనాడు. శుక్రుడు దైత్యపూజితుడైనాడు. వ్యాసుడు సరస్వతీ కవచ ధారణతో వేదాలు విభజించి పద్దెనిమిది పురాణాలు వ్రాశాడు.

## సరస్వతీ కవచము

దీనికి ప్రజాపతి ఋషి. బృహస్పతిఛందస్సు అధిదేవత శారదాదేవి. సర్వతత్త్వ విజ్ఞాన సర్వార్థ సాధన కవితా సామర్థ్యములు వినియోగము.
ఈ సరస్వతీకవచం జపంచేసిన వారికి అసమాన మైన యశస్సు, కవితా వైభవము, పాండిత్యము సిద్ధిస్తాయి.

'శ్రీం హ్రీం సరస్వత్యై స్వాహా శిరోమే పాతు సర్వదా
శ్రీం వా గ్దేవతాయై స్వాహా ఫాలంమే సర్వదావతు
ఓం హ్రీం సరస్వత్యై స్వాహా ఇతి శ్రోత్రేపాతు నిరంతరమ్
ఓం శ్రీం హ్రీం భగవత్యై స్వాహా నేత్రయుగ్మం సదావతు.
ఐం హ్రీం వాగ్వాదిన్యై స్వాహా నాసాం మే సర్వదావతు.

ఓం హ్రీం విద్యాధిష్ఠాతృ దేవ్యై స్వాహా చోష్ఠం సదావతు.
ఓం హ్రీం బ్రహ్మై స్వాహేతి దంతపంక్తిం సదావతు.
ఐమి త్యేకాక్షరో మంత్రో మమ కంఠం సదావతు.
ఓం శ్రీం హ్రీం పాతు మే గ్రీవాం స్కంధౌ మే శ్రీం సదావతు.
ఓం హ్రీం విద్యాధిష్ఠాతృ దేవ్యై స్వాహా వక్షస్సదావతు.
ఓం హ్రీం విద్యాస్వరూపాయై స్వాహా మే పాతు నాభికామ్.
ఓం హ్రీంక్లీం వాణ్యై స్వాహేతి మమ హస్తౌ సదావతు
ఓం సర్వవర్ణా త్మికాయై స్వాహా పాదయుగ్మం సదావతు.
ఓం వాగధిష్ఠాతృ దేవ్యై స్వాహా సర్వం సదావతు.
ఓం సర్వకంఠ వాసిన్యై స్వాహా ప్రాచ్యాం సదావతు
ఓం సర్వ జిహ్వాగ్రవాసిన్యై స్వాహాగ్నిదిశి రక్షతు.
ఓం హ్రీం శ్రీం క్లీం సరస్వత్యై బుధజనన్యై స్వాహా సతతం మంత్రరాజోయం
దక్షిణే మాం సదావతు.

ఐం హ్రీం శ్రీం త్ర్యక్షరో మంత్రో నైరృత్యాం సర్వదావతు.
ఓం ఐం జిహ్వాగ్రవాసిన్యై స్వాహా మాం వారుణేవతు.
ఓం సర్వాంబికాయై స్వాహా వాయవ్యే మాం సదావతు
ఓం ఐం శ్రీం క్లీం గద్యవాసిన్యై స్వాహా మా ముత్తరేవతు
ఐం సర్వశాస్త్ర వాసిన్యై స్వాహైశాన్యాం సదావతు.
ఓం హ్రీం సర్వపూజితాయై స్వాహా చోర్ధ్వం సదావతు.
హ్రీం పుస్తకవాసిన్యై స్వాహాధో మాం సదావతు
ఓం గ్రంథ బీజ స్వరూపాయై స్వాహా మాం సర్వతోవతు.

# 40. గంగ

పరమపావని గంగ పుణ్యనది. తాకినంత మాత్రంచేతనే మానవుల పాపాలను హరించి వేస్తుంది. కర్దముడి కుమార్తె కళ. ఈమెకూ మరీచికీ వివాహమైంది. కళా మరీచులకు ఒకపుత్రిక జన్మించింది. ఈమె పేరు పూర్ణిమ. పరమ విష్ణుభక్తురాలు. విష్ణుమూర్తిని గూర్చి అనేక సంవత్సరాలు తపస్సు చేసింది. ఆవె తపస్సుకు మెచ్చి విష్ణుమూర్తి ప్రత్యక్షమై ఏవరం కావాలో కోరుకోమన్నాడు. అప్పుడు పూర్ణిమ స్వామీ నీపాదాలు కడగాలి అని కోరికగా ఉంది"అంది. మరుజన్మలో నీకోరిక తప్పక తీరుతుంది అని చెప్పి అంతర్ధానమైనాడు విష్ణుమూర్తి.

దితి కశ్యపులకుమారుడు హిరణ్యాక్షుడు. అతని కుమారుడు ప్రహ్లాదుడు. మహావిష్ణుభక్తుడు. ప్రహ్లాదుని కుమారుడు విరోచనుడు. ఇతని కుమారుడు బలిచక్రవర్తి. మంచి ధర్మపరుడు. ఆడితప్పనివాడు. దేవదానవులకు సహజమైన విరోధం ఉంది. దానికారణంగా బలి ఇంద్రుడి మీదకి దండెత్తి అతన్ని ఓడించి ఇంద్రసింహాసనం అధిష్టించాడు. దేవతలందరూ పోయి విష్ణువును శరణువేడారు.

బలిచక్రవర్తి త్రిలోకాధిపతి అయిన సందర్భంగా ఒక యజ్ఞం తలపెట్టాడు. అడిగిన వారికి లేదనకుండా దానమిచ్చాడు. బలి దుర్మదాన్ని అణచటానికి విష్ణుమూర్తి వామనావతారం ఎత్తి వచ్చి మూడడుగుల నేల అడిగాడు. ఇస్తానన్నాడు బలి. విష్ణుమూర్తి ఒక అడుగుతో భూమిని, రెండవ అడుగుతో ఆకాశాన్ని ఆక్రమించి మూడవ అడుగు బలిచక్రవర్తి నెత్తిన ఉంచి అతణ్ణి పాతాళానికి తొక్కేశాడు.

ఆకాశం ఆక్రమించిన పాదాన్ని దేవతలందరూ పూజించారు. బ్రహ్మ తనకమండలంలోని నీటితో ఆపాదాన్ని కడిగాడు. ఆనీరే నదియైసాగింది. అదే గంగానది. విష్ణుపాదములనుంచి పుట్టింది. ఈరకంగా పూర్ణిమ యెక్క కోరికతీరింది.

పూర్వకాలంలో అసితుడు అని ఒక రాజుండేవాడు. హైహయులు అతని రాజ్యం ఆక్రమించి అతణ్ణి రాజ్యంనుంచి వెళ్ళగొట్టారు. అసితుడు తన భార్యలతో సహా అరణ్యానికి పోయాడు. అప్పుడు అతని భార్య గర్భవతి. అరణ్యప్రాంతంలోనే రాజు మరణించాడు. చ్యవనుడు అనే ఋషి రాజు భార్యలను తెచ్చి ఆశ్రమంలో ఉంచాడు. అందులో ఒకామె గర్భవతి అని తెలిసి మిగిలిన సవతులు ఆమెకు విషం పెట్టారు. మహర్షి దయవల్ల గర్భానికి ఏప్రమాదం రాలేదు. విషంతో సహా కుమారుడు పుట్టాడు. అందుకని వాడికి సగరుడు అని పేరుపెట్టారు. సగరుడు పెద్దవాడై తనరాజ్యాన్ని మళ్ళీ సంపాదించుకున్నాడు. ఇతడు అయోధ్యా నగరాన్ని పాలించాడు. ఇతనికి . 1. శైభ్య 2. వైదర్భి అని ఇద్దరుభార్యలు.

సగరుడికి చాలాకాలం సంతానం లేదు. చివరకు చ్యవనమహర్షి దయవల్ల శైబ్యకు అందగాడైన అంసుమంజుడు పుట్టాడు. వైదర్భి చాలాకాలం పాటు గర్భాన్ని మోసి చివరకు ఒక మాంసంపు ముద్దను ప్రసవించింది. ఆముద్దను చూసి దుఃఖిస్తూ శివుణ్ణి ప్రార్ధించగా, అతడు ఆమె ప్రార్ధన ఆలకించి ఆపిండాన్ని అరవై వేలముక్కలుగా చేసి ప్రాణం పోశాడు. ఈరకంగా వైదర్భికి అరవైవేలమంది కుమారులు కలిగారు.

సగరుడు అశ్వమేధయాగం చెయ్యసంకల్పించి తన అరవై వేలమంది కుమారుల్ని అశ్వానికి రక్షణగా పంపాడు. ఆగుర్రం అటూఇటూ తిరుగుతూ చివరకు పాతాళానికి పోయి కపిలమహర్షి ఆశ్రమం చేరింది. అక్కడ ఆమహర్షి తపోదీక్షలో ఉన్నాడు. గుర్రం ఆయన వెనక నుంచున్నది, సగర పుత్రులు గుర్రాన్ని వెదుకుంటూ వచ్చి ఇతడు గుర్రాన్నిఎత్తుకు వచ్చి ఏమీ తెలియనట్టు కళ్ళు మూసుకుని కూచున్నాడనుకుని మహర్షిని హేళన చేశారు. దాంతో మహర్షి కోపించి కళ్ళు ఎర్రచేశాడు. ఆవేడికి సగర పుత్రులు భస్మమైపోయారు.

ఈవిషయం తెలిసి అంసుమంజుడు తన అన్నలకు పుణ్యలోకాలు ప్రాప్తింప చెయ్యటానికి గంగానదిని భూలోకానికి తేవాలి అని సంకల్పించి చాలా సంవత్సరాలు తపస్సుచేసి అతని కోరిక తీరకుండానే మరణించాడు. అంసుమంజుని కుమారుడు అంసుమంతుడు కూడా ఇదేకోరికతో తపస్సుచేస్తూనే తనువు చాలించాడు. ఇతని కుమారుడు భగీరదుడు, విష్ణుభక్తుడు. గంగను భూలోకానికి తెచ్చి తన తాతలకు పుణ[illegible]ను ప్రాప్తింపచెయ్యాలని తపస్సు ప్రారంభించాడు. అ[illegible] తపస్సుకు మెచ్చి విష్ణు[illegible]గంగకు భగీరధునితో వెళ్ళటానికి అనుజ్ఞ ఇచ్చాడు.

[illegible]గంగ, లక్ష్మి, సరస్వతి ముగ్గురూ విష్ణుమూర్తి భార్యలు. వీరు ముగ్గురూ భర్త దగ్గర ఉన్నప్పుడు గంగ, విష్ణువును ప్రేమగా చూసింది. విష్ణువుకూడా గంగను అలాగే చూశాడు. సరస్వతి అదిసహించలేక గంగను భూలోకంలో నదివై పుట్టమని శపించింది. ఈశాపం కారణంగా భగీరదుని వెంట భూలోకానికి వచ్చింది గంగ.

ఆకాశం నుంచి వస్తున్న గంగ ఒక్కసారిగా భూమిమీద పడితే భూలోకం అతలాకుతలం అయిపోతుంది కాబట్టి శివుణ్ణి ప్రార్ధించి అతని శిరసున గంగను ధరించమన్నాడు భగీరధుడు అప్పుడు శివుడు గంగను తన శిరసున ధరించి కొద్దిగా భూలోకంలోకి వదిలాడు.ఈరకంగా భగీరధుని చేత భూలోకానికి తేబడింది కాబట్టి గంగకు భాగీరధి అని పేరువచ్చింది.

భగీరధుని వెంట బయలుదేరింది గంగ. త్రోవలో అడవులు, ఎడారులు, అన్నీముంచి వేస్తోంది. ఒకానొకచోట అడవిలో చిన్న మునిపల్లె. జహ్నుడు అనే మహర్షి నివసిస్తున్నాడు. గంగ ఉద్భృతంగా ప్రవహిస్తూ ఆ ముని వాటికను కుడా ముంచెత్తుతోంది.

చూశాడు మహర్షి. ఉప్పొంగి వస్తున్న గంగను ఒక్కసారిగా ఆచమనం చేశాడు. చూశాడు భగీరథుడు. వెళ్ళి ఆమహర్షిని ప్రార్థించాడు. ఇంతకాలం తపస్సు చేసి సాధించిన ఫలితం వృధా అయిపోతోంది. కరుణించమని వేడుకున్నాడు. ఆమహర్షి కనికరించి గంగను తనచెవి గుండా వదిలి పెట్టాడు. జహ్నుడను మహర్షి చేత వదలబడింది కాబట్టి జాహ్నవి. జహ్నము (చెవి)నుంచి బయటకు వచ్చింది కాబట్టి జాహ్నవి అని పిలవబడింది గంగ. ఈరకంగా అష్టకష్టాలు పడి తన తాతలైన సగరులకు ఉత్తమగతులు కల్పించాడు భగీరథుడు. గంగభూలోకంలో స్థిరనివాసం ఏర్పాటు చేసుకుని పాపులను పునీతులుగ చేస్తోంది.

చంద్రవంశపు రాజులలో ప్రతీపుడు అనేవాడు సద్గుణ సంపన్నుడు. గంగానదీతీరంలో ఇతడు తపస్సు చేస్తుండగా గంగ ఇతణ్ణి మోహించి స్త్రీరూపం దాల్చి వచ్చి కుడితొడమీద కుర్చుని తనను భార్యగా స్వీకరించమంది. ఆరాజు ఏకపత్నీవ్రతుడు. అదీగాక కుడితొడమీద కూర్చున్న గంగ కూతురు లేక కోడలుతో సమానము. అందుచేత తన కుమారుడైన శంతనుణ్ణి వివాహమాడమని చెప్పాడు.

ప్రభాతా ప్రజాపతుల కుమారుడు ప్రభాసుడు. అంగిరసుని కుమార్తె యోగసిద్ధిని వివాహమాడాడు.ఇతడు వసువులలో ఎనిమిదవవాడు.

వసువులు ఎనిమిదిమంది. వీరినే అష్టవసువులు అంటారు. వీరు

| | |
|---|---|
| 1. ఆపుడు | 5. అనిలుడు |
| 2. ధ్రువుడు | 6. అనలుడు |
| 3. సోముడు | 7. ప్రత్యూషుడు |
| 4. ధరుడు | 8. ప్రభాసుడు |

వసువులందరూ ఒకనాడు వసిష్ఠుడి ఆశ్రమానికి వెళ్లి అక్కడ హోమధేనువు నందినిని చూశారు. ప్రభాసుని భార్య ఆధేనువు తనకు కావాలి అంది. వసిష్ఠుడు ఇవ్వనన్నాడు. అందుకని వసువులందరూ కలిసి ఆధేనువును అపహరించ ప్రయత్నించారు. ఇది తెలిసిన వసిష్ఠుడు వసువులను భూలోకంలో జన్మించమని శపించాడు.

గంగా శంతనుల వివాహం జరిగింది. వారికి పుట్టిన ఏడుగురు కుమారులను నదిలో పారేసింది గంగ. ఎనిమిదవాణ్ణి పారెయ్యటానికి ఒప్పుకోలేదు శంతనుడు. ఆపిల్లవాడే దేవవ్రతుడు. జన్మాంతం బ్రహ్మచారిగానే ఉంటానని, రాజ్యాధికారం వదులుకుంటున్నాననీ భీషణమైన ప్రతిజ్ఞ చేశాడు కాబట్టి భీష్ముడు అని పిలువబడ్డాడు. స్వచ్ఛంద మరణాన్ని పొందగలిగిన మహానుబావుడు. కురుక్షేత్ర సంగ్రామానికికారకుడైన భీష్మపితామహుడు.

# 41. వేదవతి

బ్రహ్మమానస పుత్రుడు దక్షసావర్ణి. ఒకమనువు. ఇతని మనుమడు ధర్మసావర్ణి. అతని కుమారుడు విష్ణుసావర్ణి. ఇతడి కుమారుడు దేవసావర్ణి. దేవసావర్ణి కుమారుడు రాజసావర్ణి. ఇతడి కుమారుడు వృషధ్వజుడు. గొప్ప శివభక్తుడు. శివుని యొక్క అనుగ్రహం వల్ల సిరిసంపదలతో సుఖంగా ఉన్నాడు. శివుడు తప్ప వేరే దైవములేదు అని ఇతని వాదన. అందుకు సూర్యుడు కోపగించి అతని ఐశ్వర్యము అంతరించి పోవాలని శపించాడు.

వృషధ్వజుని కుమారుడు హంసధ్వజుడు. ఇతనికి ఇద్దరు కుమారులున్నారు. 1.ధర్మధ్వజుడు 2.కుశధ్వజుడు. కుశధ్వజుని భార్య మాలావతి. సూర్యుని శాపం వల్ల వీరి వంశంలోధనం లేకుండా పోయింది.ధర్మధ్వజకుశధ్వజులు పరమేశ్వరి గూర్చి కఠోర నియమాలతో తపస్సు చేశారు. ఆతపస్సుకు మెచ్చి దేవిప్రత్యక్షమై ఏంవరంకావాలో కోరుకోమన్నది. దరిద్రంతో అలమటిస్తున్న కుశధ్వజుడు, తల్లీ! లక్ష్మీదేవి నాయింట పుట్టాలి"అన్నాడు. తథాస్తు అంది పరమేశ్వరి.

కొంతకాలానికి కుశధ్వజుని భార్య మాలావతి ఒకకుమార్తెను ప్రసవించింది. ఆపిల్ల పుట్టే సమయానికి అక్కడ వేదం వినిపిస్తోంది. అందుకని ఆపిల్లకు వేదవతి అని పేరు పెట్టారు. వేదవతి లక్ష్మీదేవి అంశన పుట్టింది.

వేదవతి పెరిగి పెద్దదయింది. శ్రీమహావిష్ణువే తనకి భర్తకావాలని దగ్గరలో ఉన్న అడవికి పోయి తపస్సు ఆరంభించింది. కొంతకాలానికి అశరీరవాణి వేదవతీ నీ కోరిక ఈజన్మలో కాదు. వచ్చే జన్మలో తీరుతుంది"అని చెప్పింది.

ఒకరోజు ఒక రాక్షసుడు శధ్వజుని దగ్గరకు వచ్చి వేదవతిని నేను ప్రేమించాను. మావివాహం జరిపించు అన్నాడు. కుశధ్వజుడు దానికి ఒప్పుకోలేదు. అందుకని కోపగించి రాక్షసుడు కుశధ్వజుణ్ణి చంపేశాడు. భర్త చనిపోయాడనే దిగులుతో అతని భార్య మాలావతి కూడా మరణించింది. ఈరకంగా తల్లి తండ్రులను పోగొట్టుకున్న వేదవతి వంటరిదై, ఇంటి దగ్గర ఉండలేక గంధమాధన పర్వతానికి వెళ్ళి కఠోర నియమాలతో తపస్సు ప్రారంభించింది.

ఒకనాడు రావణుడు అత్రోవన పోతూ వేదవతి ఆశ్రమానికి వచ్చాడు. అతనికి అర్ఘ్య పాద్యాదులిచ్చి గౌరవించింది వేదవతి. ఆశ్రమంలో విశ్రాంతి తీసుకుంటూ వేదవతి సౌందర్యాన్ని చూసి కలవరపడ్డాడు. అతని మనస్సు నిలువలేదు. వెంటనే వేదవతితో తనను వివాహం చేసుకోమని అడిగాడు. దానికి వేదవతి, తాను శ్రీహరిని తప్ప ఇతరులను వివాహం చేసుకోనని చెప్పింది. తన కోరిక కాదన్నందుకు రావణుడు కోపించి వేదవతి చెయ్యి పట్టుకున్నాడు.

చెయ్యివిడిపించుకుని నీచుడా! నన్నుతాకినందుకు ఫలితం అనుభవించు. రాబోయే కాలంలో నావల్లనే నీవంశం నాశనమవుతుంది"అని శపించి ఆపరమేశ్వరిని ప్రార్థించి యోగాగ్ని ప్రజ్వలింపజేసి అందులో తను దగ్ధమైపోయింది. రావణుడు జరిగినదానికి చాలా విచారించి వేదవతి శరీరాన్ని సముద్రంలో పారేసి లంకకు వెళ్ళిపోయాడు. వేదవతే మరుజన్మలో సీతగా పుట్టి రావణ సంహారానికి కారణమైంది. ఈరకంగా పరమేశ్వరి కృపవల్ల వేదవతి శీలం నిలబడింది.

# 42. తులసి

రాజసావర్ణి కుమారుడు వృషధ్వజుడు. అతని కుమారుడు హంసధ్వజుడు. ఇతనికి ఇద్దరు కుమారులు 1.ధర్మధ్వజుడు 2.కుశధ్వజుడు.

ధర్మధ్వజుడు నిజంగానే ధర్మమూర్తి. చుట్టుపక్కల గల రాజ్యాలన్నీ జయించి ప్రజారంజకంగా పాలిస్తున్నాడు. ఇతని భార్య మాదవి. గుణవతి,శీలవతి.

కొంతకాలానికి ధర్మధ్వజుడికి మాధవి వలన ఒక ఆడపిల్లపుట్టింది. ఆసమయంలో అన్నీ శుభాలేజరిగినాయి. దేవతలు పూలవాన కురిపించారు. పుట్టిన బిడ్డ అందాలరాసి, కుందనపుబోమ్మ. సర్వలక్షణ సమన్వితమైన ఆబిడ్డకు తులసి అని నామకరణం చేశారు. నామకరణం కాగానే ఆపిల్ల పదహారు సంవత్సరాల బాలిక అయిపోయింది. అదిచూసి జనులందరూ ఆశ్చర్యపోయారు. వేను విష్ణువును తప్ప అన్యుణ్ణి వివాహమాడను అని చెప్పి బదరికావనానికి వెళ్ళి విష్ణుమూర్తిని గూర్చి తపస్సు చేయటం ప్రారంభించిందితులసి పంచాగ్నుల మధ్యన ఉండి పదివేల సంవత్సరాలు తపస్సు చేసింది. పంచాగ్నులు అంటే ఐదు రకాల అగ్నులు.

1. పూర్వాగ్ని
2. దక్షిణాగ్ని
3. పశ్చిమాగ్ని
4. ఉత్తరాగ్ని
5. సూర్యుడు

| | | |
|---|---|---|
| ఆకులు మాత్రమే ఆహారంగా | - | పదివేల సంవత్సరాలు, |
| వర్షాకాలంలో నీట మునిగి | - | పదివేల సంవత్సరాలు, |

శీతాకాలంలో గాలినే ఆహారంగా ఆరుబయట చలిలోముపై వేలసంవత్సరాలు.

ఈరకంగా మొత్తం లక్ష సంవత్సరాలు తపస్సు చేసింది.

ఆమె తపస్సుకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమై ఏవరం కావాలో కోరుకోమన్నాడు. దానికి తులసి" ఓదేవా! పూర్వజన్మలో నేను ఒక గోపికను. నేను కృష్ణునితో ఉండగా చూసిన రాధ నన్ను మానవ జన్మ ఎత్తమని శపించింది. అప్పుడు కృష్ణుడు నన్ను ఓదార్చి నాలుగు చేతులు కలవాడు నాఅంశతో పుట్టి నిన్ను వివాహమాడతాడు అని చెప్పాడు. కాబట్టి నాకోరిక ఫలింపచెయ్యి"అన్నది. దానికి బ్రహ్మ

అమ్మా! శ్రీకృష్ణుని చెలికాడు సుదాముడు అనేవాడుండేవాడు. ఒకనాడు కృష్ణుడు గోపికలతో విహరిస్తున్న సమయంలో రాధ చూసి శ్రీకృష్ణుడిని పరుషంగా మాట్లాడింది. దానికి కోపించిన సుదాముడు రాధతో నువ్వెందుకు కృష్ణుణ్ణి తిడతావు? అన్నాడు. అప్పుడామెకు సుదాముడిపై కోపము వచ్చి రాక్షసుడుగా పుట్టమని శపించింది. ఆసుదాముడు దానవ వంశంలో పుట్టాడు. కృష్ణుని లాగానే నాలుగు చేతులు బ్రహ్మ తేజస్సు కలిగి

ఉంటాడు. అతడిపేరు శంఖచూడుడు. అతడే నీకు భర్త అవుతాడు. నీలాగే అతడు కూడా పూర్వజన్మ జ్ఞానం కలవాడు.

తరువాత కాలంలో విష్ణువు భూమిమీద పుట్టినప్పుడు నువ్వు అతణ్ణి చేరుకుంటావు. నీకు వృక్షరూపం వస్తుంది. విష్ణువుకు ప్రాణాలకన్నా ప్రియురాలవవుతావు. బృందావనంలో ఉండే నీకు బృంద అని కూడా పేరొస్తుంది"అన్నాడు.

కశ్యపప్రజాపతికి దనువునందు పుట్టినవాడు విప్రచిత్తుడు. ఇతడు హిరణ్య కశ్యపుని సోదరియైన సింహకను వివాహమాడాడు. ఇతని కుమారుడు దంభుడు. దంభుడు పుత్ర సంతానం కోసం విష్ణుమూర్తిని గురించి ఘోరమైన తపస్సు చేసి శంఖచూడుడు అనే కుమారుణ్ణి కన్నాడు. శంఖచూడుడడు బ్రహ్మను గూర్చి తపస్సు చేశాడు. బ్రహ్మ ప్రత్యక్షమై ఇతడికి కృష్ణకవచమిచ్చి అదినీవద్ద ఉన్నంతవరకు నీకు ఏ ఆపదా రాదు. బదరికా వనంలో తులసి ఉన్నది. వెళ్ళి ఆమెను వివాహమాడు అన్నాడు.

బదరికావనం చేరిన శంఖచూడుడికి ఒంటరిగా ఉన్న తులసి కనిపించింది. దగ్గరకు వెళ్ళి పలకరించాడు. పరిచయాలు కాగానే ఇద్దరి తనువులూ పులకించినాయి. పూర్వజన్మల బంధం, దైవానుగ్రహం అలా ఉన్నాయి. ఒకరినొకరు కోరుకున్నారు. గాంధర్వవిధిని వారి వివాహం జరిగిపోయింది.

వీరి దాంపత్యం చాలాకాలం సుఖంగాసాగింది. కానీ శంఖచూడుని నైజము మళ్ళీ బయటకు వచ్చింది. యజ్ఞాలు పాడుచేస్తున్నాడు. మునులను బాధిస్తున్నాడు.

శంఖచూడుని దుశ్చర్యలకు తట్టుకోలేక దేవతలు త్రిమూర్తులను ఆశ్రయించారు. వారంతా కలిసి ఆలోచించి శంఖచూడునితో యుద్ధానికి శివుణ్ణి పంపారు. శివుడు భూత ప్రేత గణాలతో పాటుగా కుమారస్వామినీ, కాళినీ వెంటపెట్టుకుని యుద్ధానికి వెళ్ళాడు. దేవతలందరికీ నమస్కరించి శంఖచూడుడు యుద్ధం ప్రారంభించాడు.

పోరుఘోరంగా జరిగింది. కుమారస్వామి ఆరాక్షసుని చేతిలో చిత్తైపోయాడు. కాళి అతణ్ణి ఏమీ చెయ్యలేకపోయింది. ఆలోచించాడు విష్ణుమూర్తి.

శంఖచూడిని దగ్గర కృష్ణకవచమున్నది. అది ఉన్నంత వరకూ అతనికి అపజయంలేదు. పైగా అతని భార్య పతివ్రత. కాబట్టి అతని కవచం తీసుకోవాలి. అతని భార్య పాతివ్రత్యం చెడగొట్టాలి.అప్పుడుగాని శంఖచూడుడు మరణించడు. అందుకని విష్ణువు వృద్ధ బ్రాహ్మణ రూపంలో వచ్చి శంఖచూడుని కవచం దానమడిగాడు. వచ్చిన వాడు విష్ణువని, తనకు కాలం తీరిపోయిందని తెలిసికూడా తన కవచాన్ని దానం చేశాడు శంఖచూడుడు. ఆకవచం ధరించి అచ్చు శంఖచూడునిలానే తయారయి తులసి దగ్గరకు వెళ్ళి ఆరాత్రంతా ఆమెతో సుఖంగా గడిపాడు విష్ణువు. వచ్చినవాడు తన భర్తే అనుకుంది తులసి. ఆమె పాతివ్రత్యం చెడింది. అంతే మరుక్షణంలో శివుడు తన శూలంతో శంఖచూడుని తలనరికేశాడు.

కేళీవిలాసాలలో తేలి ఆడుతున్న తులసివి శంఖచూడుని మీద అనుమానం వచ్చి ఎవరునువ్వు అని గద్దించింది. విష్ణువు తన నిజస్వరూపంతో ప్రత్యక్షమైనాడు. తులసి కోపం హద్దులు దాటి పోయింది. మోసంతో తన భర్తను చంపి, తన శీలాన్ని హరించిన విష్ణువును పాషాణమై పొమ్మని శపించింది . అప్పుడు విష్ణువు తులసి ఓదారుస్తూ శంఖచూడిని శరీరంలోని ఎముకలు శంఖజాతికి మూలమౌతాయి. వాటిలో పోసిన నీరు గంగా జలంలాగా పవిత్రమౌతుంది. శంఖధ్వని వినిపించిన చోట లక్ష్మీదేవి ఉంటుంది. నీవుకూడా ఈశరీరాన్ని వదలగానే దివ్యరూపం దరిస్తావు. నీశరీరం గండకీనది రూపంలో ప్రవహిస్తూ ఉంటుంది. నువ్వు పవిత్రమైన తులసి వృక్షం అవుతావు. తులసి దళాలను తాకినంత మాత్రం చేతనే పాపాలు ప్రక్షాళనమైపోతాయి. తులసి దళాలు నీటిలో వేసి స్నానం చేస్తే కోటి తీర్థాలలో స్నానంచేసిన ఫలితం వస్తుంది. తులసి దళాలు కలిపిన నీటితో అభిషేకం చేస్తే సహస్ర ఘటాభిషేకం చేసిన ఫలం వస్తుంది. తులసి దళం దానం ఇస్తే వేయిగోవులు దానం చేసిన ఫలం వస్తుంది. మరణ సమయంలో తులసి తీర్థం గొంతులో పోస్తే ఆజీవి పుణ్యలోకాలకు పోతాడు. నిత్యము తులపి తీర్థం తాగేవాడికి లక్ష అశ్వమేధయాగాలు చేసిన ఫలం వస్తుంది. తులసి దళాలను శరీరంమీద ధరిస్తే వైకుంఠం ప్రాప్తిస్తుంది. తులసి దళాలను అగౌరవ పరచినవాడు నరకం అనుభవిస్తాడు.

నువు గండకీనదిగా ప్రవహిస్తున్నప్పుడు నేను ఆనదిలో పాషాణ రూపంలో ఉంటాను. ఆరూపమే సాలగ్రామం. ఇది అనేక రకాలుగా ఉంటుంది.

1. లక్ష్మీనారాయణుడు
2. అక్ష్మీజనార్ధనము
3. రఘునాధము
4. వామనము
5. శ్రీధరము
6. దామోదరము
7. రఘురామము
8. రాజరాజేశ్వరము
9. అనంతము
10. మధుసూదనము
11. హయగ్రీవము
12. నారసింహము
13. లక్ష్మీసింహము

ఈరకంగా అనేక రకాలైన సాలగ్రామాలుంటాయి. వీటిని పూజించిన వారికి విష్ణులోకం ప్రాప్తిస్తుంది. ప్రతిరోజూ సాల గ్రామము, తులసి, శంఖాలను పూజించేవాడు సరాసరి వైకుంఠానికి పోతాడు."అని వరమిచ్చాడు.

అప్పటి నుంచీ తులసి వృక్షంగా మారిపోయింది. ఆమె శరీరం గండకీనదిగా ప్రవహించటం మొదలు పెట్టింది. విష్ణువు సాలగ్రామరూపంలో ఆనదిలో ఉంటున్నాడు.

అందుచేతనే ఇప్పటికీ కూడా గండకీనదిలో సాలగ్రామాలు దొరుకుతాయి.

# 43.సావిత్రి

సృష్టి నిమిత్తం పరమేశ్వరి దుర్గ, లక్ష్మి, పార్వతి, సావిత్రి, రాధ అనే ఐదు రూపాలుగా విభజింపబడింది. వీటిలో నాల్గవ శక్తి సావిత్రి శుద్ధ స్పటిక రూపిణి ఆనంద ప్రదాయిని. బ్రహ్మతేజస్సుతో వెలుగూతూ ఉంటుంది. ఛందో శాస్త్రాలకు మంత్ర తంత్రాలకు అధిదేవత. ఆమెయే బ్రహ్మవిద్య.

మద్రదేశాధిపతి అశ్వపతి మహారాజు మంచివాడు. ధర్మనిరతుడు. ప్రజలను కన్నబిడ్డల లాగా పాలిస్తున్నాడు. అతని భార్యా మాలతి. పరమ పతివ్రత. ఆ రాజదంపతులకు సంతానం లేదు. వసిష్టుని సలహామీద అశ్వపతి మహారాజు సావిత్రీ దేవిని ఆరాధించాడు. అశ్వపతి కుమారుడు కావాలనీ, మాలతి కుమార్తె కావాలనీ ఆదేవిని కోరి ఆరాధించారు.

కొంతకాలానికి పరమేశ్వరి దయవల్ల మహారాజుకు ఒక కూతురు పుట్టింది. సావిత్రీ దేవి దయవల్ల ఆ పిల్ల పుట్టింది కాబట్టి ఆ బాలికకు సావిత్రి అని నామకరణం చేసి అల్లారుముద్దుగా పెంచసాగారు. సావిత్రి యుక్తవయస్కురాలైంది. వివాహ ప్రయత్నాలు చేస్తున్నాడు తండ్రి.

ద్యుమత్సేన మహారాజు కుమారుడు సత్యవంతుడు. శత్రువుల వల్ల రాజ్యం పోగొట్టుకుని అడవుల పాలయ్యాడు ద్యుమత్సేనుడు. పైగా అంధుడు. సత్యవంతుడు అడవిలోనే విధ్యాభ్యాసంచేసి గ్రుడ్డివాడైన తండ్రికి సపర్యలే చేస్తుండేవాడు.

ఒకనాడు కలలో సావిత్రికి పరమేశ్వరి దర్శనమిచ్చి సత్యవంతుడికీ, నీకూ వివాహమౌతుంది అని చెప్పింది. తరువాత చెలికత్తెవలన సత్యవంతుని గుణగణాలు, అందచందాలు విని అతనినే వివాహం చేసుకుంటానిని తండ్రికి చెప్పింది. సత్యవంతుడికి రాజ్యం లేకపోయినా, అతడు అడవులలో నివసిస్తున్నా, కూతురి మాట మన్నించి ఆ పరమేశ్వరి మీద భారం వేసి సావిత్రీ సత్యవంతుల వివాహం జరిపించాడు అశ్వపతి. భర్త తోపాటే తనుకూడా అడవిలో కాపరం పెట్టింది సావిత్రి.

కట్టెలు కొట్టుకురావటానికి అడవికి వెళ్ళాడు సత్యవంతుడు. అతనితో పాటే వెళ్ళింది సావిత్రి. కట్టెలు కొడుతుండగా కాలుజారి క్రిందపడి అతడు ప్రాణాలు విడిచాడు. సత్యవంతుడి ప్రాణాలు తీసుకుపోవటానికి యమధర్మరాజే స్వయంగా వచ్చాడు. సత్యవంతుడి శరీరంలోనుంచి సూక్ష్మ దేహాన్ని తీసుకుని బయలు దేరాడు.

సావిత్రి పరమేశ్వరి అనుగ్రహంతో జన్మించింది. అందునా దేవీ భక్తురాలు. అందుచేత యమధర్మరాజును తన నేత్రాలతో చూడగలిగింది. భర్త దేహాన్ని ఒకచోట భద్రపరచి అతని వెనకే బయలుదేరింది.

చూశాడు యమధర్మరాజు. "ఈ శరీరంతో యమలోకానికి రాకూడదు. ఆయువు తీరని వాళ్ళకి ఆలోకంలో ప్రవేశంలేదు. సత్యవంతుడు చాలా పుణ్యాత్ముడు. అందుకే నేను వచ్చాను. ఇంక తిరిగి వెళ్ళిపో" అన్నాడు. వినలేదు సావిత్రి. అతణ్ణే అనుసరిస్తూ త్రోవలో అనేక ప్రశ్నలడిగింది.

కర్మం అంటే ఏమిటి? అది దేనివల్ల వస్తుంది.? దానికి కారణం ఎవరు?

ప్రాణానికీ బుద్ధికీ అధిదేవత ఎవరు? జీవుడు ఏకర్మలు చేస్తే ఏజన్మ లెత్తుతాడు? అన్నింటికీ సమాధానం చెప్పాడు యముడు.

దానాలన్నింటిలోకి అన్నదానం గొప్పది. అది ఎప్పుడైనా చెయ్యొచ్చు, ఎంతైనా చెయ్యొచ్చు.

| | | |
|---|---|---|
| అన్నదానంవల్ల | - | విష్ణులోకం |
| వస్త్రదానంవల్ల | - | వాయులోకం |
| శయ్యాదానంవల్ల | - | చంద్రలోకం |
| వాహనదానంవల్ల | - | వరుణలోకం |
| దీపదానంవల్ల | - | అగ్నిలోకం |
| తిలదానంవల్ల | - | శివలోకం |
| ఫలదానంవల్ల | - | స్వర్గం |
| గజదానంవల్ల | - | ఇంద్రపదవి |
| కన్యాదానంవల్ల | - | శాశ్వత చంద్రలోక నివాసము |
| ప్రసవిస్తున్న గోదానం వల్ల | - | వైకుంఠనివాసము |

అన్నిటికన్నా దేవీయజ్ఞం చాలా గొప్పది. గతంలో త్రిమూర్తులు, వసువు, దక్షుడు మొదలగువారు ఈ యజ్ఞం చేశారు. మంచికీర్తి సంపాదించారు. అధర్మ వర్తనులు నరకానికి వెడతారు. నియమ నిష్ఠలతో జీవితం గడిపేవాళ్ళు, యోగులు, ధర్మ పరులు నరకానికి పోరు. పరదేవతను పూజించేవాడు కలలో కూడా నరకం చూడడు.

ఈ విధంగా సావిత్రికి అనేక ధర్మాలు, కర్మలను గురించి వివరించి ఇంక తిరిగి వెళ్ళి పొమ్మన్నాడు. దానికి సావిత్రి "ఓధర్మదేవతా! నీకు తెలియని ధర్మం ఏముంది? పతితోడిదేకదా సతికి లోకము. భర్త ఎక్కడ ఉంటే భార్య కూడా అక్కడే ఉండాలి కదా! ఇదే ధర్మము. నాభర్త సూక్ష్మ శరీరంలో నీదగ్గర ఉన్నాడు. మరినేను ఎక్కడ ఉండాలి? అని అడిగింది. దానికి యమ ధర్మరాజు "సావిత్రి! నీధర్మబుద్ధికి పాతివ్రత్యానికి మెచ్చాను. నీభర్త ప్రాణాలు నీకు ఇస్తున్నాను. చిరకాలం సుఖంగా జీవించు." అని దీవించి సత్యవంతుడి తండ్రికి దృష్టి, రాజ్యము కూడా తిరిగి వచ్చేటట్టుగా ఆశీర్వదించాడు.

ఈ విధంగా పరమేశ్వరి దయవల్ల సావిత్రి భర్త ప్రాణాలనే కాకుండా పోయిన రాజ్యాన్ని, అత్తమామలకు దృష్టినీ కూడా పొంది సుఖంగా జీవించింది.

సావిత్రీ ధ్యానము

తప్తకాంచన వర్ణాంభాం జ్వలంతీం బ్రహ్మతేజసా।
గ్రీష్మ మధ్యాహ్న మార్తాండ సహస్ర సమిత ప్రభాం॥
ఈషద్ధాస్య ప్రసన్నాస్యాం రత్నభూషణ భూషితాం।
వహ్ని శుద్ధాంశుకాధానాం భక్తానుగ్రహ విగ్రహాం।
సుఖదాం ముక్తిదాం శాంతాం కాంతాం చ జగతాం విధేః॥
సర్వసంపత్స్వ రూపాంచ ప్రదాత్రీం సర్వసంపదాం॥
వేదాధిష్ఠాతృ దేవీంచ వేదశాస్త్ర స్వరూపిణీం।
వేదబీజస్వరూపాంచ భజే తాం వేదమాతరం॥

# 44. స్వాహా స్వధా దక్షిణా

బ్రహ్మదేవుడు లోకాలన్నీ సృష్టించిన తరవాత దేవతలంతా బ్రహ్మదేవుని దగ్గరకు వచ్చి విధాతా! ఆకలి బాధకు తట్టుకోలేకుండా ఉన్నాము. దీనికి ఏదైనా ఉపాయం చెప్పమని అడిగారు. దానికి బ్రహ్మ ఇలాటి విషయాలు చెప్పటానికి స్థితికారకుడైన నారాయణుడున్నాడు. అతన్ని వేడితే దీనికి తరుణోపాయం అతడు చెబుతాడు అన్నాడు. ప్రజాపతి సలహా మీద దేవతలందరూ విష్ణులోకానికి వెళ్ళి హరిని ప్రార్థించారు. అప్పుడు విష్ణువు "దేవతలారా! భూలోకంలో బ్రాహ్మణులు క్షత్రియులు చేసే యజ్ఞాలకు సంబంధించిన హవ్యము మీ ఆకలిని పోగొడుతుంది. ఆ హవ్యము మీపేరు చెప్పి అగ్నిలో వేస్తారు. కాబట్టి దాన్ని అగ్ని మూలాన మీకు అందించే శక్తి వేరే ఉన్నది. ఆ శక్తి కోసం మీరంతా ఆపరదేవతను ఆరాధించండి. ఆవిడ ప్రసన్నురాలైతే ఆ శక్తిని పంపుతుంది. అన్నాడు.

దేవతలంతా పరమేశ్వరిని అత్యంత శ్రద్ధాభక్తులతో ఆరాధించారు. దేవి వారి దీక్షకు మెచ్చి ఆ శక్తిని పంపింది. బ్రహ్మ ఆశక్తి కి నమస్కరించి," తల్లీ నువ్వు అగ్నికి దాహకశక్తివై, అతనియందు హోమంచేసిన హవ్యాన్ని దేవతలకు అందించు అన్నాడు. దానికి ఆశక్తి "నేను శ్రీహరికి తప్ప పరపురుషునకు చెందే దాన్ని కాదు. అగ్నికి దాహకశక్తిగా నేను ఉండను" అని చెప్పి వెళ్ళి తపస్సు చెయ్యటం మొదలుపెట్టింది.

కొంతకాలానికి శ్రీహరి ఆమెకు ప్రత్యక్షమై "దేవీ! నీమనసు నాకర్థమయింది. మరుజన్మలో నగ్నజిత్తు అనే రాజు కుమార్తె నాగ్నజితిగా పుట్టి నా అంశతో పుట్టిన శ్రీకృష్ణుని వివాహమాడు. కాని ఇప్పుడు మాత్రం స్వాహా అనే పేరు తో అగ్నికి ఇల్లాలివై, దాహకశక్తి వై ఉండు." అన్నాడు. అగ్ని దేవుడికీ స్వాహా దేవికి వివాహంజరిగింది. వారికి ముగ్గురు పిల్లలు కలిగారు. వారే

1. ఆహవనీయము 2. గార్హపత్యము 3. దక్షిణాగ్ని, ఈరకంగా స్వాహాదేవి అనుగ్రహం వల్ల దేవతల ఆకలి బాధ తీరింది.

పితృ దేవతలకు శ్రాద్ధకర్మలో తర్పణము ద్వారా ఆహారం లభించేట్టు చేశాడు బ్రహ్మ. కాని వారికి అది సక్రమంగా అందటం లేదు.పితృదేవతలు వారి బాధలు బ్రహ్మకు చెప్పుకున్నారు.వారి కష్టాలు తీర్చటానికి బ్రహ్మ మానసికంగా ఒక కన్యను సృష్టించాడు. ఆమె పేరు స్వధ. అపురూప సౌందర్యరాశి. ఈమెను పితృదేవతలకు సమర్పించాడు బ్రహ్మ.

శ్రాద్ధకర్మల్లో పితృదేవతలకు సమర్పించిన దానిని వారికి సవ్యంగా అందించటమే ఈమెపని.

సుశీల అనే గోపిక రాధకు ఇష్టసఖి రూపసి గుణవంతురాలు. ఒకనాడు కృష్ణుడు, సుశీల ఏకాంతంగా ఉన్నప్పుడు రాధ చూసి మండిపడి మళ్ళీ ఈ ప్రాంతంలో అడుగుపెట్టావంటే భస్మమై పోతావు. అనిశపించింది.

సుశీల అనేక సంవత్సరాలు శ్రీకృష్ణుడికోసం తపస్సు చేసి చివరకు లక్ష్మీదేవిలో కలిసిపోయింది. ఒకసారి బ్రహ్మాదులు యజ్ఞంచేసి యజ్ఞఫలం సఫలం కావాలని ఆపరమేశ్వరిని పరిపరివిధాల ప్రార్థించారు. ఆ పరాశక్తి సలహా మీద విష్ణువు లక్ష్మీదేవి అంశతో దక్షిణాదేవిని ఏర్పాటు చేసి (సృష్టించి) వారికిచ్చాడు. బ్రహ్మ ఆమెను యజ్ఞపురుషుడికి సమర్పించాడు. యజ్ఞం సఫలమైంది.

కాబట్టి దక్షిణలేని కర్మఫలం కాదని చెప్పబడింది. ఈ రకంగా పరమేశ్వరిదయవల్ల స్వాహాదేవి, స్వధాదేవి, దక్షిణాదేవి అని ముగ్గురు దేవతలు క్రతువులను పూర్తి చెయ్యటం కోసం సృష్టించ బడ్డారు.

# 45 షష్ఠీదేవి

స్వాయంభువ మనువు కుమారుడు ప్రియవ్రతుడు. ఇతని భార్య మాలతి. వీరి జీవితం సుఖ సంతోషాలతో గడుస్తోంది.

కాని ఎంతకాలమయినా వారికి సంతానం కలగలేదు. చివరకు కశ్యపుని సలహామీద పుత్రకామేష్టి చేశాడు ప్రియవ్రతుడు యాగ ఫలితంగా మాలతి గర్భవతి అయింది. ఆగర్భాన్ని చాలా కాలం మోసింది రాణి. చివరకు ఒక మృత శిశువు పుట్టింది. అందమైన పిల్లవాడు, మంచి లక్షణాలు కలవాడు. కాని ఏంలాభం? ప్రాణం మాత్రం లేదు. ఆ పిల్లవాణ్ణి చూసి అందరూ బాధ పడ్డారు. గోడుగోడున ఏడ్చారు. తల్లిపడే బాధ వర్ణనాతీతం. ఏడ్చిఏడ్చి స్పృహతప్పి పడిపోయింది.

ప్రియవ్రతుడు కూడా చాలా దుఃంచాడు. ఎంత ఏడ్చినా చచ్చిపోయిన వాళ్ళు బ్రతికిరారుకదా? గుండె రాయి చేసుకుని పిల్లవాణ్ణి స్మశానానికి తీసుకువెళ్ళాడు. బాలుడి శవాన్ని క్రిందపెట్టి భగవంతుణ్ణి నిందిస్తూ కూచున్నాడు. ఇంతలో ఒక దివ్యమైన విమానం వచ్చి ఆగింది. అందులో నుంచి ఒక దివ్యమూర్తి దిగింది. ఆమె దివ్యమైన ఆభరణాలచే అలంకరించబడి ఉంది. ప్రియవ్రతుడు ఆమెకు నమస్కరించి మ్మా!నువ్వెవరు? నీ తల్లి తండ్రులెవరు? నీభర్త ఎవరు? ఇక్కడికి ఏపనిమీద వచ్చావు?" అన్నాడు. దానికి ఆమె రాజా! నేను ఆపరదేవతయెక్క షష్ఠాంశ వల్ల జన్మించాను. అరిష్టనేమి యొక్క కుమార్తెను. నాపేరు దేవసేన నాచిన్నప్పుడు నన్ను ఒకరాక్షసుడు ఎత్తుకుపోతుండగా ఇంద్రుడు రక్షించి పెంచి పెద్దచేశాడు. నాకు వివాహం చెయ్యటానికని వరుని కోసం బ్రహ్మ దగ్గరకు వెళ్ళగా నన్ను ఒకవీరునకిచ్చి వివాహం చెయ్యమని చెప్పాడు బ్రహ్మ.

వజ్రాంగుని కుమారుడు తారకాసురుడు దేవతలను బాగా బాధించాడు. శివుని కుమారుడైన కుమారస్వామి అతణ్ణి సంహరించాడు. అందుచేత కుమారస్వామితో నావివాహం జరిగింది. పరదేవతమొక్క షష్ఠాంశవల్ల పుట్టాను కాబట్టి నన్ను ష్ఠీదేవి అని కూడా అంటారు. జీవితం కర్మఫలితాన్ని బట్టి నడుస్తుంది. దాన్ననుసరించే కలిమి, లేమి, కష్టము, సుఖము, జననము, మరణము సంభవిస్తాయి కాబట్టి విచారించకు అని చెప్పి చనిపోయిన పిల్లవాణ్ణి బ్రతికించి వీడిపేరు సువ్రతుడు. అసామాన్యమైన బలసంపన్నుడౌతాడు. ఈభూమిని ఏకచ్ఛత్రంగా పరిపాలిస్తాడు. విద్వాంసులను పండితులను పోషిస్తాడు. దేవతల ప్రీతికోసం నూరు యజ్ఞాలు చేస్తాడు. ప్రజలను కన్న బిడ్డలలాగా చూస్తాడు"అని చెప్పి వెళ్ళిపోయింది.

పురిటి ఇంట్లో ఆరవనాడు షష్ఠీదేవిని పూజిస్తే తల్లికీ, బిడ్డకీ క్షేమం. పూజానంతరము ఆదేవిని ఈవిధంగా స్తుతించాలి.

నమోదేవ్యై మహాదేవ్యై సిద్ధ్యై శాంత్యై నమోనమః ।
శుభాయై దేవసేనాయై షష్ఠ్యై దేవ్యై నమోనమః ॥

వరదాయై పుత్రదాయై ధనదాయై నమోనమః ।
సుఖదాయై మోక్షదాయై షష్ఠీదేవ్యై నమోనమః ॥

సృష్ట్యైషష్ఠాంశరూ పాయై సిద్ధాంయైచ నమోనమః ।
మాయాయై సిద్ధ యోగిన్యై షష్ఠీదేవ్యై నమోనమః ॥

సారాయై శారదాయై చ పరాదేవ్యై నమోనమః ।
బాలాధిష్ఠాతృ దేవ్యై చ షష్ఠీదేవ్యై నమోనమః ॥

కల్యాణ దేవ్యై కల్యాణ్యై ఫలదాయై చ కర్మణాం ।
ప్రత్యక్షాయై సర్వభక్తానాం షష్ఠీదేవ్యై నమోనమః॥

పూజ్యాయై స్కందకాంతాయై సర్వేషాం సర్వకర్మసు।
దేవరక్షణ కారిణ్యై షష్ఠీదేవి నమోనమః ॥

శుద్ధసత్వస్వరూపాయై వందితాయై నృణాం సదా।
హింసా క్రోధ వర్జితాయై షష్ఠీదేవ్యై నమోనమః ॥

ధనం దేహి ప్రియం దేహి పుత్రం దేహి సురేశ్వరి ।
మానం దేహి జయం దేహి ద్విషోజహి మహేశ్వరి॥

ధర్మం దేహి యశో దేహి షష్ఠీదేవ్యై నమోనమః ।
దేహి భూమిం ప్రజాం దేహి విద్యాందేహి సుపూజితే॥

కళ్యాణం చ జయందేహి విద్యాదేవి నమోనమః

మర్రి చెట్టు మొదట్లో గాని, కుండమీదగాని, సాలగ్రామం మీద గాని షష్ఠీదేవి ప్రతిమ పెట్టి పూజచెయ్యాలి.

కొడుకు కావాలని ఆదేవిని పూజించి ఈవ్రతం చేస్తే మంచి లక్షణాలు- కల దీర్ఘాయుష్మంతుడు పుడుతాడు. పిల్లలు భయపడి ఏడుస్తున్నప్పుడు ఈస్తోత్రం పఠిస్తే వాళ్ళు సుఖంగా ఉంటారు. బాలగ్రహపీడ వదుల్తుంది.

# 46 మంగళ చండిక

కశ్యపునికి దితి యందు జన్మించిన వాడు వజ్రాంగుడు. ఇతడి భార్య వరాంగి. ఇతడు దేవతలను బాధిస్తూ ఉండేవాడు. ఇతని కుమారుడు తారకాసురుడు. బ్రహ్మను గూర్చి ఘోరమైన తపస్సు చేసి తనతో సమానమైన బలవంతులు ఈసృష్టిలో లేకుండా వరం పొందాడు. ఆవర బలంతో దేవతలను పలురకాలుగా బాధించాడు. చివరకు శివుడి కుమారుడైన కుమారస్వామి చేతిలో ఇతను మరణించాడు.

తారకాసురుడికి ముగ్గురు కుమారులున్నారు. 1. విద్యున్మాలి. 2. తారకాక్షుడు 3. కమలాక్షుడు. తారకాసురుడు చనిపోయిన తరువాత వీరు బ్రహ్మను గురించి తపస్సు చేసి సకల సౌఖ్యములు కలిగి, కామగమనముగల మూడు పట్టణాలు కావాలన్నారు. వారడిగినట్లే మూడు పట్టణాలు ఇస్తూ బ్రహ్మ ఆమూడు పట్టణాలు ఒకదానితో ఒకటి కలియకుండా ఉన్నంతవరకూ మిమ్మలనెవ్వరూ ఓడించలేరు. అవిగనక కలిశాయంటే మీరు బలహీనులౌతారు అని చెప్పాడు. అంత మయుణ్ణి పిలిచి వారు ఆపట్టణాలను వెండి,బంగారము, ఇనుములతో తయారు చేయించారు.

తారకాక్షుని కుమారుడు హరి. అతడు విష్ణువును గురించి తపస్సు చేసి తమవారిలో ఎవరు చచ్చిపోయినా సరే వాళ్ళని నీళ్ళలో పడెయ్యంగానే వాడు బ్రతికి, వాడితో సమానమైన వారు ఇంకా నదిమంది పుట్టేటట్టుగా చేయగల బావులను తమ పట్టణాలలో నిర్మింపచేశాడు. ఇప్పుడు వారు అజేయులు. మరణం సంభవించటం కూడా చాలా కష్టం. ఈరకంగా అభేద్యమైన త్రిపురములు కలవారు కాబట్టే వారికి త్రిపురాసురులని పేరువచ్చింది.

ఈ అసురులు తమ పట్టణాలలోనే ఉంటూ, కామగమనంతో కావాలన్న చోటికిపోతూ ఎక్కడ బడితే అక్కడ ఆపురాలతో సహా దిగుతుండేవారు. ఆధాటికి భూలోకంలోను, దేవలోకంలోను కూడా భవనాలు, పట్టణాలు అన్నీ నాశనమైపోతుండేవి. వాళ్ళని చంపటానికి దేవతలు తమశక్తినంతటినీ శివుడికిచ్చారు. అప్పుడు శివుడు భూమిని రథంగా, సూర్యచంద్రులు చక్రాలుగా, బ్రహ్మదేవుడు సారథిగా, శ్రీహరి కవచంగా, మేరుపర్వతము విల్లుగా చేసి త్రిపురాసురులతో యుద్ధానికి బయల్దేరాడు.

ఆయుద్ధంలో శివుని రథచక్రం త్రిపురాసుల ఆయుధాల వల్ల దెబ్బతిన్నది. అప్పుడు శివుడు విష్ణువు సలహాపై పరమేశ్వరిని ప్రార్థించగా చండరూపంతో ఉన్న దుర్గ ప్రత్యక్షమై అతడికి సహాయం చేసింది. పాసుపతాస్త్రంతో శివుడు త్రిపురాసులను సంహరించాడు. చండిక అనే ఈదేవత దుర్గకు ఇంకొక రూపం. మూల ప్రకృతి. స్త్రీలకు ప్రత్యక్షదైవం. కరుణామయి.

ఈరకంగా శివునిచే పూజింపబడి ఆయనకు మంగళం కలిగించింది కాబట్టి ఈమె మంగళ చండి అయింది. ఆ తరువాత మనువంశంలో పుట్టిన మంగళుడనే వాడు, మంగళవారాలలో కన్యలు, దిక్పాలకులు, ఆదేవిని ఆరాధించి అభీష్టఫలం పొందారు.

మంగళవారాలలో గనక ఈమంగళచండీ వ్రతం చేస్తే స్త్రీలకు, కన్యలకూ సకల శుభాలూ కలుగుతాయి.

# 47. మనసాదేవి కథ

పూర్వకాలంలో ఒకానొకప్పుడు భూలోకంలో పాముల బెడద విపరీతంగా పెరిగిపోయింది. అప్పుడు మానవులంతా కశ్యపుని దగ్గరకు వెళ్ళి తమబాధను గురించి చెప్పారు. అతడు బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారము ఒక కన్యను సంకల్ప మాత్రం చేతనే సృష్టించాడు. ఆమెపేరే మనసాదేవి.

మనసాదేవి కైలాసగిరికి వెళ్ళి శివుణ్ణి గూర్చి ఘోరమైన తపస్సుచేసింది. ఆతపస్సుకు మెచ్చి ఈశ్వరుడు ప్రత్యక్షమైనాడు. తరువాత పుష్కరతీర్థానికి వెళ్ళి విష్ణువుని గూర్చి తపస్సుచేసింది. ఆమెతపస్సుకు మెచ్చి విష్ణుమూర్తి కూడా ప్రత్యక్షమైనాడు. కఠోరమైన నియమాలతో ఆమె తపస్సు చేసింది. ఆసమయంలో ఆమె వస్త్రాలు జీర్ణమైపోయినాయి. జీర్ణమైన వస్త్రాలుకలది కాబట్టి ఆమెను జరత్కారువు అన్నారు. ఈరకంగా హరిహరుల అనుగ్రహంసంపాదించి ఆమెతండ్రి వద్దకు వచ్చింది.

ఒకముని బాలకుడు విద్యాభ్యాసంచేసి విరాగియై వివాహంచేసుకోకుండా తపస్సుచేసుకేంటూ అడవులు పట్టి తిరుగుతున్నాడు. అలా తిరుగుతుండగా ఒకనాడు కొంతమందిమునులు ఒకచెట్టుకొమ్మకు తలక్రిందులుగా వ్రేలాడుతూ కనిపించారు. మునిబాలకుడు వారి దగ్గరకువెళ్ళి మీరెందుకు ఇలా ఉన్నారని ప్రశ్నించాడు. దానికి వారు మావంశంలోని వాడొకడు వివాహంచేసుకోకుండా ఉండి పోయాడు. వాడు వివాహంచేసుకుని పిల్లలను కనేవరకు మాగతి ఇంతే. ఊర్ధ్వలోకాలుండవు. ఏంచేస్తాం? అంతా మాఖర్మ అన్నారు.

ఆమునిబాలకుడు వారి స్థితిచూసి బాధపడి అతడెవరోచెప్పండి. అతణ్ణిఒప్పించి వివాహంజరిపిస్తాను అన్నాడు. అతనిపేరు జరత్కారుడు అన్నారువారు. అర్థంకాలేదు మునిబాలకుడికి. అవునయ్యా. మేము నీ పితృదేవతలం. నువు వివాహంచేసుకోనంత వరకూ మాగతి ఇంతే. అన్నారువారు. ఆవిషయం తెలిసిన జరాత్కారుడు వారికి ఉత్తమలోకాలు కలిగిస్తానని మాట ఇచ్చి తనపేరు కలిగిన కన్యను మాత్రమే వివాహం చేసుకుంటానన్నాడు.

కశ్యపప్రజాపతి కుమారుడైన వాసుకి తనచెల్లెలు జరాత్కారువుని వివాహమాడ వలసిందిగా జరత్కారుణ్ణి కోరాడు. దానికి జరాత్కరుడు సమ్మతించి తనమాటకు మారాడనంతవరకూ ఆమెతో కలిసి కాపురం చేస్తానన్నాడు. సరేనన్నాడు వాసుకి. ఈరకంగా జరత్కారువు, జరత్కారులవివాహంజరిగిపోయింది.

ఒకనాడు భోజనానంతరం జరత్కారుడు భార్యతొడమీద తలపెట్టుకుని నిద్రపోయాడు. సూర్యాస్తమాన మవుతోంది. సంధ్యావందనాదులు నెరవేర్చాలికదా అని ఆమె భర్తను మేల్కొల్పింది. ఆమునీశ్వరుడు నిద్ర నుంచి లేచి నా అభిమతానికి విరుద్ధంగా నన్ను నిద్ర లేపావు. ఇక నీతో కాపురం చెయ్యను. వెళ్ళిపో! అన్నాడు. సాయంసంధ్యం కావస్తోంది. సంధ్యావిధులు నెరవేర్చాలికదా! అందుకని లేపాను అంది భార్య. నేను లేవకుండానే సూర్యుడు అస్తమిస్తాడా? అని సూర్యుణ్ణి శపించబోయాడుముని. అప్పుడు సూర్యుడు వచ్చి తనను క్షమించమని, తన విధులు తాను నిర్వర్తించకపోతే

లోకాలు అల్లకల్లోలం అవుతాయని చెప్పగా సూర్యుణ్ణి క్షమించాడు. కాని భార్యను మాత్రం క్షమించను పొమ్మన్నాడు.

కశ్యపప్రజాపతి, బ్రహ్మ ఇద్దరూ వచ్చి నచ్చచెప్పినా ఫలితం లేకపోయింది. జరాత్కారుడు భార్యతో నీకు పుట్టబోయేపుత్రుడు దివ్యతేజస్సంపన్నుడు, సర్వశాస్త్ర విశారదుడు, అవుతాడు. నువు కైలాసగిరికిపోయి శివుణ్ణి గూర్చి తపస్సు చెయ్యి అని చెప్పితాను పుష్కరతీర్థానికి వెళ్ళిపోయాడు. కొంతకాలానికి జరత్కారువుకు తేజోవంతుడైన కుమారుడు కలిగాడు. అతడిపేరే ఆస్తీకుడు. ఆస్తీకుడు సకల శాస్త్రాలూ నేర్చుకుని అపర శంకరునిలాగా ప్రకాశిస్తున్నాడు.

విరాటమహారాజు కుమార్తె ఉత్తర అభిమన్యుడి భార్య, కురుక్షేత్ర సంగ్రామసమయంలో ఈమె గర్భవతి. యుద్ధంలో పాండవులు ఐదుగురూ తప్పవారి సంతతి అభిమన్యుడు, ఉపపాండువులతో సహా అందరూ మరణించారు. అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రం వలన ఉత్తరగర్భంలోని శిశువు కూడా మరణించాడు. ఇక పాండవులకు వంశం లేదు. అందుచేత కృష్ణుడు ఆ మృతశిశువును బ్రతికించాడు. అతడి పేరే పరీక్షిత్తు.

పరీక్షిన్మహారాజు అరవై యేళ్ళు రాజ్యం చేశాడు. ఒకనాడు మహారాజు వేటకు వెళ్ళి లేడిని చూసి దాన్ని తరుముకుంటూ చాలా దూరం వెళ్ళాడు. లేడికనపడలేదు. దగ్గర శమీకమహర్షి ఆశ్రమం ఉంది. ఆశ్రమ ప్రాంగణంలో ఆయన సమాధి స్థితిలో ఉన్నాడు. రాజు మహర్షి దగ్గరకు వచ్చి లేడి ఎటువెళ్ళింది. అని అడిగాడు. సమాధిలో ఉన్న ఋషి మాట్లాడ లేదు. దానికి కోపించిన రాజు దగ్గరలోనే చచ్చి పడిఉన్న పామును తీసి ఋషి మెడలో వేసి వెళ్ళిపోయాడు. కొంతసేపటికి వచ్చిన ఋషి కుమారుడు ఇది చూసి తనతండ్రిని ఈ విధంగా అవమానించిన వాడెవరైనాసరే ఇవాల్టినుంచీ ఏడు రోజులలోపల తక్షకుని యొక్క విషజ్వాలలకు ఆహుతి అవుతాడిని శపించాడు. ఈ విషయం తెలిసిన శమీకుడు విచారించి శిష్యుపితో ఈ విషయం రాజుకు కబురు చేసి విషయం తెలియ చేశాడు.

జరిగిందానికి పశ్చాత్తాపపడిన రాజు చేసేదేంలేక ఈ ఏడు రోజుల్లోను శుకమహర్షిని పిలిపించి అష్టాదశపురాణాలూ చెప్పించుకుని విని, చివరకు ఏడవరోజున తక్షకుడి కాటుకు బలి అయ్యాడు. ఇతని కుమారుడే జనమేజయుడు. వైశంపాయనుడు ఇతడికే మహాభారతకథ వినిపించాడు. తన తండ్రి మరణానికి తక్షకుడు కారణమని తెలిసిన జనమేజయుడు పాముల మీదపగపట్టాడు.

పైలుని శిష్యుడు ఉదంకుడు. గురుపత్ని కోరికమీద పౌష్యమహాదేవి కుండలములు తీసుకురావటానికి వెళ్ళాడు. పౌష్య మహారాజు భార్య పౌష్య మహాదేవి. అద్వితీయశక్తి సంపన్నురాలు. అశుచిగా ఉన్న వారికి కనిపించదు. ఉదంకుని కోరిక ప్రకారం రాజు కుండలాలిచ్చి తక్షకుడు వాటిని ఎత్తుకుపోతాడు జాగ్రత్త. అని హెచ్చరించాడు. త్రోవలో సంధ్యావందనవిధి నిర్వర్తిస్తుండగా తక్షకుడు ఆకుండలాలు ఎత్తుకుపోయాడు. అప్పుడు ఇంద్రుడి సాయంతో ఉదంకుడు వాటిని తిరిగి తెచ్చుకున్నాడు. కాని తక్షకుడి మీద కోపంతోనే ఉన్నాడు.

చ్యవనమహర్షి యొక్క కుమారుడు రురుడు. ఇతడు ప్రమద్వర అనే కన్యను

వివాహం చేసుకోవాలనుకున్నాడు. కాని ఒకరోజున ఆమె పాముకాటుచేమరణించింది. తన ఆయువులో సంగం ఆమెకిచ్చి ప్రమద్వరను తిరిగి బ్రతికించుకున్నాడు రురుడు. కాని పాముకాటుచే ఆమె మరణించింది కాబట్టి పాములమీద పగ పెంచుకున్నాడు.

ఈ రకంగా పాములజాతి మీద ఉన్న కోపంతో వారిద్దరూ జనమేజయుని దగ్గరకు వచ్చి నీతండ్రి పాముకాటుతోనే మరణించాడు. కాబట్టి సర్పజాతిని నాశనం చెయ్యటానికి సర్పయాగం చెయ్యమని ప్రోత్సహించారు. అసలే కోపంగా ఉన్న రాజు వీళ్ళ ప్రేరణతో సర్పయాగం మొదలు పెట్టాడు.

రకరకాల పాములు ఎర్రపాములు, తెల్లపాములు, పొడలపాములు, విషసర్పాలు, రెండుతలల పాములు, ఐదుతలల పాములు, పదితలలపాములు ఈ రకంగా సర్పజాతిఅంతా గుంపులుగుంపులుగా వచ్చి హోమగుండంలో పడి చచ్చిపోతోంది. చివరకి తక్షకుడి వంతు వచ్చింది. తక్షకుడు భయపడి పారిపోయి ఇంద్రుణ్ణి శరణువేడాడు. ఋత్విక్కులు తక్షకుణ్ణి పిలుస్తున్నారు. అతడు రావటంలేదు.

మహానాగులన్నీ ఒకచోట చేరి ఈ యాగాన్ని ఆపే విధాన మేమిటి అని చర్చించి చివరకు వాసుకి దగ్గరకు వచ్చాయి. నాగులను వెంటపెట్టుకుని వాసుకి విష్ణుమూర్తిని ప్రార్థించాడు. విష్ణువు వారి ప్రార్థనను మన్నించి జరత్కారువు కుమారుడైన ఆస్తీకుడు ఈ సర్పయాగాన్ని ఆపగల సమర్థుడు అని చెప్పాడు. నాగులన్నీ ఆస్తికుణ్ణి ప్రార్థించాయి.

ఉదంకుడు దివ్యదృష్టితో చూశాడు. తక్షకుడు ఇంద్రుడి రక్షణలో ఉన్నాడు. అది చూసి ఇంద్రుడి తో సహా తక్షకుడు రావాలి అన్నాడు ఉదంకుడు. ఇంద్రుడు సింహాసనంతో సహా గాలిలోకి లేచాడు తక్షకుడు.

నాగుల ప్రార్థన మన్నించిన ఆస్తికుడు జనమేజయుని దగ్గరకు బ్రాహ్మణవేషంలో వచ్చాడు. వచ్చిన బ్రాహ్మణబాలకుడికి స్వాగతసత్కారాలు నిర్వ చి నీకేంకావలో చెప్పు ఇస్తాను అన్నాడు రాజు.

గాలిలోకి లేచిన తక్షకుడు మహావేగంతో యజ్ఞకుండంవైపు వచ్చేశాడు. తక్షకుడు యజ్ఞకుండంలో పడాలి అన్నాడు ఉదంకుడు. అగ్నిలో పడబోతున్నాడు తక్షకుడు.

ఆస్తీకుడు జనమేజయుణ్ణి చూసి సర్పయాగం ఆపించుమహారాజా! అన్నాడు. అంతే సర్పయాగం ఆగిపోయింది. తక్షకుడు ప్రాణాలు దక్కించుకున్నాడు.

ఈ విధంగా జరత్కారువు కుమారుడైన ఆస్తీకుని వలన నాగజాతి బ్రతికి బయట పడింది.

ఆస్తికుణ్ణి, మనసాదేవిని (జరత్కారవు).స్మరిస్తూ ఉంటే సర్పభయంఉండదు

మనసాదేవి ధ్యానం

జరాత్కరు ర్జగద్గౌరీ మనసా సిద్ధయోగినీ
వైష్ణవీ నాగభగినీ శైవీ నాగేశ్వరీతథా
జరాత్కరు ప్రియాస్తీక మాతా విషహరేతి చ
మహాజ్ఞాన యుతాచైవ సాదేవీ విశ్వపూజితా।

# 48 గౌతముడు

పూర్వకాలంలో ఒకసారి అనావృష్టి వచ్చింది. దాదాపుగా పదిహేను సంవత్సరాలు వర్షపు చుక్కైనా కురవలేదు. పాడిపంటలు లేవు. చెట్లు చేమలు కూడా అంతరించిపోయాయి. భరించలేని కరువు. పశువులు గడ్డిలేక చచ్చిపోతున్నాయి. పసిపిల్లలకు పాలులేవు. ఆకలికి తాళలేక కొందరైతే మృతకళేబరాలను పీక్కుతినేస్తితికి వచ్చారు. ఇంతదాకా ఎందుకు పిల్లలకు పాలు ఇవ్వలేక, వారిని పెంచలేక గొంతు పిసికి చంపేసిన వారుకూడా ఉన్నారు. మొత్తం మీద ఘోరకలి విలయతాండవం చేస్తోంది.

ఆరోజుల్లో కొంతమంది పండితులు ఒకచోటచేరి ఈదుర్భర స్థితినుంచి తప్పించుకోవటానికి మార్గం లేదా? అని ఆలోచించసాగారు. చివరకు వారికి గౌతముడు గుర్తువచ్చాడు.

గౌతముడు ఒక మహర్షి. మహాతపస్సంపన్నుడు. పరదేవతను ఆరాధిస్తూ ఉండేవాడు. ఆవిడయొక్క కరుణవల్ల విత్తనాలు చల్లగానే అవి మొలకెత్తి ఫలితాన్ని ఇచ్చేటట్లుగా వరం పొందాడు. కాబట్టి ఇప్పుడు మనమంతా గౌతముడుని శరణువేడితే ఆమహర్షి మనలను కరుణిస్తాడు అని ఆలోచించి గౌతముడి ఆశ్రమానికి ప్రయాణమయ్యారు.

కుటుంబ సమేతంగా వచ్చిన ఇంతమంది పండితులను చూసి, వారికేదో ఆపద వచ్చిందని గ్రహించి, వారిని ఆహ్వానించి ఆతిథ్యమిచ్చాడు. ఆతరువాత జరిగిన విషయం తెలుసుకుని, ప్రజలు ఆకలిదప్పులకు అల్లాడుతున్నారన్నమాట విని విచారించి ఆపరదేవతను ప్రార్థించాడు.

నమోదేవీ మహావిద్యే। వేదమాతః పరాత్పరే।
వ్యాహృత్యాది మహామంత్రరూపే। ప్రణవరూపిణి।
సామ్యావస్థాత్మికే। మాతః। నమో హ్రీంకార రూపిణీ
స్వాహా స్వధా స్వరూపే। త్వాం నమామి సకలార్థదామ్
భక్త కల్ప లతాం దేవీం అవస్థాత్రయ సాక్షిణీం
కుర్యాతీత స్వరూపాం చ సచ్చిదానంద రూపిణీం:
సర్వవేదాంత సంవేద్యాం సూర్యమండల వాసినీం
ప్రాతర్బాలాం రక్తవర్ణాం మధ్యాహ్నే యువతీం పరాం
సాయాహ్నే కృష్ణవర్ణాం తాం వృద్ధాం నిత్యం నమామ్యహమ్॥

ఆదేవత మహిమవల్ల వచ్చిన వారందరికీ నివాసం ఏర్పాటు చేసి, గతంలో దేవత తనకిచ్చిన వరమహిమ వల్ల వారందరికీ భోజన సదుపాయాలు ఏర్పాటు చేశాడు. ఇంతకాలం అన్న పానాదులు లేక, అవి ఎలా ఉంటాయో కూడా మరచిపోయిన వాళ్ళకి ఆపరదేవత దయవల్ల పంచభక్ష్యాలతో సమృద్ధిగా ఆహారం దొరికింది. ఆ ఆనందానికి తట్టుకోలేక అన్నదానం చేసి తమ ప్రాణాలని నిలబెట్టిన గౌతముణ్ణి వేనోళ్ళ కొనియాడారు.

ఆపరమేశ్వరిని పరివరివిధాలనుస్తుతించారు. పండితులంతా యజ్ఞయాగాలు చెయ్యనారంభించారు. ఆశ్రమానికి ఎటు చూసినా నూరు యోజనాల వరకు ఆశ్రితులున్నారు. అందర్నీ సంరక్షిస్తున్నాడు గౌతముడు.

కొంతకాలానికి నారదుడు వచ్చి గౌతముడు చేస్తున్న పనికి మెచ్చుకుని "మహర్షీ! ఆపదకాలంలో వీళ్ళని ఆదుకున్నావు. వారికోసం ఆపరాశక్తి ఇచ్చిన వరప్రభావం ఉపయోగించటం వల్ల నీశక్తి మరింతగా పెరిగింది. తనకున్న శక్తితో పది మందికీ ఎవరైతే ఉపకారం చేస్తారో వారి శక్తి ద్విగుణీకృత మౌతుందని చెప్పబడింది. ఇప్పుడు నీకూ అంతే జరిగింది. ఇంద్రాది దేవతలంతా నువు చేస్తున్న పనిని వేనోళ్ళ కొనియాడుతున్నారు" అన్నాడు. ఈమాటలు విన్న పండితులకు ఈర్ష్య కలిగింది. గౌతముడికి ఇంతపేరు రావటం వాళ్ళు సహించలేక పోయారు. ఎలాగైనా సరే గౌతముడి ప్రతిష్ఠకు మచ్చ కలిగించాలి అనుకున్నారు.

వానలు పడటం మొదలు పెట్టాయి. క్రమంగా నేల చల్లబడింది. ఏరులు పారాయి. నదులు పొంగాయి. విత్తనాలు మొలకెత్తుతున్నాయి. పండితులు కూడా వెళ్ళి పోవటానికి సన్నద్ధమౌతూ మాయాగోవును ఒకదాన్ని సృష్టించారు.అది వచ్చి ఆశ్రమ ప్రాంగణంలోని పంటను, ఆహారాన్ని నాశనం చెయ్యటం మొదలు పెట్టింది. అది చూసిన గౌతముడికి కోపం వచ్చింది. ఆవును కొట్టటం ఇష్టంలేక అదిలించాడు. అంతే ఆఅదిలింపుకు మాయాగోవు కింద పడి చచ్చిపోయింది. ఇదంతా చాటునుంచి చూస్తున్న పండితులు "గౌతముడు గోవును చంపాడు. గోహత్య మహాపాతకం. ఇంక ఇతడి ఇంటభోజనం చెయ్యటం కూడా పాపమే. మేం వెళ్ళిపోతున్నాం"అని బయలు దేరారు. మాయ తెలియని గౌతముడు వారిని బ్రతిమాలాడు. ఈపాపం పోయే ఉపాయం చెప్పమన్నాడు. అప్పుడు వారు గౌతముడికి అసాధ్యమయ్యేపని ఏదా? అని ఆలోచించి చివరకు గంగను తెచ్చి గోవుమీద ప్రవహింపచేస్తే ఈపాపం పోతుందన్నారు.

గౌతముడు చాలా సంవత్సరాలు శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై గౌతముడి కోర్కె ప్రకారం తన జటాజూటంనుంచి రెండు బొట్లు విదిల్చాడు. అంతే చచ్చిన గోవు లేచినుంచుంది. ఈరకంగా గౌతముని చేత తేబడింది కాబట్టి గౌతమి అనీ గోవును బ్రతికించటానికి వచ్చింది కాబట్టి గోదావరి అనీ ఆనదికి పేరు వచ్చింది.

ఆవులేచి నుంచోగానే గౌతముడు మాయాగోవును బ్రతికించాడు అని గేలిచేశారు పండితులు. దివ్య దృష్టితో అసలు విషయం తెలునుకున్న మహర్షి వారిమీద కోపించి

"ఇకనుంచీ గాయత్రీ జపం మీకు నిష్ఫలమవుతుంది. వేదాధ్యయనం, యజ్ఞకర్తవ్యం మీకు ఉండవు. మీరంతా ధర్మహీనులు, నీతి దూరులు అయి భ్రష్టుపట్టిపోతారు. వావీ వరుసాలేకుండా పశువుల్లా ప్రవర్తిస్తారు. తరతరాలకు మీగతి ఇంతే"అని శపించాడు.

చేసిన తప్పు క్షమించమని పండితులంతా ప్రాధేయపడగా ద్వాపరయుగంలో పరమేశ్వరి అంశతో యదువంశంలో నందగోవుని ఇంట శ్రీకృష్ణుడు పుడతాడు. అతని జన్మతో మీకు శాపవిమోచన మవుతుంది అన్నాడు.

ఆరకంగా పండితులు చేసిన తప్పుకు శిక్ష అనుభవించి, పరమేశ్వరి దయవల్ల తిరిగి స్వధర్మానికి అర్హులైనారు.

# 49 పరమేశ్వరి పూజాఫలం

పూర్వకాలంలో హిమాలయ ప్రాంతంలో చక్రవాకపు పక్షి ఒకటి ఉండేది. అది దేశాల వెంబడి తిరుగుతూ తిరుగుతూ ఒకనాడు అది కాశీపట్టణానికి వచ్చింది. ఆరోజు దానికి ఆహారం దొరకలేదు. ఆహారం వెతుక్కుంటూ కాశీ పట్టణమంతా తిరిగినా లాభం లేకపోయింది. చివరకు అన్నపూర్ణాదేవి ఆలయానికి వెళ్ళింది. అక్కడ ఆహారం వెతుకుతూ ఆలయం చుట్టూ తిరిగింది.అప్పటికి అపరాహ్నమయింది. ఉదయం నుంచీ ఆపక్షికి ఏరకమైన ఆహారం దొరకలేదు. కాలేకడుపుతోనే మూడుసార్లు ఆలయాన్ని చుట్టివచ్చింది. అందుచేత పరమేశ్వరికి ప్రదక్షిణయు చేసిన ఫలం దానికి దక్కింది. తరువాత కొంతకాలానికి ఆపక్షి చచ్చి స్వర్గానికి పోయింది. పరమేశ్వరికి ప్రదక్షిణలు చేసిన దానికి ఫలితంగా రెండు కల్పాల కాలం స్వర్గ సుఖాలను అనుభవించింది. మరుజన్మలో మంచి క్షత్రియకులంలో పుట్టి దేశానికి రాజయుంది. అయినప్పటికీ అదిపూర్వజన్మ స్మృతి కలిగి ఉంది.

ఈవిషయం తెలిసి ఆశ్చర్యపోయిన కొతమంది మునులు ఆరాజుదగ్గరకు వెళ్ళి నీకు ఈజ్ఞానం ఎలావచ్చిందని అడిగారు. దానికి రాజు తన గతజన్మ వృత్తాంతమంతా వారికి చెప్పి పరమేశ్వరి దయవల్లనే తనకు గతజన్మస్మృ తి ఉందని చెబుతూ మునీంద్రులారా! శివుడని, విష్ణువని కొంత మంది రకరకాల దేవతలను ఆరాధిస్తూ ఉంటారు. కాని నిజానికి ఇహపరాలు రెండూ కావాలంటే అపరమేశ్వరిని మాత్రమే ఆరాధించాలి. ఆతల్లి ఇచ్చే ఫలాలు ఇంకెవ్వరూ ఇవ్వలేరు. ఆమెను ఆరాధించే విధానం చెబుతావినండి. ఆజగజ్జననిని మూడు సంధ్యలయందూ ఆరాధించాలి. అదే తపస్సు. దీనివల్ల దేహానికి అన్ని పాపాలనుండీ విముక్తి కలుగుతుంది. యోగ్యత ఉన్నవాడు ఆహారం మితంగాతిని గాయత్రీ మంత్రం పునశ్చరణ చెయ్యాలి. మొదటిరోజునుంచి చివరిరోజుదాకా మధ్యలో ఆగకుండా పూర్తిచెయ్యాలి. ఉదయంనుంచీ మధ్యాహ్నం రెండుగంటల వరకు మంత్రజపం చెయ్యాలి.

నిత్యం సహస్రగాయత్రి చేసేవాడికి ధనధాన్యాభివృద్ధి, పుత్రపౌత్ర లాభము కలుగుతాయి, వైశ్యదేవం చెయ్యని బ్రాహ్మణుడు చచ్చిన తరువాత కాలసూత్రనరకంలో తలక్రిందుగా వేలాడాలి. తినే వస్తువు ఏదైనా సరే ముందు అగ్నిలో హోమం చెయ్యాలి.

ఈరకంగాదేవిని పూజించినట్లైతే ఐహిక వాంఛలు పూర్తిగా తీరతాయి. మునీశ్వరులు ఆమాటవిని ఆపరమేశ్వరిని వేనోళ్ళా పొగడి తాము కూడా తపస్సు చేసి ఆపరమేశ్వరి కరుణ సంపాదించటానికి హిమాలయాలకు వెళ్ళిపోయారు.

# 50. పితృతీర్థం

ఒకసారి దుర్వాసుడు వళ్ళంతా విభూది పూసుకుని పితృ లోకానికి వెళ్ళాడు. ఆలోకాధిపతి దూర్వాసుణ్ణి సగౌరవంగా ఆహ్వానించి అతిధి సత్కారాలు చేశాడు. వారు మాట్లాడుతుండగా దూరం నుంచి భీకరమైన అరుపులు, కేకలు, ఏడుపులు వినిపించాయి. దుర్వాసుడు ఏమిటాగోల అని అడగగా, ఇక్కడికి దగ్గరలో నరకం ఉంది. పాపాత్ములు అక్కడ పెట్టే బాధలు భరించలేక అరుస్తున్నారు అన్నాడు. నరకయాతనా పద్ధతులు ఒకసారి చూద్దాం అని దుర్వాసుడు అనగానే ఇద్దరూ కలిసి బయలు దేరారు. వాళ్ళు కుంభీపాకం అనే నరకం చేరి అక్కడి పాపులనుచూస్తున్నారు.

మానవులలో అందరూ సాధు వర్తనులు, సదాచార సంపన్నులూ ఉండరు. మానవుడు చేసే కర్మను బట్టి స్వర్గనరకాలు లభిస్తాయి. అన్యాయాలు, అక్రమాలు, దోపిడీలు, అత్యాచారాలు చేసేవారు చాలా మంది ఉంటారు. వారు పాపఫలం అనుభవించటానికే నరకం ఏర్పాటు చేయబడింది. ఈనరకంలో మానవుడు చేసిన కర్మననుసరించి శిక్ష విధించబడుతుంది. ఈరకంగా పాపులకోసం అనేక నరకాలు సృష్టించబడి, యముని ఆధిపత్యంలో ఉంటాయి. వివిధ రకాల నరకాల వివరాలు: 1. తామిస్ర, 2.అంధతామిస్ర, 3.అశిపత్ర, 4.అంధకూప, 5.రౌరవ, 6.మహారౌరవ, 7.కాలసూత్ర, 8.సూకరముఖి, 9.క్రిమిభోజన 10.వజ్రకంటక, 11.వైతరిణి, 12.విశాసన, 13.లాలాభక్షణ, 14.రేతఃపాన, 15.ప్రాణరోధ, 16.కుంభీపాక మొదలైనవి.

ఇరుగు పొరుగు పిల్లలను స్త్రీలను అవమానించే వారిని నరకంలో కొండలమీద పడేసి తిండి పెట్టకుండా ఉక్కు పాదాలతో తన్నుతూ దొర్లిస్తారు. అంధతామిస్ర నరకములో పరస్త్రీలను బలాత్కరించే వారిని నానాహింసలూ పెడతారు. వంచనచేసి డబ్బు సంపాదించే వాళ్ళని రౌరవ నరకంలోనూ, పశువులను, పక్షులను బాధించి చంపేవాళ్ళని మహానరకంలోను శిక్షిస్తారు. తల్లితండ్రులనూ, వేదపండితులనూ బాధించేవారు కాలసూత్ర నరకంలో కణకణమండే నిప్పుల్లో కాల్తారు. ఆపదలో ఉన్న బంధు మిత్రులకు సాయపడకుండా సిరిసంపదలతో తులతూగేవారు పురుగులు ఆహారంగా తింటూ క్రిమి భోజక నరకంలో ఉంటారు. దొంగతనం చేసి బతికే వాళ్ళు తప్తోర్మి నరకంలో మండుతున్న ఇనపగుండ్లలో దెబ్బలు తింటారు.

వేద ధర్మం వదిలి పెట్టి, నాస్తికత్వాన్ని ప్రచారం చేసేవాళ్ళు అసిపత్రవనంలో

యమకింకరులు కొరడాలతో కొడుతూ ఉంటే బాధ భరించలేక పరుగులుపెడుతుంటారు. అసిపత్రపు ఆకులు కత్తులు లాగా ఉండి శరీరాన్ని చీరేస్తూ ఉంటాయి. అబాధకువారు గోడుగోడున ఏడుస్తుంటారు. నిర్దోషులకు శిక్షలు విధించేవాళ్ళని కాలసూత్రనరకంలో చెరుకు గడల్లాగా విరిచి హింసిస్తారు. వావి వరుసలు లేకుండా తిరిగే వాళ్ళని కొరడాలతో కొడుతూ కాలుతున్న ఇనుప బొమ్మలమీద పడుకోబెడతారు. పశువులతో క్రీడించే వారిని ముళ్ళ చెట్లకు కట్టి ముళ్ళతో పొడుస్తారు.

వేదం చదివి, ధర్మం తెలిసికూడా పరస్త్రీ సంగమం చేసేవారిని మలమూత్రాలతోను, రక్తమాంసాలతోనూ నిండిన వైతరిణీనదిలో పడేస్తారు. అవే ఆహారంగా పెడతారు. ఆడంబరంగా పశువులను చంపి యజ్ఞాలు చేసేవారిని రంపాలతో కోస్తారు. దొంగలతోను, హంతకులతోనుచ దోపిడీ దార్లతోను స్నేహం చేసి ప్రజలను కొల్లగొట్టే అధికారులు, రాజులు, రాజబంధువులను యమలోకంలోని కుక్కలు తమ పదునైన దంతాలతో చీల్చేస్తాయి. దొంగసాక్ష్యాలు చెప్పేవారిని ఎత్తైన పర్వతాలెక్కించి తలక్రిందులుగా తోసేస్తారు. ఆదెబ్బకి శరీరం ముక్కలైపోయి మళ్ళీ దానంతటదే అతుక్కుంటుంది.

మద్యపానం చేసి స్త్రీలను అవమానించే వాళ్ళని నిప్పులమీద నడిపిస్తారు. ఇనుము కరిగించి నోట్లోపోస్తారు.

కుంభీపాక నరకం అంటే నిప్పులలో వేసి కాల్చటం. కుండలో సలసలా కాగే నూనె కాచి అందులో ముంచటం. ఎలుక కన్నాలు పూడ్చి ఊపిరాడకుండా చేసి వాటిని చంపేవాళ్ళని కుంభీపాక నరకంలో పారేస్తారు.

వీరు అక్కడికి చేరగానే పాపాత్ముల పాపాలు పోయి పుణ్యాత్ములైనారు. దివ్య పరిమళంతోకూడిన గాలులు వీచసాగాయి. యమభటులు పరుగుపరుగున యముని వద్దకు పోయి దుర్వాసుడు రాగానే పాపులంతా పుణ్యాత్ములై పోయారు అని చెప్పారు. దీనికి కారణం తెలియక యముడు ఇంద్రుడి దగ్గరకు, బ్రహ్మదగ్గరకు వెళ్ళాడు. వారికీ పరిస్థితి అర్థంగాక అందరూ కలిసి కైలాసానికి వెళ్ళారు. వాళ్ళవల్ల విషయం తెలుసుకుని, శివుడు చిన్నగానవ్వి దుర్వాసుని శరీరానికి ఉన్న విభూది రేణువు ఒకటి గాలికి ఎగిరి అక్కడ పడింది. దాని మహిమవల్ల పాపులంతా పుణ్యులైపోయారు. ఇవాల్టి నుంచీ ఆ ప్రదేశానికి పితృతీర్థం అని పేరు వస్తుంది.

ఇక్కడికి వచ్చే పాపులకు ఇంకొంచెం దూరంగా చోటు ఏర్పాటు చెయ్యండి. పితృతీర్థం చేరిన వారికి అన్ని రకాల పాపాలు పోతాయి. అన్నాడు.

భస్మం ధరించే విధికే శిరోవ్రతం అని పేరు. విభూది పంచభూతాల స్వరూపం. భస్మధారణవల్ల నుదిటి వ్రాత చెరిగి పోతుంది. మానవుడు స్నానం చెయ్యగానే విభూది ధరించాలి. స్నానం చెయ్యలేకపోతే కాళ్ళు చేతులు కడుక్కుని విభూది ధరించవచ్చు. నుదుట పెట్టిన మూడు రేఖలు బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు ప్రతీకలు. భస్మధారణ లేకుండా పూజచేస్తే ఫలితం లేదు.

వైష్ణవాగమ పద్ధతిన కూడా భస్మధారణ చెయ్యవచ్చు. తులసి మొక్క మొదట్లోది కాని, సముద్రంలోని మన్నుకాని పవిత్రమైనది.

| | | |
|---|---|---|
| నొసటన | - | కేశవుని |
| ఉదరమున | - | నారాయణుని |
| వక్షమున | - | మాధవుని |
| కంఠమున | - | గోవిందుని |
| కడుపు కుడిప్రక్క | - | విష్ణువును |
| కడుపు ఎడమప్రక్క | - | వామనుని |
| భుజాలు | - | మధుసూదనుని |
| కుడిచెవి | - | శ్రీధరుని |
| ఎడమచెవి | - | త్రివిక్రముని |
| పృష్ఠము | - | పద్మనాభుని |
| మూపున | - | దామోదరుని |

స్మరిస్తూ భస్మ ధారణ చెయ్యాలి. విభూది ధరించేప్పుడు రెండు రేఖలమధ్య అంతరం ఉండాలి. వీటి మధ్య లక్ష్మీ నారాయణులుంటారు. ఈ రకంగా భస్మధారణ చేసిన వాడు ఉత్తమ గతులు పొందుతాడు.

# 51. పరమేశ్వరి తత్త్వం

కృతయుగానికి ముందు, సృష్టి ఆరంభానికి పూర్వం జగత్తు అంతా జలమయంగా ఉండేది. ఆ జలరాశిమధ్యన వటపత్రశాయి శయనించి యోగనిద్రలో ఉన్నాడు. ఆయన నాభికమలం నుంచి పుట్టిన పద్మనుంచి బ్రహ్మదేవుడు ఉద్భవించాడు.

ఈరకంగా ఉద్భవించిన బ్రహ్మ ఒక్కసారి నాలుగువైపులా చూశాడు. అంతా నీటిమయం అప్పుడు అతడికి అనుమానం వచ్చింది. తనను పుట్టించినవారెవరు? నీరు నిలిచేది నేలమీద కదా! మరి ఆనేల ఎక్కడ ఉన్నది? ఈ ప్రశ్నలకు సమాధానం దొరుకుతుందేమోనని తాను పుట్టిన తామర పువ్వు వదలి వేయి సంవత్సరాలు నీరు అంతా కలియ దిరిగాడు.అప్పుడు తప తప (తపస్సు చెయ్యి) అనే వాక్కు వినిపించిందతడికి. దాని ప్రకారం తానుపుట్టిన పద్మంలోనే కూచుని వేయేళ్ళు తపస్సు చేశాడు. తరువాత్ సృజ '(సృష్టించు) అనే మాట వినిపించింది. ఏమిటి సృష్టించటం? అంతా నీరే. ఇంకేమీ కనబడటంలేదు. మరి ఎలా సృష్టించటం? ఈరకంగా ఆలోచిస్తున్న సమయంలో మధుకైటభులు అనే ఇద్దరు రాక్షసులు వచ్చి మాతో యుద్ధం చేస్తావా? లేక భస్తావా? అని భయపెట్టసాగారు. దిక్కు తోచని బ్రహ్మదేవుడు చప్పున తామరకాడలోకిదిగిలోపలికి పోయాడు. అక్కడ పీతాంబరుడు, నీలమేఘశ్యాముడు, పుండరీకాక్షుడు అయిన పురుషోత్తముడు నాలుగు చేతులయందు శంఖుచక్రగదాపద్మములు ధరించి యోగనిద్రలో ఉన్నాడు. చేసేది లేక బ్రహ్మదేవుడు అప్పుడు యోగమాయను ప్రార్థించాడు. ఆమెవెంటనే ఆమె విష్ణువును విడిచి ఆకాశాన నిలచింది.విష్ణువు మధుకైటభులను సంహరించాడు ఆ సమయంలో రుద్రుడు కూడా అక్కడికి వచ్చాడు. త్రిమూర్తులు ముగ్గురూ పకలిసి ఆ దేవిని ప్రార్థించారు. ఆమె వారిని కనికరించి త్రిమూర్తులారా! మీరు వెళ్ళి మీ స్థావరాలు ఏర్పరచుకుని నాలుగు విధాలుగా సృష్టి కార్యక్రమం ఆరంభించండి. అన్నది. అందుకువారు 'మాతా! ఎటుచూసినా జలమయం. ఎక్కడా భూమి అనేది లేదు. మరి భూమి లేకుండా భూతములు, గణములు, తన్మాత్రలు, ఇంద్రియాలు అనే ఉపకరణాలు లేకుండా సృష్టి చేయటమెలా సాధ్యం? అన్నారు.

ఇంతలో ఆకాశంనుండి దివ్యమైన విమానం ఒకటివచ్చింది. ఆ విమానం అంతా నవరత్నమయం. ముత్యాలదండలు వేలాడు తున్నాయి. ఒక దివ్యకాంత దానిలో ముందు భాగాన కూర్చుని ఉంది. పరమేశ్వరి ఆజ్ఞపై త్రిమూర్తులు ఆ విమానాన్ని అధిరోహించారు. వాయువేగ మనోవేగాలతో ఆ విమానం బయలుదేరిం నీరులేని చోటికి చేరింది. అక్కడ ఒక మహానగరం. అందమైన పుష్ప, ఫల వృక్షాలు ఆకాశ సౌధాలు యజ్ఞశాలలు, ఆ పట్టణానికి మరింత శోభనిస్తున్నాయి.

ఆ పట్టణానికి దగ్గరలో ఒక అడవి ఉంది. ఆ అడవిలో ఒక రాజు విలాసంగా

వేటాడుతున్నాడు. ఆపట్టణాన్ని ఎవరు నిర్మించారో తెలియలేదు. చూస్తే అది స్వర్గంలా ఉంది. ఎదురుగా ఒకవనం. అందులో కల్పవృక్షం. దాని నీడలో కామధేనువు. అటు ఇటు రాజసంగా తిరుగుతున్న ఐరావతం. కొంచెం దూరంలో అప్సరసలు, అక్కడికి ఇంకొంత దూరంలో శచీపురందరులు. కనిపించారు. అనుమానం లేదు. ఇది స్వర్గమే. అనుకున్నారు త్రిమూర్తులు. ఇంతలోనే విమానం బయలు దేరి బ్రహ్మలోకానికి చేరింది అక్కడ ఒక బ్రహ్మ ఉన్నాడు. శివకేశవులు అతణ్ణి ఆశ్చర్యంగా చూస్తూ తమతో పాటు ఉన్న బ్రహ్మని అడిగారు అతడెవరని? తెలియదన్నాడు చతుర్ముఖుడు. విమానం కైలాసగిరి చేరింది. అక్కడ శివుడు పార్వతీ సమేతుడై వృషభవాహనం మీద వస్తున్నాడు. ముందు వెనకల భూత ప్రేత గణాలున్నాయి. ఇదంతా ఇంద్రజాలంలా ఉంది అనుకున్నారు, త్రిమూర్తులు. ఇంతలోనే విమానం వైకుంఠం చేరింది. అక్క చతుర్భుజుడైన శ్రీమహావిష్ణువు లక్ష్మీ సమేతుడై దర్శనమిచ్చాడు. అవాక్కయ్యారు త్రిమూర్తులు. విమానం పాలసముద్రం చేరింది. ఆమధ్యలో ఒక ద్వీపం. అందులో కల్పవృక్షాలవనం. ఆ వనం మధ్యన చింతామణులతో నిర్మించబడిన భవనం, అక్కడ త్రికోణాకార మంచం మీద ఒకదివ్యమంగళ విగ్రహం. ఎర్రని వస్త్రాలు ధరించి, ఎర్ర చందనము శరీరానికి పూసుకుని, సర్వాలంకృతయై కోట్లకొలది సూర్యుల కాంతితో ప్రకాశిస్తున్నావిడ.. ఆమె కూర్చున్నది ఒక యంత్రపీఠము. అమెచేతులో పాశము, అంకుశము, బాణాలు చెరుకువిల్లు ఉన్నాయి. దేవతలందరూ ఆమెకు పరిచర్యలు చేస్తు హృల్లేఖీ, భువనేశీ అని జపిస్తున్నారు. అక్కడ తిరుగాడే చిలుకలు గోరింకలు కూడా హ్రీంకార జపం చేస్తున్నాయి.

హ్రీంకారాసన గర్భితానలశిఖాం సౌఃక్లీంకళాబిభ్రతీం
సౌవర్ణాంబర ధారిణీం వరసుధా ధౌతాం త్రినేత్రోజ్వలాం
వందే పుస్తక పాశ స్రమంకుశ ధరాం స్రగ్భూషితాముజ్వలాం
త్వాంగౌరీం త్రిపురాం పరాత్పరకళాం శ్రీచక్రసంచారిణీం

సకుంకుమ విలేపనా మళికచుమ్బి కస్తూరికాం
సమన్ద హసితేక్షణాం సశర చాప పాశాంకుశాం
అశేషజనమోహినీ మరుణ మాల్య భూషామ్బరాం
జపాకుసుమ భాసురాం జపవిధౌ స్మరేదమ్బి కామ్॥

త్రిమూర్తులు ఆదేవిని పరిపరివిధాల స్తుతించారు.

నమో దేవ్యై ప్రకృత్యై చ- విద్యాత్ర్యై సతతం నమః॥
కల్యాణ్యై కామదాయై చ- వృద్ధ్యై సిద్ధ్యై నమో నమః

సచ్చిదానందరూపిణ్యై - సంసారారణయే నమః॥
పంచకృత్య విధాత్ర్యైతే భువనేశ్యై నమోనమః ।
సర్వాధిష్ఠానరూపాయై - కూటస్థాయై నమో నమః॥
అర్ధమాత్రార్థభూతాయై - హృల్లేఖాయై నమో నమః

జ్ఞాతం మయా ఖిలమిదం త్వయి సన్నివిష్టం।
త్వత్తో స్య సంభవలయావపి మాత రద్య।
శక్తిశ్చ తే స్య కరణే వితత ప్రభావా।
జ్ఞాతాధునా సకలలోకమయీతి నూనమ్.

శ్రీదేవి, ప్రకృతి, విధాత్రి, అమృత స్వరూప, కళ్యాణి, కామద వృద్ధి, సిద్ధి, శ్రీ, భువనేశ్వరి అగుదేవికి నమస్కారము.
సర్వాధిష్టానస్వరూప, కూటస్థ, అర్ధమాత్ర, అర్ధరూప హృల్లేఖ అగు దేవికి నమస్కారము. తల్లీ! ఈజగత్తంతా నీ నుంచి ఉద్భవించి మరల నీయందే లయ మగుచున్నది. ఇవి అన్నీ నీవే చేయగలవు.నీవు సకలలోకమయివి.

ఆవిధంగా త్రిమూర్తులు దేవిని స్తుతించిన తరువాత బ్రహ్మ జగదంబా! నీవు స్త్రీవా? పురుషుడవా? ఏకమేవా ద్వితీయంబ్రహ్మ అనే వేదవాక్యానికి అర్థం నీవేనా? వివరించవలసినది అన్నాడు. దానికి ఆ పరాశక్తి.

ఉపాధి భేదంవల్ల రెండు విధాలయినట్లు అద్దంలో కనిపించే ప్రకృతిలాగా క్రియా సమయంలో భిన్న త్వం కనిపించినా పరమావస్థయందు బ్రహ్మ పదార్థం ఒక్కటే. దానికి వైవిధ్యం లేదు. సృష్టి సమయం లోగాని లయ సమయం లోగాని నాకు స్త్రీ పురుషనపుంసక భేదాలు ఉండవు. ఈ సృష్టిలో నాకు వేరైన పదార్థమేమీ లేదు.

బుద్ధి, శ్రీ,ధృతి, కీర్తి, స్మృతి, శ్రద్ధ, మేధ, దయ, లజ్జ, తృష్ణ, కాంతి, శాంతి, పిపాస, నిద్ర, జర, విద్య అవిద్య, వాంఛ, శక్తి, అశక్తి, ఋతము, అమృతము, వాక్కు, పర, పశ్యంతి, మధ్యమ, వైఖరి, అంతానేనే.

బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి,మాహేంద్రి, చాముండ మొదలైన సప్త మాతృకలు నేనే. నీటిలోని చల్లదనం, అగ్నిలోని వెచ్చదనం, సూర్యునిలో తేజస్సు, చంద్రునిలోని మంచు నేనే.నేను లేనివస్తువు ఏదీలేదు. నేనులేనిదే ఏశక్తి అయినా అశక్తే అవుతుంది. అంతదాకా ఎందుకు? నేను లేకుండా మీరు ముగ్గురూకూడా ఏపనీ చెయ్యలేరు. శక్తితో కలిస్తేనే బ్రహ్మసృష్టి చేస్తాడు. విష్ణువు లోకాలను రక్షిస్తాడు. శివుడు లయం చేస్తాడు. భూమి, అనంతుడు, ఆదివరాహం, ఆదికూర్మములు కూడా శక్తితో కలిసినవి కాబట్టే ఈబరువును మోయగలుగుతున్నాయి. లేకపోతే అణువును కూడా అవి మోయలేవు. అంతదాకా ఎందుకు? నీరు,నిప్పు,గాలి వీటికి నేను లేకపోతే పేర్లే మిగులుతాయి. గుణాలుండవు.మహత్తు అనేది

1. క్షణికము
2. శూన్యము
3. నిత్యానిత్యము
4. సకర్తృత్వము
5. అహంకారాగ్ర్యము
6. మహత్తు
7. శాశ్వతము

అని ఏడురకాలుగా ఉంటుంది. అవ్యక్తము నుంచి వ్యక్తమైన మహత్తు, దానినుంచి అహంకారము పుట్టినాయి. కాబట్టి ఓ బ్రహ్మదేవా! మహత్తు వలన నువు సృష్టి చేయవలసినది. అని శ్వేతాంబరధారి, రజోగుణ ప్రధానురాలు అయిన వీణాపాణిని అతనికి భార్యగా ఇచ్చి సత్యలోకానికి వెళ్ళి సృష్టికార్యక్రమంచూడు హరిహరులిద్దరూ నీకు సాయంగా ఉంటారు. దేవతలను సృష్టించు. భూలోకంలో బ్రాహ్మణులు యజ్ఞయాగాదులుచేసి మిమ్మల్ని తృప్తి పరుస్తారు. హరిహరులు రాక్షస సంహారం చేస్తుంటారు. వారికి అసాధ్యులైన వారిని వారాహి మొదలైన నాశక్తులు వచ్చి హతమారుస్తాడు. నవాక్షరమైన నామంత్రాన్ని జపిస్తూ ఉండు అని చెప్పింది. ఆతరువాత విష్ణువుకు లక్ష్మీదేవిని, శివుడికి మహాకాళినీ భార్యలుగా ఇచ్చి వారిని వైకుంఠానికి, కైలాసానికి వెళ్ళి స్థితి, లయాలు చూడమన్నది. ఆతరువాత పరమేశ్వరి త్రిమూర్తులతో ఈవిధంగా అన్నది.

సత్వరజస్తమోగుణాలు మూడు ముఖ్యమైనవి. మీరు ముగ్గురూ వాటికి ప్రతీకలు. పరమాత్మ ఒక్కడే వాటికి అతీతుడు. పరమాత్మకూ నాకూ భేదంలేదు.

అంతకూ నేనేకారణం. నావల్లనే మహత్తత్త్వము, దానివల్ల అహంకారము, దానినుంచి పంచతన్మాత్రలు, వాటినుంచి పంచభూతాలు పుట్టాయి.

అన్నిటికీ పంచభూతాలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు అనే పదహారు తత్త్వాలే కారణము. పురుషుడు కారణమునందుకాని, కార్యమునందుకాని ప్రవేశించడు. అతడు నిర్వికారుడు, నిర్గుణస్వరూపుడు. అన్నిటికీ కారణము అతడే. ఈజగత్సృష్టి అంతా అతని అధీనంలోనే ఉంటుంది. అదే పరమేశ్వరతత్త్వం. నేను, ఆపరమేశ్వరుడు బింబ ప్రతిబింబాలని గుర్తించి మీమీస్థానాలకు వెళ్ళండి అన్నది. త్రిమూర్తులు పరమేశ్వరికి అంజలి ఘటించి ముందుకు నడిచారు.

# 52. ఉమాదేవి

ఒకసారి దేవదానవులకు యుద్ధం జరిగింది. ఆయుద్ధంలో దేవతలు విజయం సాధించారు. ఆతరువాత వారందరు ఒకచోటచేరి యుద్ధం ఏరకంగా జరిగిందీ, దాంట్లో వారు ఏరకంగా వీరవిహారం చేసింది చర్చించుకుంటున్నారు. తమవిజయానికి కారణము పరాశక్తి అనేమాట మరచిపోయారు. అగ్ని దేవుడు తన అగ్నిజ్వాలలతో రాక్షసులను ఏరకంగా దహించివేసింది వివరించి ఆవిజయానికి కారణము తానే అన్నట్లుగా చెప్పాడు. వాయుదేవుడు ప్రచండ వేగంతోతాను వీచి రాక్షసులను చికాకు పెట్టి పోరాడలేకుండా చేశానన్నాడు. వరుణుడు తాను కుంభవృష్టి కురిపించి శత్రుసేనలు కదల లేకుండా చేశానన్నాడు. నేను వజ్రాయుధం ధరించి వీరవిహారం చేస్తుంటే రాక్షసులు తలా ఒకదిక్కుకూ పారిపోయారు అనిచెప్పాడు ఇంద్రుడు. ఈరకంగా తమ గొప్పలు చెప్పుకుంటూ "శత్రువులను సమూలంగా నాశనం చేసింది మేమే. ఈవిజయం మాదే।" అని గర్వించసాగారు.

పరబ్రహ్మతత్త్వం దేవతల గర్వాన్ని గమనించింది. వారి అహంకారం పోగొట్టటానికి వారి ఎదుట ప్రత్యక్షమైంది. కాని ఆతత్వాన్ని ఇదమిత్థంగా తెల్సుకోలేక పోయారు దేవతలు.

దేవతలంతా అగ్నిదేవుని సమీపించి "అగ్నిదేవా। ఏదో ఒకతత్త్వం ఇక్కడ ప్రత్యక్షమైంది. నీవు అద్వితీయమైన శక్తి సంపన్నుడివి. నీ అగ్నిశిఖలతో రాక్షసులను ఘోరంగా సంహరించావు. ఇప్పుడు ఆతత్త్వం సంగతి చూడు" అన్నారు. అగ్ని దేవుడు సరేఅని వెళ్ళి ఆ శక్తిని సమీపించాడు. భూతంలాగాకనిపిస్తున్న ఆశక్తి అగ్నిని ఎవరునువ్వు? అని అడిగింది. "నేను అగ్ని దేవుడను. లోకంలో జాతవేదసుడని పేరుపొందాను.

"మరినీశక్తి సామర్థ్యాలేమిటి?"

"జగత్తులో ఏవస్తువునైనా సరే క్షణంలో కాల్చి బూడిద చేసేస్తాను"

అప్పుడు ఆశక్తి ఒక గడ్డిపోచను ముందుపడేసి "దీనిని కాల్చి బూడిద చెయ్యి" అంది. అగ్ని దేవుడు క్షణాలమీద మంటలు మండించాడు. కాని గడ్డికాలిపోలేదు. అగ్ని దేవుడికి ఏం పాలుపోలేదు. వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు.

దేవతలు వాయువును సమీపించి ఆతత్త్వం ఏమిటో తెలుసుకోమన్నారు. అలాగే అని వాయువు ఆతత్త్వం దగ్గరకు వెళ్ళాడు. అప్పుడు అది వాయువుతో "ఎవరునువ్వు " అంది.

"నేను వాయువును. వేయువేగము అనినావేగానికి పేరు. మాతరిశ్వుడని పేరు పొందాను"అన్నాడు.

"నీశక్తి ఏమిటి?"

"జగత్తులో ఏవస్తువునేనా సరే ఎగరగొట్టగలను"

అక్కడ ఉన్న గడ్డి పోచను చూపించి "దీన్ని ఎగరగొట్టు చూద్దాం!"అంది ఆతత్త్వం.

తనబలం అంతా కూడదీసుకుని ప్రయత్నించాడు వాయువు. గడ్డి పోచకొంచెం కూడా కదల్లేదు. చేసేది లేక వెనక్కి వెళ్ళిపోయాడు. దేవతలు దేవేంద్రుడిని ప్రయత్నించమన్నారు. అలాగే అని ఇంద్రుడు ఆశక్తి దగ్గరకు వెళ్ళాడు.

ఆ తత్త్వం అదృశ్యమైపోయింది. ఆ స్థానంలో అందమైన స్త్రీమూర్తి ప్రత్యక్షమైంది. ఆమెయే పరాశక్తి. దేవేంద్రుడు దానికి నమస్కరించి "తల్లీ!మమ్మల్నందర్నీ భయంలో ముంచెత్తిన ఆభీకరాకారము ఎవరు?" అని అడిగాడు.

ఇంద్రా!ఇంతకుముందు కనిపించిన శక్తే పరబ్రహ్మస్వరూపము. దాన్ని గ్రహించలేక పోయారు. దేవతలు, ఆతత్త్వమేమీలో శక్తిని నింపి యుద్ధం చేయించింది. మీరు దాని శక్తి వల్లనే రాక్షసులను సంహరించారు. ఆతత్త్వమేనేను. నేను గనక లేక పోతే మీరు ఏపనీ చెయ్యలేరు. మీరంతా నిమిత్తమాత్రులు. ఈవిషయం తెలుసుకోండి. అహంకారాన్ని విడిచి పెట్టి ఆత్మజ్ఞానాన్ని పెంపొందించుకోండి."అనిచెప్పి అంతర్ధానమై పోయింది.

ఇంద్రాది దేవతలు ఆ పరాశక్తిని పరిపరి విధాల కీర్తించారు.



# 53. ఆత్మస్వరూపం

ముడిపదార్థం గురించి మనకు తెలిసినట్లైతే ఆపదార్థంతో తయారయిన వస్తువులను గురించి తేలికగా తెలుస్తుంది. ఉదాహరణకు మట్టిని గురించి తెలిస్తే, దానితో తయారుచేసే కుండలు, బానలు మొదలైన వస్తువులను గురించి తెలుస్తుంది. అలాగే బంగారం గురించి తెలిస్తే దానితో తయారుచేసే నగలపేర్లు వేరుగా ఉన్నా, వాటన్నింటిలో ఉన్నది బంగారమే అని తెలుస్తుంది. అదేవిధంగా ఏవిషయం తెలునుకోవటంవల్ల అన్ని విషయాలూ తెలుస్తాయో, దాన్ని తెలుసుకోవాలి. ప్రతివిషయంలోను అంతర్గర్భితంగా ఉండే తత్త్వం గనక తెలుసుకుంటే మిగిలిన విషయాలన్నీ తెలుస్తాయి.

నదులు తూర్పునుంచి పడమరకు ప్రవహించినా, పడమరనుంచి తూర్పుకు ప్రవహించినా చివరకు అవి సముద్రంలోనే కలుస్తాయి. సూర్యరశ్మికి నీరు ఆవిరిగా మారి మేఘాల రూపం పొందుతుంది. ఆ మేఘాలు మళ్ళీ వర్షించి నదులుగా ప్రవహిస్తాయి. ఆనదులన్నీ మళ్ళీ సముద్రంలో కలుస్తాయి. సముద్రంలో కలిసేవరకూ నదులకు గంగ, కృష్ణ, కావేరి అని వివిధ రకాలపేర్లుంటాయి. కాని సముద్రంలో కలిసిన తరువాత ఆనదీజలాన్ని విడదియ్యలేము. అలాగే అన్ని జీవాత్మలూ పరమాత్మలోని అంతర్భాగాలే.

సృష్ట్యారంభం కాకముందు, కృతయుగారంభంలో పరమేశ్వరుడు నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయి, ఇతరములతో సంబంధంలేకుండా, తనకు సమానమైన వారుగాని, అధికులుగాని లేకుండా, ఏకాకిగా ఉండేవాడు. ఈరకంగా ఉన్న పరబ్రహ్మపూర్ణ బిందు స్వరూపుడు. ఆఏకైకత్వం అనేకం కావాలని సంకల్పించింది. రకరకాల వస్తువులుగా చిత్రవిచిత్ర సమ్మేళనాలతో రూపుదాల్చింది. ఘన, ద్రవ, వాయు పదార్థాలుగా ఎన్నో రూపాలుగా మార్పుచెంది, భిన్న రూపాలతో ఈసృష్టి ఆకారం పొందింది. జీవరాసులు ఉత్పన్నమయినాయి. సృష్టిలో భాగంగానే హకార సంజ్ఞ కలిగిన పరమాత్మ సకార సంజ్ఞకలిగిన ప్రకృతితో కలిసి శబళబ్రహ్మమై, బ్రహ్మరంధ్రం ద్వారా నవరంధ్రములతో నిర్మించబడిన మానవ దేహంలో ప్రవేశించి, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు అనబడే పదకొండు ఇంద్రియాలద్వారా ప్రాపంచిక సుఖాల ననుభవిస్తూ, పంజరంలోని పక్షిలాగా ఈదేహంలో బంధించబడి బయటకుపోయే మార్గం తెలియక కొట్టుమిట్టాడుతున్నాడు. జీవాత్మ అనబడే

ఈహంసకు అగ్ని, చంద్ర మండలాలే - రెక్కలు, ఓంకారము - శిరస్సు, జ్ఞాననేత్రము-ముఖము, హకార సకారములే-పాదాలు. ఈరకంగా పరమాత్మ అన్ని ప్రాణులలోనూ పాలలో ఉన్న నెయ్యిలాగా ఆవరించి ఉన్నాడు. అన్ని జీవాత్మలూ పరమాత్మలోని భాగాలే. మర్రిచెట్టు చాలా పెద్దవృక్షం. కాని దానికి కారణమైన విత్తనంలో చూస్తే ఏమీ కనిపించదు. అంటే విత్తనంలో అంతపెద్ద వృక్షానికి కారణమైనది, మనకంటికి కనిపించనంత సూక్ష్మమైనది దాగి ఉన్నది. అదే విధంగా ఆత్మబయటకు కనిపించకుండా, సూక్ష్మరూపంలో సర్వత్రా వ్యాపించి ఉంటుంది. ఆత్మకు నాశనంలేదు. ముసలితనంలేదు. ఆత్మకు పాపం అంటదు. శోకం తాకదు. ఆకలి దప్పికలు ఉండవు. స్వప్నప్రపంచంలో ప్రభువులాగా విహరించే చైతన్యమే ఆత్మ. గాఢసుషుప్తిలో తృప్తిగా ఆనందాన్ని అనుభవించేదే ఆత్మ.

ప్రకాశబిందువు పరబ్రహ్మస్వరూపమైన చంద్రమండలం అకారబీజం. విమర్శబిందువు శక్తిస్వరూపం. అగ్నిమండలం. హకారబీజం. ఈరెండింటి సామరస్యమే 'అహం'. ఇదే పరబ్రహ్మస్వరూపం. పరమేశ్వరుని ప్రతిబింబమే శక్తి. అదే మాయ. అందుచేతనే శివసంబంధంలేకుండా శక్తిగాని, శక్తిసంబంధంలేకుండా శివుడుగాని ఈజగత్తును సృష్టించలేరు. ఇక్కడ శివశక్తులు అంటే త్రిమూర్తిద్వంద్వములోని వారుకాదు. పరమేశ్వరీ పరమేశ్వరులని గుర్తిచాలి. వీరిద్దరికలయిక లేనిదే స్వరూపజ్ఞానం కలగదు. అహమనేది ఆత్మస్వరూపం. ఇదే ఆత్మమంత్రం. ఆత్మమంత్రము, హంసమంత్రము రెండూ సమాన ధర్మాలు కలిగి ఉన్నాయి.

శరీరం అశాశ్వతమైనది. శాశ్వతమైన ఆత్మకు అశాశ్వతమైన శరీరము అవాసంగా ఉంటుంది. శరీరము ఉన్నంతకాలము ఆత్మకు గుణదోషాలు, సుఖదుఃఖాలు అంటినట్లు, వాటితో సతమతమవుతున్నట్లు అనిపిస్తుంది. ఆత్మశరీరంతో సంబంధం ఏర్పరచుకోవటంవల్ల, జీవులకు సుఖదుఃఖాలతో సంబంధం ఏర్పడుతుంది. మానవుడు మాసిన వస్త్రాన్ని వదలి నూతన వస్త్రాన్ని ధరించినట్లుగానే, ఆత్మ జీర్ణమైన దేహాన్ని వదలి వేరే దేహాన్ని ఆశ్రయిస్తుంది. ఆత్మశరీరంనుంచి విడిపోతే భౌతికబంధాలనుండి విముక్తి కలుగుతుంది.

**ఆత్మజ్ఞానం:**

ఒక మనిషికళ్ళకు గంతలు కట్టి ఆపరిచితమైన అరణ్యం మధ్యలో వదిలేశామనుకోండి. అప్పుడతడు దారితెన్నూ తెలియక అన్ని దిక్కులూ తిరుగుతాడు.

తననెవరో బంధించినట్లు బాధపడతాడు. తన ఇంటికి దారిచూపమని ఏడుస్తాడు. అప్పుడు ఎవరోవచ్చి కళ్ళకు కట్టిన గంతలు తీస్తారు. అతడికి కళ్ళు కనిపిస్తాయి. కనిపించిన వాళ్లని దారిఅడుగుతూ ఇల్లుచేరతాడు. ఇదేవిధంగా మానవుడి మనస్సుకు అజ్ఞానంతో కొట్టుమిట్టాడుతున్న సాధకుడు జ్ఞానసముపార్జన చెయ్యాలి. జిజ్ఞాసతో ప్రతి అడుగుయొక్క గమ్యం ఆత్మే కావాలి. నీవే ఆత్మ. ఆత్మే నీవు.

ఈ విషయాలను పూర్తిగా తెలుసుకొని పరమేశ్వరీ ధ్యానం చెయ్యాలి. హ్రీంకారంలో మూడు అక్షరాలున్నాయి. వాటి అర్థం పూర్తిగా తెలుసుకోవాలి. దీనిలో

| | | |
|---|---|---|
| హ కారము | - | స్థూలదేహము |
| ర కారము | - | సూక్ష్మదేహము |
| ఈ కారము | - | కారణదేహము |

ఈ రకంగా బీజత్రయంతో కలసి ఉన్నరూపము హ్రీం పరమేశ్వరీ నాదము. ఆ నాదోపాసనే ఆమెను చేరే మార్గము.



# 54. వింధ్యవాసిని

పాలకడలిలో శ్రీమహావిష్ణువు హాయిగా నిద్రపోతున్నాడు. అతడినాభినుంచి ఒకపద్మం వచ్చింది. దానిలో బ్రహ్మదేవుడు ఉన్నాడు. పద్మంలో కూచుని ఉంటాడు కాబట్టే అతడికి పద్మాసనుడు అని పేరు వచ్చింది. పరమేశ్వరి అనుగ్రహం వల్ల భూమి మొదలైన పంచభూతాలు, తన్మాత్రలు ఏర్పడ్డాయి. వీటిని ఆధారంగా చేసుకుని బ్రహ్మ సృష్టి ప్రారంభించాడు. అందులో భాగంగా మొట్టమొదటగా ఒకస్త్రీని, ఒకపురుషుణ్ణి సృష్టిచేశాడు. ఆస్త్రీపేరు శతరూప. పురుషుడు స్వాయంభవమనువు. భూలోకంలో ఆది దంపతులు వీరే.

స్వాయంభవుడు పాల కడలిదగ్గరకూచుని అనేక సంవత్సరాలు ఆపరమేశ్వరిని గూర్చి తపస్సు చేశాడు. అతని తపస్సుకు మెచ్చి దేవి ప్రత్యక్షమై ఏంవరం కావాలో కోరుకోమన్నది. దానికి మనువు "తల్లీ!నీదయవల్లనే గాలి వీస్తున్నది. నిప్పుమండుతున్నది. నీరు పారుతున్నది. ఈబ్రహ్మాండమంతా నీఆజ్ఞకులోబడి ఉన్నది. నీకృపకు పాత్రులైన వారిని సర్వలోకాలు పూజిస్తాయి. నాది ఒకచిన్న కోరిక. నావల్ల జరగబోయే ఈసృష్టి నిరాటంకంగా జరిగేట్లు, వాగ్భవబీజం జపించేవారు నీకృపకు పాత్రలయ్యేటట్లు నాకు వరమియ్యి."అన్నాడు. దానికి ఆపరాశక్తి సంతోషించి నీకోసం నువు ఏమీ అడగలేదు. నీపరోపకారబుద్ధికి సంతోషిస్తున్నాను. నీకోరిక తప్పక తీరుతుంగి" అని చెప్పి వింధ్య పర్వతశిఖరానికి బయలుదేరింది.

పర్వతాలలో విశిష్టమైనది వింధ్యపర్వతము. దాన్నిండా పెద్దపెద్ద చెరియలు, లోయలు, ఫలవృక్షాలు, జలపాతాలు, అడవులు, ఎన్నో ఉన్నాయి. దేవతలు ఈప్రాంతంలో విహరిస్తూ ఉంటారు. ఇక్కడి పుణ్యనదీ జలాల్లో స్నానం చేస్తారు.

ఒకనాడు నారదుడు వింధ్యగిరికి వచ్చి ఆపర్వతరాజుతో రాజా! మేరుగిరి భోగభాగ్యాలతో తులతూగుతున్నది. దానిమీద దేవతలు, వాళ్ళలోకాలు, అందమైన ఇళ్ళు ఎంతో వైభవంగా ఉన్నది. శంకరుడు నివసిస్తున్నందు వల్ల హిమాచలానికి గొప్పదనం వచ్చింది. అలాగే నీలాచలము, గరుడాచలము ఒకటేమిటి? అన్నిటికీ ఏదో ప్రత్యేకత ఉంది. అంతెందుకు? మేరువుముందు ఏవీ సాటిరావట. అన్నాడు.

ఆలోచించాడు వింధ్యరాజు. తాను అసాధారణ బలసంపన్నుడని అంటారు అందరూ. కాని ఏమిటి లాభం? ఏదో ఒకటి చెయ్యాలి. అనుకుని తెల్లవారేప్పటికి శిఖరాలు పెంచేశాడు. బారలు చాపాడు. అంతే అనూహ్యంగా పెరిగిపోయిందికొండ.

మర్నాడు ఉదయం సూర్యోదయం అయింది. అనూరుడు గుర్రాలు తోలుతున్నాడు. సూర్యుని రథం పరుగుపెడుతున్నది. వింధ్య దగ్గరికి వచ్చేప్పటికి వింధ్య

శిఖరం తగిలి రథం ఊగిపోయింది. ఆఊపుకి సూర్యుడు ముందుకు పడబోయి జండాకర్ర పట్టుకుని ఆగాడు. రథం ఆగిపోయింది. కారణం ఏమిటని సారథిని అడిగాడు భాస్కరుడు. విషయం చెప్పాడు అనూరుడు. గ్రహణసమయంలో కొన్ని గంటలు మాత్రమే చలనం లేకుండా ఉండే సూర్యుడు, ఇప్పుడు వింధ్య పెరగటం వల్ల చాలా కాలం అచేతనుడైపోయాడు. పగలు రాత్రి బేధం లేకుండా పోయింది. లోకాలు చీకట్లో మునిగిపోయినాయి. హోమాలు, సంధ్యలూ ఆగిపోయినాయి. కొందరికి కేవలం పగలే. మరికొందరికి అంతా రాత్రే.

ఈపరిస్థితి చూసి బ్రహ్మతో మొరపెట్టుకున్నారు ఇంద్రాది దేవతలు. అందరూ కలసి విష్ణువు దగ్గరకెళ్ళారు. కాశీ క్షేత్రంలో ఉన్న అగస్త్య మహర్షిని ఆశ్రయించండి. ఆయన లోకగతిని, సూర్యగతి కూడా మార్చగలడు" అన్నాడు విష్ణువు.

దేవతలంతా అగస్త్య మహర్షి దగ్గరకు వెళ్ళారు. ఆయన దేవతలను సాదరంగా ఆహ్వానించాడు. కుశలప్రశ్నల తరువాత విషయం చెప్పారు దేవతలు. వారికి అభయమిచ్చి పంపేశాడు అగస్త్యుడు.

మరునాడు అగస్త్యుడు భార్యతో మనకు కాశీ నివాసానికి ఆటంకం ఏర్పడింది. నేను దేవతలకు మాట ఇచ్చాను. కాబట్టి ఇక్కడినుంచి బయల్దేరదాము అని ఆఖరిసారిగా గంగలో స్నానం చేసి, విశాలాక్షీ, విశ్వేశ్వరులను సందర్శించి లోపాముద్రతో కలిసి వింధ్యగిరి వద్దకు వచ్చాడు.

అగస్త్యుణ్ణి చూడగానే వింధ్య పర్వతం మానవరూపంలో మహర్షి దగ్గరకు వచ్చి సాదరంగా ఆహ్వానించి ఈసేవకుడి వల్ల మీకేం కావాలి? అన్నాడు.

దానికి మహర్షి వత్సా నేను దక్షిణ దేశయాత్రలకు వెడుతున్నాను. ఎత్తైన ఈరాళ్ళమీదనుంచి నడిచి వెళ్లలేను కదా. అందుకని నేను తిరిగి వచ్చేదాకా కొంచెం వంగి ఉండు అన్నాడు అగస్త్యుడు

అగస్త్యుడి మాటమన్నించి పర్వతరాజు అదివరకటి దాని కన్న ఇంకా వంగిపోయి ఆయనకు వెళ్ళటానికి వీలు కల్పించాడు. వింధ్య దాటిన అగస్త్యుడు దక్షిణాపథాన మలయ పర్వతం మీద స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నాడు. ఇచ్చిన మాట ప్రకారం పర్వతరాజు అలా వంగే ఉన్నాడు.

ఆరకంగా సూర్యుని యొక్క గమాన్ని ఆపి ముల్లోకాలనూ భయభ్రాంతులు చేసిన వింధ్యపర్వత శిఖరానికి వెళ్ళింది ఆదేవి. అప్పటినుంచీ ఆమె వింధ్యవాసినిగా పిలువబడుతోంది.

# 55 భ్రామరి

మురాసురుడు ఒక రాక్షసుడు. ఇతడు బ్రహ్మను గూర్చి తపస్సుచేసి తన అరచేయి ఎవరి మీద పెడితే వాడు భస్మమై పోయేటట్టు వరం పొందాడు. ఆ వరం పొందిన వెంటనే యముని భస్మం చెయ్యటానికి అతని వెంటపడ్డాడు. యముడు భయపడి పారిపోయి విష్ణువును శరణుకోరాడు. మురాసురుడు విష్ణువు దగ్గరకు పోయి నీతో యుద్ధానికి వచ్చాను అన్నాడు. దానికి విష్ణువు నువునాతో యుద్ధానికి వస్తే నీ గుండె ఎందుకు అంత వేగంగా భయంగా కొట్టుకుంటోంది? అన్నాడు. లేదే అంటూ మురాసురుడు తనచేతిని గుండె మీద పెట్టుకున్నాడు. అంతే మరుక్షణంలో భస్మమైపోయాడు.

అతని కుమారడు అరుణుడు. దేవతలనందరినీ జయించాలనే కోరికతో హిమాలయాలకు వెళ్ళి బ్రహ్మను గూర్చి తపస్సు చేయ సాగాడు. అక్కడ కేవలం ఆకుల మీద పడుకుని పదివేల సంవత్సరాలు

నీరుతాగి పదివేలసంవత్సరాలు

గాలిపీలుస్తూ పదివేల సంవత్సరాలు

ప్రాణాయామంతో పదివేల సంవత్సరాల మొత్తం నలభైవేలసంవత్సరాలు పాటు గాయత్రీ జపం చేశాడు. అరుణుడి శరీరం నుంచి అగ్ని జ్వాలలు ప్రజ్వరిల్లి బ్రహ్మలోకానికి వ్యాపించాయి. బ్రహ్మ ప్రత్యక్షమై ఏ వరంకాలో కోరుకో అన్నాడు. అందరు రాక్షసుల మదిరిగానే చావు లేకుండా వరం కావాలన్నాడు అరుణుడు.

త్రిమూర్తులు కూడా కాలానుసారం కన్ను మూసేవారే. చావులేకుండా వరమివ్వటం నావల్లకాదు. ఇంకేదయినా వరం కోరుకో అన్నాడు బ్రహ్మ. అస్త్రాలతోగాని, శస్త్రాలతో గాని, స్త్రీతోగాని, పురుషునితో గాని, యుద్ధంలో గాని నాకు చావులేకుండా వరం కావాలి. దేవతలను జయించేశక్తి కావాలి అన్నాడు రాక్షసుడు. తథాస్తు అన్నాడు బ్రహ్మ.

బ్రహ్మ వరప్రసాదంతో రాజై పాతాళానికి పోయి ఒక రాక్షసుణ్ణి పిలిచి ఇంద్రుడి దగ్గరకు పోయి స్వర్గాధిపత్యం అప్పగించి పోతాడో? నాతో యుద్ధం చేస్తాడో కనుక్కురమ్మన్నాడు. ఆమాట వినగానే ఇంద్రుడు కిమ్మనకుండా బ్రహ్మ దగ్గరకు పరుగెత్తాడు. దేవతలంతా కూచుని ఆలోచించారు. ఏమిటి కర్తవ్యం? వారంతా పరమేశ్వరిని ధ్యానించారు. ఆ దేవి ప్రత్యక్షమై ఆరాక్షసుడు ఏకాగ్రతతో గాయత్రీ జపం చెయ్యటం వల్ల అంత బలవంతుడైనాడు. వాడు ఆజపం వదిలి పెట్టేటట్టు చూడండి అంది.

దేవతలంతా కలసి దేవీ యాగం ప్రారంభించారు. బృహస్పతి అరుణుడి దగ్గరకు వెళ్ళాడు. అయన్ను చూడగానే శత్రుపక్షము వాడవు ఇలా వచ్చావేమిటి?అన్నాడు రాక్షసుడు. దానికి బృహస్పతి రాక్షసరాజా! నేను శతృపక్షము వాడిని కాదు. నేనుగాయత్రీ ఉపాసుకుణ్ణే. నువుకూడా అంతే. అంచేత మనం మిత్రులమే కదా!అన్నాడు. ఆమాట విన్న అసురుడు

తనలోని సహజమైన అహంకారంతో గాయత్రిని విడిచి పెట్టాడు. ఇది ఆదేవి యొక్క మాయ. గాయత్రీమంత్ర జపం వదలగానే అరుణుడి తేజస్సు తగ్గిపోయింది. ఆవిషయం తెలిసిన దేవతలు ఆనందంతో పరమేశ్వరిని ప్రార్థించారు. ఆదేవి ప్రత్యక్షమైంది. ఆమె చుట్టూ భ్రామరీ, భ్రమరాలు, (మగ,ఆడతుమ్మెదలు)లెక్కలేనన్ని ఉన్నాయి.

దేవి ఆజ్ఞమేరకు ఆభ్రమరాలు ఒక్కసారిగా అరుణుడి మీదా, అతని సైన్యం మీదా పడి రక్తం పీల్చేశాయి. ఏం జరుగుతోందో తెలిసేలోపలే రాక్షసులు మరణించారు. అరుణిడి కోరిక ప్రకారమే అంతా జరిగింది.

ఈరకంగా భ్రమరముల సాయంతో రాక్షసులను సంహరించింది కాబట్టి ఆదేవికి భ్రామరి అని పేరువచ్చింది.

## భ్రామరీస్తుతి

నమోదేవీ! మహావిద్యే! సృష్టిస్థిత్యంతకారణి!
నమఃకమల ప్రత్యాక్షి! సర్వాధారే నమోస్తుతే॥

దుర్గే సర్గాది రహితే! దుష్ట సంరోధనార్గళే।
నిరర్గళ ప్రేమగమ్యే। భర్గే దేవి। నమోస్తుతే॥

నమశ్శ్రీకాళికే। మాతః నమో నీల సరస్వతి।
ఉగ్రతారే మహోగ్రేతే నిత్యమేవ నమోనమః॥

నమః పీతాంబరే దేవీ। నమస్త్రిపురసుందరి।
నమో భైరవి। మాతంగి। ధూమావతి। నమోనమః॥

ఛిన్నమస్తే నమస్తేస్తు క్షీరసాగర కన్యకే।
నమశ్శాకంబరి। శివే। నమస్తే రక్త దంతికే॥

నేతి నేతీతి వాక్యైర్యా బోధ్యతే సకలాగమైః।
సర్వప్రత్యత్స్వరూపాంతాం భజామః పరదేవతామ్॥

భ్రమరైర్వేష్టితా యస్మాత్ భ్రామరీయా త తస్మృతా।
తస్యై దేవ్యై నమోనిత్యం నిత్యమేవ నమోనమః॥

# 56. మాతృకాపీఠాలు

జ్ఞానానికి మూలంగా చెప్పబడే ఋగ్వేదంలో "అదిక్షకారన్తమూర్తిః ॥అంటే అకారమునుంచి క్షకారమువరకు ఉన్న యాభైఒక్క అక్షరముల రూపమే పరబ్రహ్మము అని చెప్పబడింది. అదే దేవీస్వరూపము. ఈమాతృకారూపిణినుండే సకల మంత్రశాస్త్రమూ ఆవిర్భవించింది. అందుకనే దేవి మంత్రమయి, మాతృకాపీఠరూపిణి అని చెప్పబడుతోంది. వాక్కుపరాపశ్యంతీ మధ్యమా వైఖరీ అని నాలుగు రకాలుగా చెప్పబడుతోంది. వాటిలో వైఖరీ వర్ణ స్థానాలయిన యాభైఒక్క పీఠాలు భారతదేశంలోని వివిధ ప్రదేశాలలో ఉన్నాయి. వీటినే మాతృకాపీఠాలు అంటారు. వాటి వివరాలు ఈక్రింద విధంగా ఉన్నాయి.

1.కామరూపము
2.వారణాసి
3.నేపాలము
4.పౌండ్రవర్ధనము
5.పురస్థిరము
6.కన్యాకుబ్జము
7.పూర్ణశైలము
8.అర్బుదము
9.అమ్రాతకేశ్వరము
10.ఏకామ్రము
11.త్రిస్రోతము
12.కామకోటకము
13.కైలాసము
14.భృగునగరము
15.కేదారము
16.పూర్ణచంద్రము
17.శ్రీపీఠము
18.ఓంకారపీఠము
19.జాలంధరము
20.మాలాఓత్కలము
21.కులాంతము
22.దేవీకోటము
27.రాజగేహము
28.మహాపధము
29.కోలాపురము
30.మేలాపురము
31.ఓంకారము
32.జయంతికము
33.ఉజ్జయిని
34.చిత్రము
35.క్షీరకము
36.హస్తినాపురము
37.ఓడ్డీశము
38.ప్రయాగ
39.షష్ఠము
40.మాయాపురము
41.జలేశము
42.మలయము
43.శైలము
44.మేరువు
45.గిరివరము
46మహేంద్రము
47.వామనము
48.హిరణ్యపురము

23.గోకర్ణము
24.మారుతేశ్వరము
25.అట్టమాసము
26.విరజము
49.మహాలక్ష్మీపురము
50.ఓడ్యాణము
51.ఛాయాఛత్రము

ఈయాభై ఒక్క పీఠాలకు సమానమైన స్థానాలు శ్రీచక్రంలోను, మానవదేహంలోను

శ్రీపర్వతం శిరస్థానే, కేదారంతు లలాటకే।
వారాణసీ మహాప్రాజ్ఞ, భ్రువోర్ర్ఘాణస్యమధ్యమే॥

కురుక్షేత్రంకుచస్థానే, ప్రయాగం వ్రాత్సరోరుహే।
చిదమ్బరంతు హృస్మధా ఆదారేకమలాలయమ్॥

ఆత్మతీర్థం సముత్సృజ్య బహి స్తీర్థాని యోవ్రజేత్।
కంఠస్థనమహారత్నం త్యక్త్వాకాచంవిమార్గతే॥

తీర్థానితోయపూర్ణావి, దేహానికాష్టాదినిర్మితాన్।
యోగినోనప్రపూజ్యంతే స్వాత్మప్రత్యయకారణాత్॥

శివమాత్మవి పశ్యన్తి ప్రతిమాసునయోగినః।
అజ్ఞానాం భావనార్థాయ ప్రతిమాః పరికల్పితాః॥

ఈరకంగా చెప్పటంవలన దేవి మాతృకావర్ణ రూపిణి, మాతృకాపీఠరూపిణి అయింది. 'అహంబ్రహ్మాస్మి' నేనే పరమాత్మస్వరూపాన్నసే అద్వైతానుభూతిసాధించిన యోగులు మాత్రమే సకలదేవతారూపిణి, సకలతీర్థ స్వరూపిణి, గణేశ,గ్రహ, నక్షత్ర, యోగినీ, రాశి, మంత్ర, మాతృకాపీఠరూపిణి అయిన ఆ దేవిని తమ శరీరమందు దర్శించి ధ్యానించగలుగుతారు.

# 57. దసరా

సంవత్సరకాలంలో యముని రంష్ట్రల వంటి ఋతువులు రెండు ఉన్నాయి. అవి 1.వసంత ఋతువు 2. శరదృతువు. ఈకాలం రుతి సంధి కాలం. ఈఋతువులు రోగకారకాలు. ఈసమయంలో వాతావరణంలో మార్పులు ఎక్కువగా వస్తాయి కాబట్టి ఆహారాన్ని క్రమబద్ధీకరిస్తే శరీరారోగ్యం బాగుపడుతుంది. అందుకే ఉపవాసం చేసేది. ఇలా చేస్తే శరీరంలోని రోగాలు పోతాయి.

ఆశ్వియుజ మాసంలో సూర్యుడు కన్యారాశిలో ఉంటాడు. అప్పుడు మనకు కనిపించే నక్షత్రాలు కన్యారాశి నక్షత్రాలు.అందుకే ఆరోజులలో స్త్రీరూపంలో ఉండేదేవిని పూజిస్తారు.

నవరాత్రులు అంటే తొమ్మిది రాత్రులు. సంఖ్యాశాస్త్రంలో తొమ్మిది సంఖ్య విశేషమైంది.

| | | |
|---|---|---|
| యజ్ఞోపవీతంలో ఉండే సూత్రాలు | - | తొమ్మిది |
| స్త్రీలు చేతికి కట్టుకునే తోరంలో సూత్రాలు | - | తొమ్మిది |
| శరీరానికి ఉండే రంధ్రాలు | - | తొమ్మిది |
| శ్రీచక్రంలోని ఆవరణలు | - | తొమ్మిది |

తొమ్మిదిసంఖ్యను ఏఅంకెతో హెచ్చవేసినా వచ్చేది తొమ్మిది. దాని విలువ మారదు. అందుకే సంఖ్యా శాస్త్రంలోతొమ్మిదికి ప్రత్యేక స్థానం ఉంది.

ఆశ్వయుజశుద్ధ పాడ్యమి నాడు కలశస్థాపన చేసి, దశమి వరకు ఆదేవిని పూజించాలి. భారతదేశంలోని అన్ని శక్తి ఆలయాలలోనూ ఈపూజ జరుగుతుంది.

| | | |
|---|---|---|
| కలకత్తాలో | - | కాళి |
| మైసూరులో | - | చాముండేశ్వరి |
| విజయవాడ | - | కనకదుర్గ |
| శ్రీశైలంలో | - | భ్రమరాంబ |

ఈరకంగా శక్తి ఆలయాలన్నింటిలోనూ పరమేశ్వరిని అర్చించటం జరుగుతుంది. భారతదేశంలో అతి ప్రాచీనమైన దేవాలయాలు చాలా ఉన్నాయి. వాటిలోఈపూజ అత్యంత వైభవంగా జరుగుతుంది. హిమాచల్‌ప్రదేశ్‌లోహట్‌కోటీ' లోయలో ఎనిమిదవ శతాబ్దానికి చెందిన దుర్గాదేవి ఆలయం ఉంది. ఆదేవి అష్టభుజ, సింహవాహిని. అక్కడ సాధకులు తొమ్మిదిరోజులూ ఉపవాసం చేస్తారు. రాత్రుళ్ళు మాత్రం పాలు, పళ్ళు తీసుకుంటారు.రాజస్తాన్‌లోనితానా"' అనే ప్రాంతంలో దుర్గా ఆలయం ఉంది. అక్కడ పూజారి తొమ్మిది రోజులూ ఉపవాసం ఉంటాడు. తొమ్మిదవ రోజు అతడికి పూనకంవచ్చి దేవి భవిష్యత్తు చెబుతుంది.

కృతయుగంలో మహాభక్తుడైన యక్షుడు పరమేశ్వరిని గురించి ఘోరతపస్సు చేశాడు. అతడి తపస్సుకు మెచ్చి దేవి ప్రత్యక్షమై ఏవరం కావాలో కోరుకోమంది.దానికి ఆయక్షుడు ఆదేవి తన తలమీద నివాసముండేటట్లు వరం అడిగాడు. ఆవరప్రభావంతోనే కృష్ణానదీ తీరాన ఇంద్రకీలాద్రిగా ఆయక్షుడు వెలిశాడు.పరమేశ్వరి ఆగిరి శిఖరంమీద సింహవాహనగా వెలిసింది. ఆప్రాంతమే ఆంధ్రప్రదేశ్‌లోని విజయవాడ. ఆదేవి కనకదుర్గ.

ఈరకంగా దేశంలోని ప్రతిచోటా దేవిఏదో ఒకరూపంలో పూజలందుకుంటున్నది. నవరాత్రులలో సాధకులు వారివారి ఆచారాల ప్రకారం దేవిని ఆరాధిస్తారు.

| | | |
|---|---|---|
| పాడ్యమి నుంచి | - | నవమి వరకు తొమ్మిది రోజులు |
| తదియనుంచి | - | నవమి వరకు ఏడు రోజులు |
| పంచమి నుంచి | - | నవమి వరకు ఐదు రోజులు |
| సప్తమి నుంచి | - | నవమి వరకు మూడు రోజులు |

ఈపూజ సాత్వికము, రాజసము, తామసము అని మూడు రకాలుగా జరుగుతుంది.

1. సాత్వికము - సత్యగుణప్రధానము.ఫలితము.మోక్షము
2. రాజసము - చతుర్విధ పురుషార్థాల కోసం చేసేది
3. తామసము - ఏవో సిద్ధులు సాధించాలని చేసేది.

నవరాత్రులలో దేవిని వివిధ ప్రాంతాలలో వివిధ రూపాలలో పూజిస్తారు. కొన్ని చోట్ల సప్తమాతృకలను

| | |
|---|---|
| 1. బ్రాహ్మి | 5. వారాహి |
| 2. మాహేశ్వరి | 6. మాహేంద్రి |
| 3. కౌమారి | 7. చాముండ |
| 4. వైష్ణవి | |

కొన్ని చోట్ల చండీదేవి అష్టమూర్తులను

| | |
|---|---|
| 1. ఉగ్రచండా | 5. చండా |
| 2. ప్రచండా | 6. చండవతీ |
| 3. చండోగ్రా | 7. చాముండా |
| 4. చండనాయకా | 8. చండికా |

సాధారణంగా దేవాలయాల్లో మొదటిరోజున ఆదేవి యొక్క రూపంలోనూ, మిగిలిన రోజులయందు వివిధరూపాల్లోనూ దేవి పూజ చేస్తారు. ఏవిధంగా దేవిని అలంకరించినా సప్తమి నుంచి చివరి నాలుగురోజులూ అన్ని చోట్లా ఒకే అలంకారం జరుగుతుంది. విజయవాడలోని కనకదుర్గ ఆలయంలో

| | | |
|---|---|---|
| పాడ్యమి | - | అలయదేవి అసలురూపం స్వర్ణకవచాలంకృతదుర్గాదేవి. |
| విదియ | - | మంగళగౌరి |
| తదియ | - | అన్నపూర్ణ |
| చవితి | - | లలిత |
| పంచమి | - | మహాలక్ష్మి |
| షష్ఠి | - | గాయత్రి |
| సప్తమి | - | (మూలా నక్షత్రం) సరస్వతి |
| అష్టమి | - | దుర్గాదేవి |
| నవమి | - | మహిషాసురమర్దని |
| దశమి | - | రాజరాజేశ్వరి. |

కేవలం దుర్గను మాత్రమే ఆరాధించేవాళ్ళు ఆమెను తొమ్మిది రూపాలలో పూజిస్తారు. అవి

1. శైలపుత్రి
2. బ్రహ్మచారిణి
3. చంద్రఘంటాదేవి
4. కూష్మాండాదేవి
5. స్కందమాత
6. కాత్యాయని
7. కాళరాత్రి
8. మహాగౌరి
9. సిద్ధమాత

ఈరకంగా వివిధ ప్రాంతాలలో ఆదేవిని వివిధ రూపాలలో పూజిస్తారు. పదవరోజు విజయదశమి. ఆరోజున దేవిని రాజరాజేశ్వరిగా పూజించి జమ్మి పూజ చేస్తారు. ఆరోజున అపరాజితా దేవిని కూడా పూజించే ఆచారమున్నది. రాజులు నవరాత్రులలో దేవిని అర్చించి దశమిరోజున జైత్రయాత్రకు బయలు దేరేవారు.

ఈరకంగా దసరా పండుగరోజుల్లో పరాత్పరిని ఆరాధించిన సాధకులకు కోరికలన్నీ తీరి ఇహపరాలు ఒనగూడుతాయి.

# 58. శైలపుత్రి

దక్షప్రజాపతి కుమార్తె దాక్షాయణి. ఈమే సతి' అని పిలువబడుతుంది. ఈమెకు శంకరుడితో వివాహమైంది. దక్షప్రజాపతి ఒకసారి యాగం చెయ్య తలపెట్టాడు. యాగానికి అందర్నీ పిలిచాడు. కానీ కూతుర్నీ అల్లుణ్ణీ మాత్రం పిలవలేదు. అయినప్పటికీ తండ్రి చేసే యాగం చూడాలని ఉబలాటం. అక్కడికి వెడదాం అంది శంకరుడితో. మీతండ్రి అందర్నీ పిలిచాడు. కావాలనే మనల్ని పిలవలేదు. మనం అక్కడికి వెడితే అవమానమేకాని గౌరవం దక్కదు అన్నాడు శంకరుడు. వినలేదు సతీదేవి. నువు రాకపోతే నేను ఒక్కత్తినే వెడతాను అంది. సరే నీఇష్టం అన్నాడు శివుడు.

దాక్షాయణి తండ్రి చేసే యాగానికి వెళ్ళింది. అక్కడ ఆమెను ఎవరూ పిలవలేదు, మాట్లాడలేదు. అన్నిచోట్లా తనకూ, తనభర్తకూ తిరస్కారమే ఎదురయింది. భరించలేక పోయింది. వెంటనే యోగాగ్ని సృష్టించి అందులో భస్మమైపోయింది.

సతీదేవి మరణ వార్తవినగానే విపరీతమైన ఆగ్రహంతో ఊగిపోయి వీరభద్రుణ్ణి సృష్టించి దక్షయజ్ఞం నాశనం చేయించాడు శివుడు. యజ్ఞమైతే నాశనమయింది. కాని దాక్షాయణి మాత్రం బ్రతకలేదు. సతీవియోగంతో పిచ్చిపట్టి దేశాల వెంబడి తిరుగుతున్నాడు శివుడు.

వజ్రాంగుడి కుమారుడు తారకాసురుడు. బ్రహ్మను గూర్చి ఘోరమైన తపస్సు చేసి తనతో సమానమైనవాడు ఈసృష్టిలో లేకుండా వరం పొందాడు.

ఆవరబలంతో దేవతలను బాధించటం మొదలు పెట్టాడు. ఈబాధలు పడలేక దేవతలంతా ఆపరమేశ్వరిని ప్రార్థించారు. అప్పుడు ఆదేవి ప్రత్యక్షమై శివుని కుమారుని వల్ల తారకాసురుడు మరణిస్తాడు. నాఅంశతో హిమవంతుడికి ఒక కుమార్తె పుడుతుంది. ఆమెకూ, శంకరుడికీ వివాహం చెయ్యండి. వారికుమారుడు తారకాసురుణ్ణి సంహరిస్తాడు అని చెప్పింది.

కాలక్రమంలో హిమవంతునికి కుమార్తె పుట్టింది. ఆమె పేరే హైమవతి, పార్వతి, శైలపుత్రి మొ॥వి. పార్వతీ పరమేశ్వరుల వివాహం జరిగింది. వారి కుమారుడే కుమారస్వామి. ఇతడే తారకాసురుణ్ణి సంహరించాడు.

ఈరకంగా పరమేశ్వరి అంశతో హిమవంతుడికి పుట్టిన కుమార్తె శైలపుత్రి.

ఈరకంగా వృషభవాహనయై కుడిచేత శూలము, ఎడమచేతిలో పద్మము ధరించి ఉంటుంది. నైవేద్యం కట్టుపొంగలి.

**వందే వాంఛిత లాభాయ చంద్రార్ధకృత శేఖరామ్।**
**వృషారూఢాం శూలధరాం శైలపుత్రీం యశస్వినీమ్॥**

# 59 బ్రహ్మచారిణి

నవదుర్గలలో రెండవది బ్రహ్మచారిణి. బ్రహ్మచారిణి అంటే తపశ్చారిణి. తపస్సును ఆచరించేది. ఈదేవి కుడిచేతిలో జపమాల ఎడమచేతిలో కమండలము ధరించి ఉంటుంది.

దక్షయజ్ఞ సమయంలో దగ్ధమై పోయిన సతీదేవి హిమవంతుడికి కుమార్తె హైమవతిగా పుట్టింది. చిన్నప్పటినుంచీ ఈమె శివుణ్ణే వివాహం చేసుకోవాలనుకునేది. ఒకరోజు నారదమహర్షి వచ్చి శంకరుణ్ణి భర్తగా పొందాలంటే అత్యంత ఘోర తపస్సు చేసి ఆయనను మెప్పించాలి అని చెప్పాడు. అప్పటినుంచీ ఆమె శంకరభగవానుణ్ని గూర్చి తపస్సు చెయ్యటం మొదలు పెట్టింది. తపస్సును ఆచరిస్తున్నది కాబట్టి జనులామెను తపశ్చారిణి అన్నారు. అదే బ్రహ్మచారిణి. ఆకాలంలో

| | | |
|---|---|---|
| వేయి సంవత్సరాలు | - | పండ్లు మాత్రమే తిని |
| వేయి సంవత్సరాలు | - | కేవలము కూరలు తిని |
| వేయి సంవత్సరాలు | - | చెట్ల ఆకులు తిని |
| వేయి సంవత్సరాలు | - | కేవలం జలం త్రాగి |
| వేయి సంవత్సరాలు | - | ఏమీ తినకుండా |

ఎండాకాలంలో చుట్టూ కట్టెలతో మంట పెట్టుకుని ఒంటికాలి మీద నిలబడింది. శీతాకాలంలో పీకలలోతు నీటిలో నిలబడి తపస్సు చేసింది. ఈరకంగా ఎన్ని విధాలుగా శరీరాన్ని కష్టపెట్టాలో అన్ని విధాలుగా కష్టపెడుతూ తపస్సు చేసింది. పర్ణము అంటే ఆకు. ఆకులు కూడా తినకుండా శివుని కోసం తపస్సు చేసింది కాబట్టి అపర్ణ అని పిలవబడింది.

ఈరకంగా తపస్సు చెయ్యటం వలన పార్వతి శరీరం చిక్కి శల్యమైపోయింది. ఈ స్థితిలో కుమార్తెను చూసి ఆమె తల్లి ఓయమ్మా! తపస్సు వద్దు అన్నది . ఉ అంటే ఓయమ్మా! మా అంటే వద్దు. ఉమా! ఒయమ్మా తపస్సు వద్దు అని చెప్పింది. అప్పటి నుంచీ పార్వతి ఉమా అని పిలవబడింది.

ఆమె తపస్సుకు లోకాలన్నీ వేడెక్కిపోయినాయి. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై తల్లీ! నీకోరిక ప్రకారము ఈశ్వరుడు నీకు భర్తగా లభిస్తాడు. ఇక తపస్సు చాలించు అన్నాడు.

ఈరూపంలో ఉన్న దేవి సిద్ధులకు అనంతమైన ఫలితాలిస్తుంది. త్యాగము, వైరాగ్యము,పెరుగుతాయి. మనస్సు నిశ్చలంగా ఉంటుంది. ప్రతి చోట విజయం సిద్ధిస్తుంది. నైవేద్యం పులిహోర

దధానా కర పద్మా భ్యా మక్షమాలా కమండలూ
దేవీ ప్రసీదతు మయి బ్రహ్మచారిణ్యనుత్తమా॥

# 60. చంద్ర ఘంటాదేవి

దుర్గాదేవి యొక్క తృతీయ రూపం చంద్రఘంట. పరమ శాంతమూర్తి. ఈమె తలపై అర్థ చంద్రాకార చంద్రుడు ఘంటాకారంలో ఉంటాడు. అందు చేతనే ఈమెను చంద్రఘంటాదేవి అంటారు. ఈమె శరీరం బంగారు రంగులో ఉంటుంది. పదిచేతులయందు కమండలము, కత్తి, గద, త్రిశూలము, పద్మము, ధనస్సు, బాణములు, జపమాల, అభయ, వరదముద్రలు ధరించి ఉంటుంది. సింహవాహనయై ఎప్పుడూ యుద్ధానికి సిద్ధంగా ఉంటుంది. ఈమె రూపానికి అత్యాచారులైన రాక్షసులు భయంతో కంపించిపోతారు.

ఈదేవి కృపవల్ల సాధకుల పాపాలన్నీ నశించిపోతాయి. సర్వాభీష్టాలూ నెరవేరుతాయి. ఈమె యుద్ధానికి సర్వదాసిద్ధంగా ఉంటుంది కాబట్టి, భక్తుల కష్టాలను త్వరగా నెరవేరుస్తుంది. ఈమె సింహవాహన. అందుచేత సాధకులు కూడా సింహపరాక్రమ వంతులౌతారు. భూతప్రేత పిశాచబాధలుండవు.

ఈమె సింహవాహనయై, ఆయుధ ధారియై ఉన్నప్పటికి భక్తులకు మాత్రం పరమశాంతమూర్తి. ఆమె కరుణవల్ల సాధకుని శరీరంలోని అన్ని అవయవాలు మంచి కాంతితో ప్రకాశిస్తుంటాయి. వారికి జ్ఞానమార్గం కనిపిస్తుంది. ఈదేవీ ఉపాసకులను చూసినంత మాత్రం చేతనే ప్రజలకు సుఖశాంతులు కలుగుతాయి.

సాధకులు నిష్కల్మషంగా, ఈదేవిని ఉపాశించాలి. ఇతరులకు హాని జరగాలని పూజచేసేవారు చివరకు తామే నాశనమైపోతారు. పరిశుద్ధమైన మనసుతో ఈదేవిని శరణువేడాలి.

ఆమెను ధ్యానిస్తే ఇహపర సౌఖ్యాలు రెండూ కలుగుతాయి.

**నైవేద్యం కొబ్బరి అన్నము**

**పిండజ ప్రవరారూఢా చండకోపాస్త్ర కైర్యుతా**
**ప్రసాదం తనుతే మహ్యం చంద్రఘంటేతి విశ్రుతా॥**

# 61. కూష్మాండాదేవి

దుర్గాదేవి యొక్క నాల్గవరూపం కూష్మాండాదేవి. తన యొక్క చిరునవ్వు ద్వారానే ఈ బ్రహ్మాండాన్నంతటినీ సృష్టించింది కాబట్టి ఈమె కూష్మాండాదేవి అని పిలవబడుతోంది. సృష్టి అనేది లేని నాడు ఈదేవి తన చిరునవ్వుతో జగత్తును సృష్టించింది. సృష్ట్యాది స్వరూపాలూ, ఆదిశక్తి ఈమే. ఈమెకు ముందు జగత్తు సృష్టి జరగనేలేదు.

సూర్యమండలాంతర్భాగంలో ఈమె నివసిస్తుంది. ఈమె శరీరము సూర్యకాంతులతో వెలుగొందుతుంది. ఆతేజస్సు వల్లనే దశదిశలూ ప్రకాశిస్తుంటాయి. ఈమె సింహవాహనారూఢయై ఉంటుంది. ఎనిమిది చేతులయందు వరుసగా

| | |
|---|---|
| 1. కమండలము | 5. చక్రము |
| 2. ధనస్సు | 6. గద |
| 3. బాణము | 7. అమృత కలశము |
| 4. పద్మము | 8. జపమాల |

ధరించి ఉంటుంది. ఈదేవికి ఇచ్చే బలులలో కూష్మాండ బలిచాలా ముఖ్యమైనది. కూష్మాండము అంటే గుమ్మడి కాయ. శరన్నవరాత్రులలో నాల్గవ రోజున కూష్మాండాదేవిని అర్చించాలి. ఈదేవిని ఉపాసించటంవల్ల రోగాలు, శోకాలు అన్ని నాశనమవుతాయి. ఆయురారోగ్య ఐశ్వర్యాలు కలుగుతాయి.

శాస్త్రోక్తంగా ఈదేవిని పూజించినట్లైతే సాధకుడికి ఐహిక ఆముష్మిక ఫలములు రెండూ దక్కుతాయి. ఈమె భక్త వశంకరి. సాధుశీల, భక్తుల పాలిట కల్పవల్లి. ఈమెను ధ్యానించినంత మాత్రంచేతనే సాధకునికి సర్వసౌఖ్యాలూ ఒనకూడతాయి.

<u>నైవేద్యం</u> అల్లపు గారెలు

సురా సంపూర్ణ కలశం రుధిరాప్లుత మేవ చ
దధానా హస్త పద్మాభ్యాం కూష్మాండా శుభదాస్తు మే॥

# 62. స్కందమాత

దుర్గాదేవి యొక్క ఐదవ అవతారం స్కందమాత. స్కందుడు అంటే దేవతాస్త్రీ సందర్శనమున వదలినటువంటి ఈశ్వర వీర్యము వలన పుట్టినవాడు. కుమారస్వామి.

దక్షుని కుమార్తెగా జన్మించి సతీదేవి యజ్ఞ సమయంలో తండ్రి చేసిన అవమానాన్ని తట్టుకోలేక యోగాగ్నిలో భస్మమై పోయింది. సతీ వియోగం తట్టుకోలేక శివుడు పిచ్చి వాడిలాగా తిరుగుతున్నాడు.

వజ్రాంగుడనే రాక్షసుడి కుమారుడు తారకాసురుడు బ్రహ్మవరప్రసాదియై దేవతలను నానాబాధలు పెడుతున్నాడు. అది భరించలేక దేవతలంతా పరమేశ్వరిని శరణువేడారు. అప్పుడు ఆమె తన అంశలో హిమవంతుడికి కుమార్తెగా పుడుతుంది. ఆమెకూ, శివునికీ వివాహం జరిపించండి. వారికి పుట్టిన బిడ్డడు తారకాసురుణ్ణి సంహరిస్తాడు అని చెప్పింది.

పరమేశ్వరి ఆజ్ఞాను సారమే శివ పార్వతుల కల్యాణం జరిగింది. వారిద్దరూ ఏకాంతరంగా కాలం గడుపుతున్నారు.

తన కన్నా బలవంతుడైన కుమారుడు శివునికి పుట్టబోతున్నాడు అని విని ఇంద్రుడు శివపార్వతుల ఏకాంతాన్ని భగ్నం చేయించాడు. అప్పుడు శివుడికి నేల మీదరేః పతనమైంది. దానినుంచి పుట్టినవాడు స్కందుడు. అతడే కుమారస్వామి. అతని యొక్క తల్లి స్కందమాత.

ఈమె చతుర్భుజ. ఒడిలో తనయుడైన కుమారస్వామి ఉంటాడు రెండు చేతులయందు పద్మాలు, మరి రెండు చేతులయందు అభయ వరద ముద్రలు కలిగి ఉంటుంది. ఈదేవి పద్మమునందు ఆసీనురాలై ఉంటుంది. కాబట్టి పద్మాసనా అని కూడా పిలవబడుతుంది.

ఈదేవి భక్తాభీష్టఫలప్రదాయని. కోరిన వారికి కొంగు బంగారము. ఈదేవిని ఉపాసించిన వారికి ఇహపరాలు రెండూ ఈడేరతాయి.

**నైవేద్యం దధ్యన్నము**

**సింహాసనగతా నిత్యం పద్మాశ్రిత కరద్వయా**
**శుభదాస్తు సదా దేవీ స్కందమాతా యశస్వినీ॥**

# 63. కాత్యాయని

దుర్గాదేవి ఆరవ స్వరూపం కాత్యాయని. పూర్వకాలంలో కతుడు అనే పేరుగల ఒక మహర్షి ఉండేవాడు. అతడు అమోఘమైన శక్తిసంపన్నుడు. ఇతని మనుమడు గోభిలుడు. సామవేదపండితుడు. ఇతణ్ణి ఉద్గాతగా ఉంచి దేవదత్తుడనే బ్రాహ్మణుడు పుత్రులకోసం యజ్ఞం చేశాడు. ఇతని వేద పారాయణకు దేవతలు సైతం ఇతణ్ణి అనేక విధాలుగా శ్లాఘించారు. ఇతని కుమారుడు కాత్యాయనుడు. విశ్వవిఖ్యాతుడైన మహర్షి.

రంభుడనే రాక్షసుడికి గేదె రూపంలో ఉన్న మహిష్మతి అనే అప్సరాంగన వల్ల కలిగిన వాడు మహిషాసురుడు. బ్రహ్మ వరప్రసాదియై దేవతలను అనేక రకాలుగా బాధించసాగాడు. అతని చేతిలో ఓడిపోయిన దేవతలు త్రిమూర్తులను ప్రార్థించారు. త్రిమూర్తుల సలహా మీద దేవతలంతా వారి వారితేజస్సులతో ఒకస్త్రీమూర్తిని సృష్టించారు. ఆమె మహిషాసురమర్ధని. ఆదేవిని మొదటగా ఆరాధించిన వాడు కాత్యాయనుడు. అందుచేతనే ఆమె కాత్యాయని అని పిలవడచింది. కాత్యాయనుడు ఈదేవిని ఆరాధించి తన పుత్రికగా పొందాడు.

ఆశ్వీయుజశుద్ధ సప్తమి, అష్టమి, నవమి, మూడురోజులు కాత్యాయనుడిచే పూజింపబడిన ఈదేవి దశమినాడు మహిషుణ్ణి వధించింది.

ఈమె చతుర్భుజములతో ఖడ్గము, పద్మము, వరద, అభయ ముద్రలు ధరించి ఉంటుంది. సింహవాహిని.

ఈదేవి అభీష్ట ఫలదాయని. భక్త వశంకరి. ఈమెను ఆరాధించిన వారు శత్రువులను తేలికగా జయించగలుగుతారు. జ్ఞాన సంపన్నులౌతారు. చతుర్విధ పురుషార్థాలూ పొందగలుగుతారు. వారిమాటకు ఎదురుండదు. సర్వత్రా పూజింపబడతారు.

**నైవేద్యం కేసరిబాత్**

**చంద్రహాసోజ్జ్వలకరా శార్దూల వరవాహనా**
**కాత్యాయనీ శుభం దద్యా ద్దేవీ దానవ ఘాతినీ॥**

# 64 కాళరాత్రి

దుర్గాదేవి యొక్క ఏడవరూపం కాళరాత్రి. కాటుక పూసినట్టుగా అతినల్లని శరీరం ఎర్రని కళ్ళు, తలమీద జుట్టంతా చిందర వందరగా ఉంటుంది. మెడలో ధగధగా మెరిసేహారము. మూడు నేత్రాలు కలిగి ఉంటుంది. ఈమె ముక్కు పుటాలనుంచి ఉఛ్వాస నిశ్వాసల రూపంలో అగ్నిజ్వాలలు వస్తుంటాయి. గాడిద మీద ఎక్కి ఉంటుంది. నాలుగు చేతులయందు లోహంతో చేయబడిన కంటము అనే ఆయుధము,ఖడ్గము, వరద, అభయ ముద్రలు ధరించి ఉంటుంది. చూడటానికి అతి భయంకరంగా ఉండే ఈదేవి పీడితులకు అభయాన్నిస్తుంది. సాధకులకు వరప్రదాయిని. అన్ని విధాలుగా అందరికీ శుభాన్నే ఇస్తుంది. కాబట్టి శుభంకరి అని కూడా పిలవబడుతోంది. భయంకరాకారంలో ఉన్న ఈదేవిని పూజించినంత మాత్రం చేత చెడు ఏమాత్రం జరగదు. అందరికీ మంచే జరుగుతుంది.

దుర్గా పూజలో ఏడవ రోజు కాళరాత్రి ఆరాధన జరుగుతుంది. ఈదేవి దుష్టులను నాశనం చేస్తుంది. రాక్షసులను సంహరిస్తుంది. భూత ప్రేత పిశాచాలు ఈమెపేరు విన్నంత మాత్రం చేతనే పారిపోతాయి. ఈమెను పూజించేవారికి అగ్ని భయము, చోర భయము, విషసర్ప భయము, శత్రు భయము ఉండవు.

ఈదేవి ఉపాసనలో నియమాలు తప్పనిసరిగా పాటించాలి.

నైవేద్యం శాకాన్నము

ఏకవేణీ జపాకర్ణ పూరా నగ్నా ఖరాస్థితా
లంబోష్ఠీ కర్ణికాకర్ణీ తైలాభ్యక్త శరీరిణీ
వామపాదోల్ల సల్లోహ లతాకంటక భూషణా
వర్ధన మూర్ధ ధ్వజా కృష్ణా కాళరాత్రి ర్భయంకరీ॥

# 65 మహాగౌరి

దుర్గాదేవి యొక్క ఎనిమిదవ రూపం మహాగౌరి. ఈమె ఎనిమిది సంవత్సరాల కన్య. గౌరవర్ణంలో ఉంటుంది. తెల్లని వస్త్రాలు ధరించి ఉంటుంది. చతుర్భుజ. నాలుగు చేతులయందు త్రిశూలము, డమరుకము, అభయ, వరద ముద్రలు ధరించి వృషభవాహనయై ఉంటుంది. శాంతమూర్తి.

దక్షుని ఇంట దగ్ధమైన దాక్షాయణి హిమవంతుని కుమార్తె పార్వతిగా జన్మించింది. చిన్నపట్టి నుంచీ శివుని తప్ప వేరొకరిని వివాహమాడను అని కఠోరమైన నియమాలతో తపస్సు చెయ్యటం ప్రారంభించింది. నిరాహారమై అనేక సంవత్సరాలు తపస్సు చేసింది. అప్పుడు ఆమె దేహం ఎండకు ఎండి, వానకు తడిసి నల్లగా మారి కృసించిపోయింది.

అమె తపస్సుకు మెచ్చి మమేశ్వరుడు గంగాజలంతో దేహాన్ని పరిశుద్ధం చేశాడు. అప్పుడు ఆమె శరీరం గౌరవర్ణంతో ప్రకాశించింది. అందుచేతనే అప్పటినుంచీ గౌరి అని పిలవబడింది.

నవరాత్రులలో ఎనిమిదవరోజున మహాగౌరిని ఉపాశిస్తారు. ఈమెను ఆరాధించటం వల్ల సాధకుల కల్మషాలన్నీ ప్రక్షాలనమై పోతాయి. సంచిత కర్మలు కూడా క్షాళనమౌతాయి. మామూలుగా అయితే సంచిత కర్మలు ఒక కల్పం పాటు అనుభవిస్తే గానీ తీరవు. అటువంటిది ఈదేవిని ఆరాధించటం వల్ల అవి నాశనమైపోతాయి. మహాగౌరి భక్తులు పవిత్రులై, పుణ్యాధికారులౌతారు. ఈదేవి కృపవల్ల అలౌకిక శక్తులు లభిస్తాయి.ఈదేవి భక్తసులభ. అభీష్టప్రదాయని.

నైవేద్యం చక్రపొంగలి

శ్వేతే వృషే సమారూఢా శ్వేతాంబరధరా శుచిః
మహాగౌరీ శుభం దద్యాన్మహాదేవ ప్రమోదదా॥

# 66 సిద్ధమాత

దుర్గాదేవి యొక్కతొమ్మిదవరూపం సిద్ధమాత. ఈమె చతుర్భుజ. సింహవాహన. చేతులయందు శంఖము, చక్రము, గద, పద్మము. ధరించి ఉంటుంది. ఆమెను ఆరాధించిన వారికి అష్టసిద్ధులు లభిస్తాయి. అష్టసిద్ధులు అంటే

| | | |
|---|---|---|
| 1. అణిమాసిద్ధి | - | సూక్ష్మరూపము పొందటము. (ఆకారం తగ్గించుకోవటము). |
| 2. మహిమాసిద్ధి | - | ఆకారము పెంచి వెయ్యటము. |
| 3. గరిమాసిద్ధి | - | ఎక్కువగా బరువు పెంచటము. |
| 4. లఘిమాసిద్ధి | - | బరువు బాగా తగ్గించటం |
| 5. ప్రాప్తి సిద్ధి | - | కావలసిన వస్తువులు సృష్టించటము. |
| 6. ప్రాకామ్యసిద్ధి | - | ఆకాశగమనము |
| 7. ఈశిత్వసిద్ధి | - | అన్నింటిమీద అధికారం పొందటము. |
| 8. వశిత్వసిద్ధి | - | సర్వభూతాలను లోబరచు కోవటము. |

బ్రహ్మవైవర్తపురాణంలో సిద్ధులు ఈవిధంగా ఉన్నాయి.

| | |
|---|---|
| 1.అణిమ | 10.దూరశ్రవణ |
| 2.లఘిమ | 11. పరకాయప్రవేశం |
| 3.ప్రాప్తి | 12.వాక్సిద్ధి |
| 4.ప్రాకామ్యం | 13.కల్పవృక్షత్వం |
| 5.మహిమా | 14. సృష్టి |
| 6.ఈశిత్వ | 15.సంహారము |
| 7.వశిత్వ | 16.అమరత్వం |
| 8.సర్వకాయ | 17. సర్వనాయకత్వం |
| 9.సర్వజ్ఞత్వ | 18.భావన |

సిద్ధమాతను గనక ఆరాధిస్తే సాధకులకు సర్వసిద్ధులూ లభిస్తాయి. శివుడు ఈమె దయవల్లనే ఈసిద్ధులు పొందాడు. ఈదేవీఉపాసకులకు లోకంలో కానిపని అంటూ లేదు.జగత్తుమీదనే అతనికి ఆధిపత్యం వస్తుంది.

నవరాత్రులలో తొమ్మిదవరోజున ఈదేవిని పూజించినవారికి ఇహ పరసుఖాలన్నీ ఒనగూడతాయి. నైవేద్యం చిత్రాన్నం

**సిద్ధ గంధర్వ యక్షాద్యై రసురై రమరైరపి**
**సేవ్యమానా సదా భూయాత్ సిద్ధిదా సిద్ధిదాయినీ**

# 67 భండాసురుడు

దేవతల యొక్క పనులు చక్కబెట్టటానికి ఆపరమేశ్వరి ఈలోకంలో అవతరించింది. దేవతల కార్యము రాక్షస సంహారము. లోకంలో ప్రముఖులైన రాక్షసులు ఇద్దరు..1.మహిషాసురుడు 2. భండాసురుడు

దక్షుని యొక్క కుమార్తె దాక్షాయణి యోగాగ్నిలో భస్మమైపోయింది. సతీవియోగంతో శివుడు చింతిస్తున్నాడు. పరమేశ్వరి దయవల్ల ఆమె అంశ హిమవంతుని కుమార్తె హైమావతిగా పుట్టింది. ఆమె ఈశ్వరుణ్ణి వివాహమాడగోరి తపస్సు చేస్తోంది. శివుడుకూడా తపోదీక్షలోనే ఉన్నాడు.

తారకాసురుడనే రాక్షసుడు బ్రహ్మవరప్రసాదియై దేవతలను బాధించటం ప్రారంభించాడు. ఈసృష్టిలోని ఏశక్తీ అతణ్ణి సంహరించలేదు. ఈశ్వరుని కుమారుని వల్లనే తారకాసుర సంహారాం జరగాలి.శివునితపస్సు భగ్నం చెయ్యటానికి ప్రయత్నించిన మన్మధుడు శివుని మూడవకంటినుంచి వచ్చిన అగ్నికి భస్మమైపోయాడు. ఆబూడిద తెల్లగా, మెత్తగా చూడడానికి అందంగా కనిపించింది. గణేసుడు ఆబూడిదను ముద్దగా చేసి చిత్రమైన ఆకారం గల పురుషుడిగా తయారుచేశాడు. ఆపురుషుడి ఆకారానికి ముగ్ధుడై బ్రహ్మదేవుడు భండభండ (ఆశ్చర్యము ఆశ్చర్యము) అన్నాడు. అంతే ఆపురుషుడికి భండుడు అనే పేరు స్థిరపడిపోయింది. అయితే రుద్రుని యొక్క కోపాగ్ని వల్ల ఏర్పడిన బూడిదనుంచి పుట్టిన వాడు కాబట్టి రౌద్రస్వభావం కలిగిన దానవుడైనాడు. అతడే భండాసురుడు.

భండాసురుడు మహాబలసంపన్నుడు. దేవతలను నానాబాధలు పెట్టటం మొదలు పెట్టాడు. ఆభాదలు భరించలేక దేవతలు పరమేశ్వరిని శరణువేడారు. చివరకు ఆరాక్షసుణ్ణి చంపటానికి పరమేశ్వరియే రావలసి వచ్చింది.

భండుడు అంటే లజ్జావిహీనుడు. అజ్ఞాని. సుఖదఃఖాలతో పీడింపబడే దేహి. అటువంటి అసుర సంహారం చేసి అజ్ఞానాన్ని నాశనం చెయ్యటమే భండాసురవధ. పరమేశ్వరికి, భండాసురిడికీ యుద్ధం మొదలైంది.

సంపత్కరి అనే పేరుగల దేవత గజసైన్యానికి అధిపతి. ఆమె పరమేశ్వరి అంకుశం నుంచి పుట్టింది. సంపత్కరీ దేవి రణకోలాహలము అనే ఏనుగు నెక్కి ఉంటుంది. కోట్లకొలది ఏనుగులు ఈమెను అనుసరించి ఉంటాయి. ఈదేవికి గజశాస్త్రం బాగా తెలుసు.

అశ్వారూఢ అనే దేవత పరమేశ్వరి పాశమునుంచి పుట్టింది. ఈమె అపరాజిత అనే పేరుగల గుఱ్ఱం ఎక్కి వాయువేగంతో తిరుగుతూ ఉంటుంది. ఈదేవి

అశ్వమునధిరోహించి ఉంటుంది కాబట్టి అశ్వారూఢ అనబడుతుంది. ఈమె అశ్వికబలానికి నాయకురాలు.

రథాలలో మూడు రకాలున్నాయి. 1.చక్రరాజము 2. గేయచక్రము 3. కిరిచక్రము పరమేశ్వరి చక్రరాజము అనే రథం ఎక్కింది. ఈరథము ఆనందధ్వజముతో, తొమ్మిది పర్వములతో, పదియోజనముల ఎత్తు, నాలుగు యోజనముల విస్తారము కలిగి ఉన్నది. పర్వములు అంటే ఆవరణలు.

చక్రరాజము అంటే శ్రీచక్రమే. భండాసురుని వేదవిరుద్ధ చర్యలకు పరమేశ్వరి అనుష్టించు దండనలే ప్రతిక్రియలు. ఈరథంలోని తొమ్మిది ఆవరణలలోను వివిధ దేవతలు ఆయుధాలు ధరించి ఉన్నారు. తొమ్మిదవ ఆవరణలో ఆపరమేశ్వరి ఉన్నది.

పరమేశ్వరికి పదహారు మంది మంత్రులున్నారు. వీరు వరుసగా

| | | | |
|---|---|---|---|
| 1.సంగీతయోగిని | 5. మంత్రిణీ | 9. వీణావతీ | 13. నీపప్రియా |
| 2. శ్యామ | 6. సచివేశానీ | 10. వైణికీ | 14. కదంబవేశ్యా |
| 3. శ్యామల | 7. ప్రధానేశా | 11. మంద్రిణీ | 15. కదంబవనవాసినీ |
| 4. మంత్రనాయికా | 8. కుశప్రియా | 12. ప్రియకప్రియా | 16. సదామాలా |

ప్రధానమంత్రిణి శ్యామల. ఈవిడ గేయచక్రం అనే రథం ఎక్కి పరమేశ్వరికి కుడి వైపు ఉంటుంది. ఈరథానికి ఏడు ఆవరణలున్నాయి. ఈఏడు ఆవరణలకు క్రింది భాగాన లక్ష్మి, సరస్వతి, శంఖనిధి, పద్మనిధి ఉంటాయి. వీరికి పైన గణపతి క్షేత్రపాలక, దుర్గా, వటుకాదిదేవతలు, అన్ని ఆవరణలలోను ఆయుధ పాణులైన దేవతలుఉంటారు. పరమేశ్వరికి ప్రధానసేనాని వారాహి. మొత్తం పన్నెండు మంది సేనానులు వారు వరుసగా

| | | | |
|---|---|---|---|
| 1. పంచమి | 4. సమయేశ్వరి | 7. పోత్రిణీ | 10. ఆజ్ఞాచక్రేశ్వరి |
| 2. దండనాధా | 5. సమయసంకేతా | 8. శివా | 11. మహాసేనాని |
| 3. సంకేతా | 6. వారాహీ | 9. వార్తాళీ | 12. అలిందిని |

వారాహీదేవి కిరిచక్రము అనే రథాన్ని అధిరోమించి పరమేశ్వరికి ఎడమవైపు ఉంటుంది. ఈరథం వరాహరూపంలో ఉంటుంది. వరాహాల చేత లాగబడుతూ ఉంటుంది. వారాహి చేతిలో దండము ధరించి ఉంటుంది కాబట్టి ఈమెను దండనాయిక అంటారు. ఈరథానికి ఐదు అంతస్తులుంటాయి. వాటిలో వివిధ రకాల దేవతలు ఆయుధపాణులై ఉంటారు.

షోడశనిత్యలలో పద్నాల్గవది జ్వాలామాలిని, ఈమె అగ్నిరూపిణి. పరమేశ్వరి ఆజ్ఞమీద ఈదేవి వందయోజనాల వైశాల్యము, ముప్పై యోజనాల ఎత్తుగల అగ్ని జ్వాలను పరమేశ్వరి సేనచుట్టూ సృష్టించింది. ఈరకంగా సృష్టించిన అగ్ని వలయంలో తన సేనావాహినితో బాటు పరమేశ్వరి ఉన్నది.

భండాసురుని సైన్యాన్ని వధించటానికి అరవైనాలుగుకోట్ల శక్తి సైన్యము బయల్దేరింది. దేవదానవుల మధ్య యుద్ధం ఘోరంగా జరుగుతోంది. అందులో

నిత్యాదేవతలు విజృంభించారు. యుద్ధం జరుగుతుండగా రాత్రి సమయంలో, చీకటిలో శక్తిసైన్యము వెనుక వైపు నుంచి భండాసురుని సైన్యాన్ని చుట్టు ముట్టింది. నిత్యలలో జ్వాలామాలిని, వహ్నివాసిని అనేవారు అగ్నిస్వరూపులు కాబట్టి వారి కాంతిలో

1.దమనక 3. హబక

2. దీర్ఘజిహ్వ 4. హేలుమల్ల

మొదలైన పదిహేను మంది భండాసురుని సేనానులను శక్తిసైన్యము చంపివేసింది.

పరమేశ్వరికి ఇరుప్రక్కలా శ్యామలా, దండనాయికలు, ముందు వెనుకల సంపత్కరీ, అశ్వారూఢ నుంచుని ఉండగా భండాసురుని ముప్పైమంది కుమారులు ఒకేసారి ముందు వెనుకలనుంచి వచ్చి ముట్టడించారు. అప్పుడు బాలాత్రిపుర సుందరి పరమేశ్వరి అజ్ఞతో ఆరాక్షసవీరులందర్నీ చంపివేసింది. భండాసురుడి కుడిభుజం నుంచి విశుక్రుడు, ఎడమభుజం నుంచి విషంగుడు అనే రాక్షసులు పుట్టారు. శ్యామలాదేవి విషంగుణ్ణి, వారాహి విశుక్రుణ్ణి చంపివేశారు.

భండాసురుడు తననోటినుంచి అనేక మంది రాక్షసవీరులను సృష్టించాడు. అందులో నామని ఒకతె. ఈమెకు కేకసుడు అనే రాక్షసుని తో వివాహంజరిగింది. వీరికి ఎనిమంది కుమారులు. వీరుకూడా యుద్ధానికి వచ్చారు. పరమేశ్వరి సేన వీరందర్నీ కూడా సంహరించింది.

విశుక్రుడు మరణించకముందు యుద్ధంలో దేవతలకు విజయం సిద్ధించకుండా విజయ విఘ్నయంత్రము అనే ఒక యంత్రాన్ని తయారు చేసి శక్తి సైన్యము మధ్యనస్థాపించాడు. ఈయంత్రం శిలా నిర్మితం. రెండు క్రోసుల వైశాల్యంతో ఎనిమిది కోణాలు, ప్రతికోణం దగ్గరా ఒక శూలం, ఎనిమిది దిక్కులందు ఎనిమిది శక్తులు కలిగి ఉంటుంది. ఈ యంత్ర మహిమవల్ల దేవసైన్యం త్వరగా అలసిపోయి నిద్రపోతోంది. వారిలో పిరికితనం వస్తోంది. యుద్ధం మీద ఆసక్తి తగ్గుతోంది. ఈవిషయం మంత్రి, సేనానులు పరమేశ్వరికి నివేదించారు. అప్పుడు ఆమె మహాగణపతిని సృష్టించింది. ఆగణపతి ఈయంత్రాన్ని నాశనం చేశాడు.

పరమేశ్వరికీ, భండాసురుడికీ మధ్యఘోరమైన పోరు ప్రారంభమైంది. అసురుడు రాక్షసాస్త్రాలను, దేవి దివ్యాస్త్రాలను ప్రయోగించారు. దేవి చేతి గోళ్ళనుంచి దశావతారాలు పుట్టి భండాసురుడు సృష్టించిన రాక్షసులను చంపివేశాయి. పాశుపతాస్త్రంతో దేవి రాక్షస సేనలను చంపివేసింది. చివరకు పరమేశ్వరి కామేశ్వరాస్త్రముతో భండాసురుణ్ణి చంపి అతని రాజధాని అయిన శూన్యక నగరాన్ని నాశనంచేసింది.

ఈవిధంగా దేవి భండాసురుణ్ణి సంహరించి సమస్తలోకాలను కాపాడింది ఇది చూసిన బ్రహ్మాది దేవతలు పరమేశ్వరిని వేనోళ్ళ కొనియాడారు.

# 68. పరమేశ్వరి - పరబ్రహ్మ స్వరూపం

పరమేశ్వరుడు నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అతడు ఈ రకంగా ఉంటాడని ఎక్కడా చెప్పబడలేదు. కాని, అనుభవజ్ఞులైన బ్రహ్మవేత్తలు చెప్పినదానిని బట్టి పరబ్రహ్మస్వరూపం ఈ విధంగా ఉంటుంది.

వరుణమహర్షి కుమారుడు భృగుమహర్షి. అతడు విద్యాభ్యాసం పూర్తిచేసి తండ్రివద్దకు వెళ్ళి బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశించమని అడుగుతాడు. దానికి వరుణమహర్షి "బ్రహ్మజ్ఞానం చెబితే తెలిసేదికాదు. కొంతకాలం తపస్సు చేస్తే అది నీకు బోధపడుతుంది. వెళ్ళితపస్సుచెయ్యి." అన్నాడు. తండ్రి సలహామేరకు భృగువు తపస్సు చేశాడు. ఈలోకంలో జీవించటానికి ఆధారమైనది అన్నము. అన్నమువల్లనే అన్ని ప్రాణులు వృద్ధిచెందుతాయి. మరణించిన తరువాత కూడా అన్న రూపమైన ఈ పృథివిలోనే అన్ని జీవరాసులు కలిసిపోతాయి. అన్నానికి మించిన ఆధారం మరొకటి లేదు. అన్నమే పరబ్రహ్మస్వరూపం. అని భృగువుకు తెలిసింది. ఆశ్రమానికి వచ్చి అదేమాట తండ్రికి చెప్పాడు. తండ్రి ఒప్పుకోలేదు. అన్నం జీవించటానికి ఆధారమే కాని అదే పరబ్రహ్మస్వరూపం కాదు. కాబట్టి ఇంకొంతకాలం తపస్సు చెయ్యి అన్నాడు. భృగువు మళ్ళీ తపస్సు చేశాడు. ఈసారి సమస్త ప్రాణులు ప్రాణమువల్లనే జీవిస్తున్నాయి. జన్మించిన ప్రాణులు ప్రాణము వల్లనే రక్షించబడుతున్నాయి. శరీరంలోంచి ప్రాణము గనక పోతే శరీరం నాశనమయిపోతుంది. కాబట్టి ప్రాణమే బ్రహ్మస్వరూపం అని తెలిసింది. అదేమాట తండ్రికి చెప్పాడు భృగువు కాదు ఇంకొంతకాలం తపస్సు చెయ్యి అన్నాడు తండ్రి అయిన వరుణమహర్షి. ఈసారి భృగువుకు మనస్సే పరబ్రహ్మమని తెలిసింది. మనస్సు వల్లనే ప్రాణులు ఉత్పన్నమౌతున్నాయి. స్త్రీపురుషుల మానసికమయిన ప్రేమపూరిత సంబంధ బాంధవ్యాలవల్ల ప్రాణి బీజరూపంలో మాతృగర్భంలో ప్రవేశిస్తుంది. వృద్ధిపొందుతుంది. బయటపడుతుంది. పుట్టినతరువాత కూడా మనసును ఆధారంగా చేసుకునే ప్రాణి ఇంద్రియాల సాయంతో సర్వ జీవనోపయోగ వస్తువులను తనకనువుగా మలచుకుని జీవపరిరక్షణ చేసుకుంటుంది. అలాగే చనిపోయిన తరువాత శరీరంలో నుంచి ప్రాణము ఎగిరిపోతుంది. ఇంద్రియాలకు జ్ఞానం ప్రసాదించే శక్తి మృగ్యమైపోతుంది. ఇంద్రియాలన్నీ మనసునాశ్రయిస్తాయి. ఈ భావనలన్నీ మనస్సే బ్రహ్మమనే నిర్ణయానికి దారితీశాయి. అదేమాట తండ్రికి చెప్పాడు భృగువు. ఇంకొంత కాలంతపస్సుచేయమన్నాడు తండ్రి. ఈసారి విజ్ఞానమే పరబ్రహ్మస్వరూపం అనుకున్నాడు భృగువు.కాదన్నాడు

తండ్రి. మళ్ళీ తపస్సు చేశాడు భృగువు. ఇప్పుడు తెలిసింది ఆనందమే పరబ్రహ్మస్వరూపము. సర్వమూ ఆనందాన్నుంచే జనిస్తూ, ఆనందాన్ని అనుభవిస్తూ మళ్ళీ ఆనందంలోనే లీనమౌతున్నది. ఆనందం అన్నింటికన్నా ఉత్తమంగా పరమాత్మరూపాన్ని స్పష్టంచేసే తత్త్వం. ఇదేమాట తండ్రికి చెప్పాడు భృగువు. అప్పుడు వరుణమహర్షి పరబ్రహ్మరూపాన్ని వివరిస్తూ ఆనందమే పరబ్రహ్మస్వరూపం. అయినా అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాలుకూడా బ్రహ్మస్వరూపాలే. ఇవి ఒకదానికన్న ఒకటి సూక్ష్మమైనవి. అన్నింటికన్నా మించినది ఆనందమయమైన బ్రహ్మానుభూతి. అన్నబ్రహ్మోపాసనద్వారా క్రమంగా ఆనందబ్రహ్మ సాక్షాత్కారం కలుగుతుంది. కాబట్టి అన్నాన్ని ఎప్పుడూ నిందించరాదు. ప్రాణము, మనస్సు సర్వస్వమూ అన్నంమీదనే ఆధారపడి ఉన్నాయి. అందుచేత అన్నాన్ని నిర్లక్ష్యం చెయ్యరాదు. అన్నాన్ని పూజిస్తే ఆతరువాతవన్నీ లభిస్తాయి. అందుకే అన్నం పరబ్రహ్మస్వరూపం అంటారు. అహారాన్ని విసర్జించకుండా ప్రాణం నిలుపుకుంటూ, మనసును వికసింపచేసుకుంటూ, విజ్ఞానమయానుభవాన్నుంచి బ్రహ్మానందం పొందాలి.

గౌతముని శిష్యుడు సత్యకామజాబాలి. బ్రహ్మజ్ఞాన జిజ్ఞాసి. గురువుగారి ఆజ్ఞమేరకు అడవిలో పశువులు మేపుతుంటాడు. అప్పుడు ఒక ముసలిఆబోతు అతనివద్దకు వచ్చి "సత్యకామా నీకు బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశిస్తాను విను. పరబ్రహ్మస్వరూపం నాలుగుపాదాలుగా ఉంటుంది. అందులో మొదటిపాదాన్ని నేను చెబుతాను. చరాచర జగత్తులోని నాలుగు దిక్కులూ పరబ్రహ్మస్వరూపమే". అని చెబుతుంది. రెండవపాదాన్ని అగ్నిదేవుడు చెబుతాడు. భూమి ఆకాశము సప్తసముద్రాలు, నదీనదాలు, అడవులు, కొండలు, ఎడారులు అన్నీ బ్రహ్మమయమే. మూడవపాదాన్ని ఒకహంసచెబుతుంది. అగ్ని, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, విద్యుల్లతలు అన్నీ పరబ్రహ్మస్వరూపమే. నాల్గవపాదాన్ని ఒక నీటిపక్షి పూర్తిచేస్తుంది. ప్రాణం బ్రహ్మ దృష్టి, శ్రవణం, మనస్సు, ఇవన్నీ బ్రహ్మమయాలే. ఈరకంగా చరాచరజగత్తు అంతా బ్రహ్మమయమై ఉన్నది.

ఉపకోశలుడికి అగ్నులు బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశిస్తాయి. అనందమే బ్రహ్మ ఆకాశమే బ్రహ్మ అకాశమంటే హృదయాకాశం. అక్కడే పరబ్రహ్మ ఉంటుంది. ఆనందమనేది పరబ్రహ్మయొక్క సహజరూపం. పంచభూతాలు, తన్మాత్రలూ బ్రహ్మస్వరూపాలే. సూర్యునిలోను, అగ్నిలోను ఉండే బ్రహ్మతత్త్వం ఒకటే. తూర్పు,

పడమర మొదలైన దిక్కులయందు నక్షత్రాలలో, నీటిలో ఉన్న తత్త్వము, మనలో ఉన్నతత్త్వము ఒకటే. ఆకాశంలోని మెరుపులో ఉన్నతత్త్వం, మనలోని తత్త్వం ఒకటే. అన్ని చోట్లా వ్యాపించిఉన్నది ఆత్మతత్త్వమే. అదే బ్రహ్మతత్త్వం. విశాలమైన విశ్వమంతా వ్యాపించి ఉన్నది అదే. ఆత్మత్త్వం తెలిస్తే సాధకుడికి బాధలు, భారాలు, దూరమవుతాయి. అతడు తామరాకుమీద నీటిబొట్టులాగా మననును దుష్ప్రభావానికి లోనుకానీయకుండా బ్రహ్మానందం పొందగలుగుతాడు.

ఈ రకంగా ఉపనిషత్తులలో అనేకచోట్ల అనేకసార్లు పరబ్రహ్మతత్త్వాన్ని వివరించటం జరిగింది. వీటిని క్రోడీకరిస్తే బ్రహ్మ సత్యము. అదినిత్యము, శాశ్వతమైనది. అదే ఆది అనాది. పరబ్రహ్మ కంటికి కనిపించేవస్తువులయందు, కనిపించని వస్తువులయందుకూడా ఇమిడి ఉన్నాడు. చరాచర జగత్తులోని నదీనదాలు, అడవులు, కొండలు, ఎడారులు, సముద్రాలు, నేల, నింగి, సూర్య చంద్రులు, నక్షత్రాలు, పంచభూతాలు, తన్మాత్రలు, చెట్లుచేమలు, క్రిమికీటకాలు,సకల జంతుజాలము, సర్వమానవాళి అన్నీ పరబ్రహ్మస్వరూపమే, మానవుని హృదయాకాశమే పరమాత్మ నివాసస్థానము. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాలమధ్యన ఆనందమయకోశంలో పరమాత్మ నివాసముంటాడు. అందుకే ఆనందమే పరబ్రహ్మస్వరూపం అని చెప్పబడింది. అయితే ఆపరబ్రహ్మ అవిద్య అనబడే అజ్ఞానంతో కప్పబడి ప్రపంచరూపమైన భ్రమ కలిగిస్తుంది. ఇది రజ్జు సర్పభ్రాంతి. స్థాణుపురుషభ్రాంతి. ఆభ్రమయే సంసారము. భగవంతుడు వేరు భక్తుడు వేరు అనుకుంటే ద్వైతభావము. కాని భగవంతుడు వేరు భక్తుడు వేరుకాదు. ఇద్దరూ ఒకటే. ఇదే అద్వైతసిద్ధాంతము. జీవాత్మా పరమాత్మా రెండూ ఒక్కటే. బ్రహ్మసత్యం జగన్ మిథ్య. బ్రహ్మఒక్కటే సత్యము. ఈజగత్తు అంతా మిథ్య.

పరమేశ్వరుడు నిరాకారుడు నిర్గుణస్వరూపుడు. ఈ బ్రహ్మాండమంతా తానే అయిఉన్నాడు. నిరాకారుడైన పరబ్రహ్మ బ్రహ్మాండమంతా తానే అయిఉన్నాడు. నిరాకారుడైన పరబ్రహ్మోపాసన కేవలం యోగులకు, సిద్ధులకు తప్ప ఇతరు లెవరికీ సాధ్యంకాదు. సామాన్య మానవులకు అందుబాటులో ఉండటానికే ఆ పరబ్రహ్మ స్వరూపం ఆకారం దాల్చింది. అదేపరమేశ్వరి. ఆమె ఈ ప్రపంచంలో పంచభూతాలు, తన్మాత్రలు సృష్టించింది. సత్వరజస్తమోగుణాలకు ప్రతీకలైన త్రిమూర్తులను సృష్టించింది. వారికి శక్తు లిచ్చింది. వారు ఏఏ పనులు చెయ్యాలో వివరించింది. వాళ్ళకి ఏవైనా ఆపదలు వచ్చినప్పుడు రక్షిస్తుంది.

దేవకార్యాలు పూర్తి చెయ్యటానికి భూలోకంలో అవతరించి రాక్షస సంహారం చేస్తుంది. ఈజగత్తు అంతా పరమేశ్వరి స్వరూపం. సృష్టించేది, లయం చేసేదికూడా ఆమే. చరాచరజగత్తులో జీవమున్నవి. జీవం లేనివి, చలనమున్నవి, చలనం లేనివి, అన్ని పదార్థాలు ఆమే. ఆమె కానిది ఏదీలేదు. విద్య ఆమె అవిద్యా ఆమే. సంపదలిచ్చే లక్ష్మి ఆమె. దరిద్రదేవతా ఆమే. కాళరాత్రి, ప్రళయరాత్రి, మోహరాత్రి అన్నీ ఆమే దేవతలకు ఆహుతులర్పించే స్వాహామంత్రము, పితృదేవతలకు తర్పణలందించే స్వధా మంత్రముకూడా ఆమే.

దేవతలకు ఆహారమైన అమృతము ఆమె. ఓంకారము ఆమే. నాదము శబ్దము ఆమే. జ్ఞానమయి ఆమే.అజ్ఞానమయి ఆమే బుద్ధి, మతి, భ్రాంతి, లజ్జ, పుష్టి, తుష్టి, శాంతి, ఓరిమి, అన్ని రూపాలు ఆమెవే. కత్తి,డాలు, శూలము, శంఖము, చక్రము, గద, ధరించిన భయంకర స్వరూపిణి ఆమె. అశుభమూ ఆమే. క్షేమంకరి శుభంకరి కూడా ఆమే. అత్యంత శుభప్రదమయినది ఆదేవి. వస్తువులకు ప్రాణులకు చలనం కలిగించే శక్తికూడా ఆమెయే.

ఈ రకంగా అన్ని తానే అయి ఆ పరబ్రహ్మ స్వరూపమై పరమేశ్వరి తనభక్తుల కోరికలు తీర్చి వారికి శాశ్వతమైన ఆనందము అంటే ముక్తిని ప్రసాదిస్తున్నది. తనను నమ్మినవారిని తనలో లీనము చేసికుంటున్నది.

---

## మా వద్ద క్రింది సంస్థల గ్రంథములు లభించును

| | | |
|---|---|---|
| 1. | వేంకట్రామ అండ్ కో | విజయవాడ |
| 2. | వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ | మద్రాస్ |
| 3. | బాల సరస్వతి బుక్ డిపో | ,, |
| 4. | అరుణా బుక్ డిపో | ,, |
| 5. | సి.వి. కృష్ణా బుక్ డిపో | ,, |
| 6. | ఎన్.వి. గోపాల్ అండ్ కో | ,, |
| 7. | శ్రీ రామకృష్ణ మఠం | ,, |
| 8. | శ్రీ నోరి సూర్యనారాయణ ఛారిటబుల్ ట్రస్ట్ | ,, |
| 9. | రామకృష్ణ పబ్లికేషన్స్ | ,, |
| 10. | ఠాగూర్ పబ్లిషింగ్ హౌస్ | హైదరాబాద్ |
| 11. | శ్రీ గోపాల్ పబ్లికేషన్స్ | ,, |
| 12. | శ్రీ కృష్ణానంద మఠం | ,, |
| 13. | ఆర్ష విజ్ఞాన ట్రస్ట్ | ,, |
| 14. | శ్రీ వేంకటేశ్వర ఆర్ష భారతి విజ్ఞాన ట్రస్ట్ | ,, |
| 15. | సంస్కృత భాషా ప్రచార సమితి | ,, |
| 16. | వరల్డ్ టీచర్స్ ట్రస్ట్ (అన్ని శాఖల గ్రంథములు) | ,, |
| 17. | శ్రీ చల్లా లక్ష్మీనరసింహశాస్త్రి అండ్ సన్స్ | మచిలీపట్నం |
| 18. | శ్రీ ఆర్యానంద ప్రెస్ | ,, |
| 19. | త్రివేణి పబ్లికేషన్స్ | ,, |
| 20. | శ్రీ శుకబ్రహ్మ ఆశ్రమము | శ్రీకాళహస్తి |
| 21. | శ్రీ వ్యాసాశ్రమము | ఏర్పేడు |
| 22. | సాధన గ్రంథ మండలి | తెనాలి |
| 23. | జనప్రియ పబ్లికేషన్స్ | ,, |
| 24. | వి.జి. పబ్లికేషన్స్ | ,, |
| 25. | గొల్లపూడి వీరాస్వామి సన్ | రాజమండ్రి |